# చదువు - సంస్కారాలు

రచన:

పి. యం. శర్మ

ఆదిశంకర్ బుక్ డిపో
నారాయణగూడ :: హైదరాబాద్

# అంకితం

దెబ్బతగిలితే 'అమ్మ'ను తలుచుకొంటాం. కష్టతరమైన పని తీరినప్పుడు 'అమ్మయ్య' అంటాం. ఈ యిద్దరూగాక ఇంకో పరోక్షమైన 'అమ్మ'కు ఇప్పటివరకూ నన్ను ఎలిపి పెంచిన 'అమ్మ'కు

ఇది నా మొదటికానుక.

—రచయిత

# స్వవిషయం

చదువెంతటిదైనా, ఎలాటిదైనా సంస్కారభావం లేనిదే రాణించదు. "సంస్కారభావం భావం మాత్రమేగాక జీవితంలో ప్రయోగించి అనుభవాన్ని గడించడమే జీవితం" అని సోక్రటీసు సిద్ధాంతం. కేవలం ఓర్పు పేరుతో నోరు మూసుకోవాలి అని ఆయన అభిప్రాయంకాదు.

ఈ భావం సమన్వయించుకుంటూ ఓరిమికి వీలైన హద్దు నిచ్చి తీర్పుని లక్ష్యించి 'చదువు - సంస్కారాలు' అనే పేరుతో ఈ కథ వ్రాయటం జరిగింది. దీనిలో డాక్టరు బెల్టిన్‌యొక్క సిద్ధాంతాన్ని ప్రధానాంశముగా తీసుకున్నాను. "రూప గుణ విద్యాసంపన్నురాలైన స్త్రీనే వివాహమాడ గోరినవాడిని కేవలం భగవంతుడే రక్షించాలి; అలాటి స్త్రీ లభించిన తరువాత ఆ పురుషుని భగవంతుడుగూడా రక్షించలేడు" అన్నది బెల్టిన్ సిద్ధాంతం.

అయితే 'సౌజన్యమైన ఓర్పు సౌహార్దికమైన తీర్పు' చదువుల సంస్కారంవల్లనే ఏర్పడుతుంది - అని నా అభిప్రాయం. అందువల్ల బెల్టిన్ సిద్ధాంతంలోని రెండవభాగము 'అలాంటి స్త్రీ లభించిన తరువాత ఆ పురుషుని భగవంతుడుగూడా రక్షించలేడు' అన్న విషయం అసంభవం.

ఈ విషయాల్నే దృష్టిలో నుంచుకొని, కొన్ని ఆర్థిక శాస్త్రవిధానాలతోబాటు ఈ పుస్తకం వ్రాశాను.

—రచయిత.

5



“చూడండీ! మా వాడికి చదువుకోడం రాదనీ, పాఠాలు రావనీ పాస్ కాలేదనీ నా అభిప్రాయంకాదు. లోకజ్ఞానంలేదని. దానికే నా యెదురుచూపు. ఎంత ఆస్థి ఉన్నా లోకజ్ఞానం లేనివాడి బ్రతుకు నలుగురిలో చులకనైపోతుంది; కష్టతరమౌతుంది. ఇదే నన్ను పీడిస్తోన్న బాధ.” మాట్లాడుతున్న ముసలి కంఠంలో చాలా బాధ ధ్వనించింది. అందుకే శ్రద్ధగా వింటోంది సుశీల.

“మీరు పెద్దలు; మీకు ఎదురుచెప్పే సాహసం నాకు లేదు. ఐనా, ఒక విషయం ఆలోచించండి. నేను పాఠాలు చెప్పి బాధ్యత వదిలించుకొనే వాడ్ని. పైగా, ఈ కాలేజీలో ఎమ్. పి. సి. కి సీటు దొరకడమంటే మాటలుకాదు. ఏ మాత్రం తెలివితక్కువైనా, వెనుదిరిగిపోవలసిందే. ఇక పై విషయం నేను హామీ యివ్వలేనుగాని, నాకు చేతనైనంత వరకూ మీరడిగినట్లు పాటు పడతాను. సరేనా!” లెక్చరర్ చెప్పిన మాటలు సరసంగానే ఉన్నాయి.

"సరే, తమదయ. అబ్బాయిని మీకు ఒప్పగిస్తున్నాను, నాకు శెలవియ్యండి." అంటూ ముసలాయన బయటికిరాగా "శలవు మాస్టారూ" అంటూ ఓ యువకుడు కూడా ఇవతలి కొచ్చాడు. అతెడ్ని చూసి, "ఈరోజు మా క్లాసులో చేరిన కొత్తబ్బాయి" అనుకొంది సుశీల.

"అతను తెలివితక్కువ్వాడా" అని తర్కించుకొంది సుశీల. "స్కూలుఫైనల్లో చాలా మార్కులొచ్చాయన్నారే! అతడు తెలివిలేని వాడేమిటి? ఏ విషయంలో?" తన్ను శతవిధాల ప్రశ్నించుకుంది సుశీల.

సుశీల గదికి ప్రక్కగదిలో ఇంగ్లీషు లెక్చరర్ కిరాయి దారుగా ఉంటున్నాడు. ఆయనకు సంసారంలేదు. ఎప్పుడూ మాటలు వినిపించవు. ఈనాడు ఆ రూములో మాటలు విని పించాయి. కనుకనే, అటు చూసింది. పైగా విన్న విషయం వింతగా కనిపించిందేమో, ఆలోచించడం మొదలెట్టింది.

"కాంపోజిట్ మాథ్స్‌తో స్కూలుఫైనల్ పాసు కావటమే ఒకవిధంగా కష్టం; దానికి మంచి ఆలోచనాశక్తి కావాలి; చురుకుదనం కావాలి. హైస్కూలు గడిచి, మంచి మార్కులతో, కాలేజిలో ప్రవేశించినా, ఎమ్. పి. సి కి సీటు దొరకాలనుకుంటే మరో పరీక్ష, పిన్సిపాల్ వేసే ప్రశ్న లకు సమాధానం చెప్పలేకుంటే సీటులేదు– వెధవది ఫోర్తు ఫారం చదివే కుర్రాడుకూడా తిమ్మిని బమ్మినిచేసే ప్రయ త్నంలో ఉంటాడు. నిలవేసి అడిగితే జవాబు చెప్పలేని వాజమ్మలు పాసౌతున్నారంటే, కేవలం వాళ్ళ తెలివే

కారణం. అలాటిది, తన చదువు తాను చదువుకోగలిగినవాడు తెలివితక్కువ్వాడంటే ? ఇదేరకపు తెలివితక్కువో ?"

"ఏ వీధికి ప్రెసిడెంటో" అన్నట్లు ఆలోచించింది సుశీల. ఎంత ఆలోచించినా, అతని అజ్ఞానం 'ఇలాటిది' అనిపించే జవాబులాటి సూచనైనా ఆమెకు తోచలేదు. తనను గురించైనా ఆలోచించే అలవాటులేని సుశీల ఈనాడు ఈ విషయంపై ఆలోచనకు దిగింది. ఇంతకూ ఆ ముసలాయన మాటల్లో నున్న ధ్వని ఇంతగా ఆలోచనలోముంచిందామెను. ఆ ధ్వనిలో బాధ ఆమెను మనసులో బాధించి, మధిస్తోంది. అందుకే, అంతగా ఆలోచిస్తోంది.

"మా వాడికి చదువురాదు అన్న బెంగలేదు. తన పాఠాలు తానుఅర్థంచేసుకొంటాడు" అన్నప్పుడు ముసలాయన ధ్వనిలో దృఢమైన గాంభీర్యం కనుపించింది, విశ్వాసంతోసహా. "లోకజ్ఞానం లేకపోవటంచేత ఆస్తి ఎంతవున్నా, బ్రతుకు కష్టతరమౌతుంది" అన్నప్పుడు ఎంతో బాధ ధ్వనించింది. ఐనా ఈ రెండు మాటలకు సంబంధం కనుపించటంలేదు. తెలివిలేని వాడైతే యే ప్రశ్నకెంత జవాబో ఎట్లా తెలుస్తుంది ? అలాటప్పుడు మెరిట్ మార్కులెట్లావచ్చాయని ? అతనికెన్నో మెరిట్ మార్కులున్నాయన్న విషయం, అతడు క్లాసులో అడుగుపెట్టిన పదినిమిషాల్లో గుసగుసలపాలైంది. అలాటి ఇతడ్ని ఆ తండ్రి 'తెలివిలేని వాడం'టాడేం ? పోనీ, వాత్సల్యమేమో ? అలా అనుకుంటే ఇంకోవిధంగా చెప్పాలి. 'ఇది

క్రొత్త ప్రదేశం, పరిచయాలులేవు, కనుక అప్పుడప్పుడు వాడికి కావలిసిన విషయాలలో సలహాలిస్తూఉండండీ' అనాలి. అదికాకుంటే, 'ఇదివరకు ఒంటరిగా ఉన్నవాడుకాదు బహుశా, బెంగపడతాడు. కాస్త ధైర్యం చెబుతూఉండండి' అనేనా అనాలి. ఏమిటో ఆయన మాటల్లో అలాటి భావమే లేదు. అతడి సర్టిఫికెటును చూసి 'అతడు తెలివిలేనివాడు' అనేటంత తెలివిహీనుడు ఉండబోడని దృఢమైన వదంతి. అయితే తండ్రే స్వయంగా తన కుమారుణ్ని 'తెలివిలేనివాడ'ని ప్రచారంచేస్తే ఆ కొడుకు గతేంకావాలీ ? పరిస్థితికీ, ఆయన ధోరణికి యేమీ సంబంధంలేదే ? వింతగా ఉంది !

ఆలోచనల్లో తదేకంగా ఉన్న సుశీలకు కాలమానం తెలియలేదు. దాసివచ్చి తన గదిలో దీపం వెలిగిస్తూ 'అమ్మగారు సీకట్లో కూకోని ఆలోసిత్తన్నారు' అని రిమార్కు చెయ్యడంతో సుశీలకు ప్రపంచం తెలిసింది. అప్పటికి సుమారు మూడు గంటలనుండీ ఆలోచనలో మునిగినట్టు అప్పుడే అర్థమైంది. ఆ తండ్రి మాటలకూ యీ యువకుడి విజ్ఞతకూ సంబంధంలేదని తెలిసికొంది కాని; అతని తెలివి లేమికీ, తన ఆలోచనకూ సంబంధంలేదన్నది తెలియనేలేదు.

"సరే, రేపటినుండి చూడొచ్చులే, మాస్టారింటికి వస్తాడుగా, అతనిలో ఎంత తెలివితక్కువున్నదో తెలిసిపోతుంది." అనుకొని తన ఆలోచనల్ని తాత్కాలికంగా నిలిపివేసింది. ఐనా, ఆస్మృతి తన్ను విడిచిపోవడంలేదు.

నాటిరాత్రి సుశీలకు నిద్రలేదు, మెలకువగాలేదు. పుస్తకం తెరిచి చదవబోయి ఆలోచించేది. ఆ ముసలాయన మాటలే చెవుల్లో ధ్వనిస్తున్నాయి. అంతలోనే, అతన్ని గురించిన ఆలోచనల్లో సంతృప్తి కనుపించేది. అంతటితో చదువాపి, నిద్రపోవాలనుకొంటే, మళ్ళీ ముసలాయన నిష్క్రమిస్తోన్న దృశ్యం కళ్ళకు కట్టినట్టు నిలచేది, ఎవరో కొట్టినట్టు బాధపడి లేచి కూర్చునేది. 'నన్ను గురించి మా నాన్న ఇలాగే ప్రచారంచేస్తే?...' ఇలాటి భావం కలిగి ఎంతో బాధగా మనసులో నొచ్చుకొనేది. కలకూ మెలకువకూ మధ్య ఊగులాడుతూ తెల్లవార్చింది. ఇక అంతవరకూ తన్ను 'వేధించిన సమస్యకి పరిష్కార సమయం వచ్చిందికదా' అనుకొంటూ, ఉదయం ఎనిమిది గంటలకు కిటికీ దగ్గరనిలిచి చూస్తోంది సుశీల.

అతడు వస్తున్నాడు. తలవంచుకొని ఠీవిగా కాకపోయినా వినయంగానే నడుస్తున్నాడు. విరగబాటు లేదు. దుస్తులుసరిగానే ధరించాడు, ఎగుడు దిగుళ్ళు లేకుండా. చేతిలో పుస్తకాలు వయ్యారంగా ఊగటంలేదు. అతని చెప్పులూ గడియారమూ నాగరికతనే సూచిస్తున్నాయి కాని ఆడంబరాన్ని ప్రదర్శించడంలేదు. జేబులో కలం వున్నదే కాని, సిరా మరకల్లేవు. ముఖంలో విపరీతపు ధోరణి లేదు. నిగ్రహం హుందాగా వుందికాని, వెర్రితనపు లక్షణాల్లేనేలేవు. తెలివిలేమిని బలపరుస్తూన్నట్టు మచ్చుకి ఒక్క అవగుణంకూడా కానరాదు.

ఆ తండ్రి మాటల్ని నమ్మాలా వొద్దా అనే మీమాంసలో పడింది సుశీల. ఆలోచనలో ఆమె కేమీ ఉపాయాంతరం తోచలేదు.

సుశీల అతణ్ని గురించి ఆలోచిస్తూనే నిల్చొంది. అతని పాఠం పూర్తయింది. బయటికి వస్తూండగా అతణ్ని పేరడిగారు మాష్టారు. "అరుణ" అన్నాడు. ఆ మాటతో ఆమెలో చలనం కలిగింది. తొందర పుట్టింది. "ఇంకా ప్రెపరేషనుంది. భోజనంచేసి కాలేజికి వెళ్ళాలి" అనుకొంటూ పుస్తకాలను చేతపట్టింది. అప్పుడూ దాసీదే జ్ఞాపకం చేసింది "భోజనం చెయ్యరా" అని. దానితో తన ధోరణి మార్చి స్థాయిలో పడింది సుశీల.

౨

అన్నం తింటూండగా అతని పేరు గుర్తొచ్చింది. 'అరుణ'. ఎంతచక్కని పేరూ! ఉదయించే భాస్కరుడు. అతని దర్శనం కోసం శతపత్ర సుందరి విప్పారి నిండుగా అలంకరించుకొంటుంది. అతని రాకకు స్వాగతం చెబుతూ భరద్వాజపక్షి మలయ మారుతం రాగాలాపన

చేస్తుంది. ఆ శుభాన్ని కాంక్షిస్తో చక్రవాకి తన విలాసాన్ని ఆపుజేస్తుంది. అతనిరాక తెలుపుతూ నిద్రలోని వారికందరికీ జాగృతినిస్తుంది మంద మలయమారుతం. స్వేచ్ఛగా సరళంగా వీస్తూన్న ఆ పవనాలను అనుభవించే స్వేచ్ఛను కాంక్షిస్తారు ప్రజలు. ఈ పేరులో అంతటిభావం మహత్తరంగా ఉండి కూడా, నిగూఢంగా వుంది. నిగూఢం కనుకనే ఆ తండ్రికి అరుణ 'అరణా' అనిపిస్తూ నిజంగా అర్ధణా విలువకూడా చెయ్యడంలేదు. అన్నం తిన్నదో లేదో పుస్తకాలు తీసికొని కాలేజి కెళ్ళింది.

క్లాసులో సామాన్యమైన రొద సుశీలకు వినిపించడం లేదు. ఆమెకు అనిపించే దొక్కటే! అతని తండ్రిమాటల భావం. ఆ భావానికీ అతని నామార్ధానికీ పోలికే లేదు అని పించింది. అది నిజంగా నామార్ధమైతేనే! నామమాత్రారం కాకుంటే, తన భావన సరియైనదే కావచ్చు. మరి, ఆయన మాటల్లో బాధ వినిపిస్తోందిగా? వట్టి పరితాపమేనేమో? నిర్ణయించుకొంది.

క్లాసులో విద్యార్ధులంతా ఎవరికి తగిన స్నేహాల్లో వారు వారు జట్లుగా యేవో యేవో వాగుతున్నారు; ఉత్సాహంగా కేరింతాలేస్తున్నారు. అరుణ మాత్రం యెరితోనూ మాట్లాడటంలేదు. కొత్తవాడు కావటం వల్లనేమో! అతనితో కల్పించుకొని యెవరూ మాట్లాడటంలేదుకూడా. అతడేదో పుస్తకం తిరగేస్తున్నాడు. కాని చుట్టుపక్కల చూట్టంలేదు. విద్యార్ధినులు కూడా తగిన జట్లుగా మాట్లాడు

కొంటున్నారు. వారిలో సుశీల ఒక్కతే యెవ్వరితోనూ మాట్లాడటంలేదు. అరుణ మాదిరి పుస్తకం చూస్తూండక పోయినా, అరుణను గురించే ఆలోచిస్తోంది.

పాఠం ప్రారంభమయింది. సుశీల ఆలోచనకు బ్రేక్ పడింది. క్రమంగా ఆమె స్వస్థతలోకి వచ్చింది, తీవ్రత విడిచి. ఆ స్వస్థజీవితం ఆమెలో వారం రోజులు నిలిచిందంతే! అరుణ దినచర్యల్లో ఏ మాత్రమూ మార్పులేదు. విశేషం లేదు. సుశీలకు అతనిలో యేమీ లోపమేతోచలేదు. "ఉంటే అదే బైటికొస్తుందిలే" అని నెమ్మదించి ఉంటుంది.

ఆనాడు కెమిస్ట్రీ ప్రాక్టికల్ జరుగుతోంది. చాలమంది విద్యార్థులు ప్రాక్టికల్ పూర్తిచేసి, ఇన్‌స్ట్రక్టర్‌తో బాతా ఖానీ కొడుతున్నారు. అరుణ యింకా ఎక్స్‌పరిమెంటు చేస్తూ న్నాడు. కెమికల్స్‌ను తప్పుడు తూనికలతో కలిపి ప్రయోగా నికి ఫలితం రాలేదని కంగారుపడుతున్నాడు. ఒకటిరెండుసార్లు తలెత్తి ఇన్‌స్ట్రక్టర్ వైపు చూశాడుకాని, పిలవలేదు, అడగ లేదు ఆ టేబిల్ యెదుట వైపున అప్పుడే ప్రయోగం పూర్తి చేసిన సుశీల అతని అవస్థను చూస్తూనేవుంది. అసలామె అతన్ని పరీక్షిస్తూనే ఉందిగా! అతడి తప్పుడు ప్రయోగంచూసి విసిగిపోయింది. 'ఆ తప్పులనే రికార్డు చేస్తూన్నాడే' అనుకొని అతన్ని ఆపుచేసింది. "ఇలాటి తప్పులతోనే రికార్డుచేస్తే, చది విన దానికీ, ప్రయోగానికి సంబంధం కనిపించదు. రికార్డంతా తప్పుల తడక అయిపోయింది" అంటూ అతని ప్రయోగం

సరిచేసి యిచ్చింది. అతని ముఖంలో సంతోషం కనుపించింది. ఐనా, కృతజ్ఞతగా అతడేమీ అనలేదు. "ఒకరిచ్చిన సహాకారానికి కృతజ్ఞత చెప్పడానిక్కూడా సిగ్గుపడాలా? చొరవ లేక అడగలేకపోతే పోవచ్చు; మాట్లాడే ధైర్యంలేదా?–పోనీ కాలేజికి ఫీజుకట్టినవాడు, అధమం. చందాదారుడుగానైనా, తన విలువ దక్కించుకోవచ్చునుకదా !" ఆశ్చర్యంగా ఆలోచనల్ని నడిపిస్తూ, తానుకూడా లేబరేటరీ దాటివచ్చింది. ముందుగా అరుణ నడుస్తున్నాడు.

"తప్పులతో రికార్డుచేస్తున్నందుకు మీరేమైనా ఫీలయ్యారా ?" ఆమె ముఖంలోకి చూస్తూ అడిగాడు.

"నాకు ఫీలింగెందుకూ? మీరేమీ ఫీలవలేదా ?..." అతడినుండి జవాబు రాబట్టాలని ప్రయత్నించింది.

"ఆ ప్రస్తావనింక వదిలేయండి. మీపేరు... అహం అడగవచ్చునా? ఇష్టముంటేనే చెప్పండి" నసిగాడు.

"పాపం! అంతగా ఫీలవుతున్నారన్నమాట?... దానికేమీ మార్గంలేక బిగపట్టారా !" రెట్టించింది సుశీల.

ఆమె ప్రశ్నకు అరుణ చిన్నబుచ్చుకున్నాడేమోననిపించిం దామెకు వెంటనే అతని ప్రశ్నకు జవాబుచెప్పింది. "నాపేరు సుశీలంటారు... ఇదికూడా చెప్పాలా అనుకున్నా. అటెండెన్సిచ్చేప్పుడు వినలేదూ ?" ధోరణి మార్చుకొంది.

"అయితే, క్లాసులోవాళ్ళందరి పేర్లూ మీకు తెలుసన్నమాట— మీ పేరునుబట్టి చూస్తే, పుట్టినిల్లు మెట్టినిల్లూ

సంస్కరించబడాలి. ఇరుగు పొరుగులనుకూడా సంస్కరించే ధర్మం మీలో కొత్తగా కనిపిస్తోంది. అలాటి మీ సామర్థ్యాన్ని అంచనా వెయ్యలేను. ఇలాటి చరిత్రగల స్త్రీల విషయం పురాణాల్లో వినకపోటం నా లోపంకాబోలు ?" తన ముఖంలో భావాన్ని దాచుకొంటూ, సుశీలను ఇంకో ఆలోచనకు నడిపించాడు.

"మీకు నాగురించి శ్రమ కలిగింది. ఇకపైన అటువంటి పరిస్థితి కలగనివ్వను. శలవు" అంటూనే అకస్మాత్తుగా విడిచి వెళ్ళిపోయాడు అరుణ.

అరుణ తన్ను పొగిడాడో లేక అర్థంచేసికోనిదే తన జోలికి రావద్దన్నాడో, కాకుంటే, ఆడవాళ్ళకి చనువిస్తే మగవాళ్ళ ధర్మం నశిస్తుందన్నాడో... అతని మాటల్లో అర్థం ఇది అని ఆమెకు తోచలేదు. అతడు నడుస్తోన్న తీరును చూస్తూ నడుస్తోంది సుశీల.

కృతజ్ఞత చెప్పనందును నేను ఫీలవకూడదనే, నన్ను పొగిడుంటాడా ? ఇంత విజ్ఞానం ఉండి, వినియోగం తెలియక పోవడం విచిత్రమే !

'స్కూలుకు ఫీజుకట్టే విద్యార్థిగానో, చందాదారుగానో తన విలువను ఎందుకు నిలుపుకోలేదూ ?' ఆలోచిస్తున్న సుశీలకు దారిలో సైకిల్ అడ్డు వచ్చింది. అప్పటికి ఆమె యింటికి సమీపంలో క్రాస్‌రోడ్డును చేరింది ఎలాగో !

"టీచరు మాత్రం ? ఒక్కో విద్యార్థిని చొరవచేసి అడగలేడు. అలాటివాడి చదువేం కావాలి ?... పిల్లల

ముఖాలనుబట్టి ఎవరికి పాఠం తెలిసిందో, ఎవరికి తెలీలేదో, ఎందుకు తెలీలేదో గుర్తించే బాధ్యతలేమా?" ఆమె భావంలో టీచరు కూడా ఒక బాధ్యత ఉన్నట్టు అర్థమయింది. ఆలోచిస్తున్న సుశీల ఇంటికి చేరింది. కాని ఆమె ఆలోచన తావుకు చేరలేదు. మొత్తంమీద పరాకుగా రోజు గడిపివేసింది.

## 3

సుశీలకు ఈ మధ్య అంత పరాకులేదు. ఒక పక్షం రోజులవరకూ, ఆలోచించవలసిన విషయాలేవీ కనపడలేదు. ఆనాడు ఆదివారం. మనస్సు నెమ్మదిస్తుందని మార్నింగ్ షోకి వెళ్ళింది సుశీల. తిరిగివస్తూండగా తన రిక్షా హఠాత్తుగా ఆగి పోయింది. తేరుకొనిచూస్తే రిక్షాబండి పట్టుకొని అరుణ నిలబడి ఉన్నాడు. "నాలుగణాలివ్వండి, ప్లీజ్" అన్నాడు తన చూడగానే. ఆలోచించకముందే ఇచ్చింది.

"ఏమీ అనుకోవద్దు. నా పర్సునెవరో తీసుకున్నారు. ఈ బజారులోనే" డబ్బడిగినందుకు ఆమె బాధపడుతుందేమో నని కారణం చెబుతూ నసిగాడు.

"పర్సా! విలువెంత?"

"ఎనభైయైదు" క్లుప్తంగా నిర్లక్ష్యంగా అనేశాడు.

వెంటనే సుశీలకు మరో ఆలోచన తోచింది. 'ఎనభై రూపాయలతో కావలసిన పనికి నాలుగణాలేం సరిపోతాయి! అని. "పోనీ మా యింటికి రాకూడదూ, నాన్నగారి దగ్గర తీసికొని కావాల్సిన సొమ్మిస్తాను" అంది.

"అంత సొమ్మవసరమేమీ లేదు. నాక్కావలిసింది ఒక్క పెన్సిలేగా! ఇక రెండురోజుల్లో మా నాన్నగారు డబ్బు పంపుతారు" జవాబిస్తూనే వెళ్ళిపోయాడు.

'పెన్సిలు కొంటానికి ఎనభై రూపాయి లెందుకూ! పైగా అంగడి మూసినరోజున తన కేవస్తువైనా దొరుకుతుం దనే వచ్చాడా?— వింత తెలివి! తానేం జేస్తున్నాడో, సమయమెలాటిదో, ఇవేమీ పట్టించుకోడేం?' సుశీల చాల సేపు మథనపడి ఇంకో విషయాన్ని ఆలోచనకు తీసుకొంది. 'పర్సును దొంగిలించినవాడ్ని దొంగఅంటే, వాడి గౌరవం పోతుందనా?— ఎవరో తీసుకున్నారంటాడేం?— తనద్వారా ఇంకోడికి తిట్లు తగలకూడదనా? ఇలాగుంటే, రేపీపాటికి ప్రజలితన్ని ఇంట్లోనుంచీ, ఊళ్ళోనుంచికూడా తరిమేస్తారు. ఇదేకాబోలు ఆతండ్రికి బెంగ!—అదే అయితే, అతని వెన కనే అడుగడుగునా సలహాలిస్తూ, కొన్నాళ్ళవరకూ, ఎవ రైనా స్నేహితుడుండాలి. ఐనా; ఎప్పటికోగాని బాగుపడ్డం కష్టం— నిజమే! పాపం! ఆ ముసలాయాన అలా బాధ పడ్డంలో ఇలాంటిభావమే ఉండొచ్చు. సమంజసమే.' సుశీల ఆలోచిస్తూనే యాంత్రికంగా తిండి, నిద్ర మొదలైన కాల

కృత్యాలు కావిస్తోంది. మరునాడు అరుణ పాఠానికివచ్చే సమయంమాత్రం ఆమెకు గుర్తుంది.

అరుణ మాష్టారివద్ద పాఠం తీసికొన్నాడు; వెళ్ళాడు కూడా. ఈలోగా అతడి తెలివిమీద తనకున్న భావంకాస్తా తుడుచుకుపోయింది. తన పాఠాన్ని తాను స్వయంగా అర్థం చెప్పి, 'అంతేనాండి' అని మేష్టారినడిగి, 'అంతే' ననిపించుకొని, వెళ్ళిపోతాడు. అతడు తెలివిమాలినవాడెలా అవుతాడు? అందుకే ఆమె ఆలోచిస్తూ, అరుణయొక్క తెలివిలో రెండుస్థాయిలమధ్య నిలిచి ఆలోచిస్తోంది, భ్రాంతిలో.

మధ్యాహ్నం ఇంటర్వెల్లో అందరూ తలావైపూ వెళ్ళిపోయారు. అరుణమాత్రం తన సీటునుండి కదల్లేదు. సుశీల కూడా క్లాసులోనే ఉండిపోయింది. అరుణ నెమ్మదిగా ఆమె దగ్గరకువెళ్ళి "మీ ఫిజిక్సునోట్సు ఒకసారిస్తారా?" అనడిగాడు.

సుశీల యెవ్వరికీ పుస్తకాన్నెరువియ్యదు. 'నువ్వెందుకు రాసుకోలేదు?' అంటుంది. 'ఎందుకాస్పెంటు కావాలి' అని నిలదీస్తుంది. 'అనుభవించు, పుస్తకం, కలం నన్నడగొద్దు' అని విదిలిస్తుంది. కాని యెవరి వియ్యదు. 'కావాలంటే డబ్బడుగు, ఇస్తాను' అంటుందికూడా. అలాంటి జవాబు ఒక అమ్మాయికి చెప్పగా తాను విన్నాడు. అందుకే భయపడుతూ అడిగాడు. "ఈ మాత్రానికి జంకుతారేం? స్వేచ్ఛగా అడిగి తీసుకెళ్ళండి" అంటూనే పుస్తకమిచ్చింది.

ఆమె చర్యకు అరుణ ఆశ్చర్యపడ్డాడు. ఐనా, జంకు తూనే పుస్తకమందుకున్నాడు. "ఒక్క పనుంది" అన్న పిలుపుతో అతనిలో రక్తం గడ్డకట్టుకుపోయింది. 'ఏమిటి' అనే పోజులో వెనుదిరిగి నిలబడ్డాడు. నోటమాట పెగల్లేదు. ఆలోచన మాత్రం రేగింది. 'నీకూ ఇవ్వను' అంటుందేమో ననే భయం పుట్టింది. తీరా ఇచ్చిన పుస్తకం తీసుకొంటే తన కిక యిచ్చేవారేరీ? 'ఏమంటుందో' నని యెదురు చూశాడు.

"మీరింకా కాఫీ తాగలేదను కుంటాను." అర్ధోక్తిలో అడిగినట్టు ఆపుచేసింది. "అబ్బే, ఏదీ" అని యేదో అన బోయాడు. కాని ఏమీ అనలేకపోయాడు. "కాఫీకి వెడదామా? మీ కేమైనా అభ్యంతరమా?... మిమ్మల్నొక టడగాలి" అంటూనే లేచి ముందు దారితీసింది. "ఏమిటీ సమాచారం" అంటూ అనుసరించాడు, 'గండం గడిచిందను'కొంటూ. ఇద్దరూ హోటలు చేరుకున్నారు.

"నాకేమీ వింతకాదు...అహాఁ...నిన్న ఆదివార మన్నమాటే మరచి పోయారా ?" అప్రస్తుతం అనుకుంటూనే లాంఛనంగా అడిగింది.

"ఏఁ? అలాంటి ప్రోగ్రామ్ పాడు జేసు కొన్నానా" ? ఏదో పోగొట్టుకొన్నట్టు ఫీలయ్యాడు.

"బజారు తెరచి ఉంటుందనే అనుకొన్నారా? లేక తెలియక వచ్చారా?" తెంపుచేసి అడిగింది సుశీల.

"అలాంటివేవీనాకు పట్టవు. సామాన్యంగా పట్టణ వాసులంతా ఏ ఏ రోజుల్లో తీరిగ్గా వుంటారో, ఆ సమయా

ల్లోనే వాళ్ళు బజారు పనులు చూచుకుంటారు. అప్పుడే అంగళ్ళు తెరచుండటం ధర్మం. ఆ ధర్మాన్ననుసరిస్తూనే నేనూ బజారు కెళ్ళాను. కాదంటే, కొద్దిపాటి సొమ్మును పోగొట్టుకున్నాను. వాడే వచ్చి అడిగితే సంతోషంగా ఇచ్చే వాణ్ణి; కాని తెలివి తక్కువాడు ధైర్యం చెయ్యలేక పోయాడు."

అరుణచూపిన వేదాంతపు ధోరణి సుశీలకు నచ్చలేదు సరికదా, కోపంవొచ్చింది. "ఐతే కనిపించిన ముష్టాళ్ళందరికీ ఆస్తి పంచిపెట్టేస్తే పోయిందనుకోనక్కర్లేదుగా ?" చిలిపిగా అడిగింది.

"పోయిందని నేను బాధపడితే మీ సలహా పాటించవలసిందే మరి — ఐనా, అడపాతడపా యిలాటివి జరుగుతూనే ఉంటాయి. మనదేశపు పరిస్థితీ మనవాళ్ళ మనస్తత్వాలూ ఒకదానికొకటి తోడుగా ఇలాటి కూడని సంఘటనల్ని సృష్టిస్తూంటాయి. ఇంకో విషయం చూడండి; మన పనుల్లో మనం తొందరగా వున్నప్పుడు అంగళ్ళు తెరచి మన్ని ముంచుతారు. వాళ్ళు చెప్పే ధరలూ పరిశీలనగా ఆలోచించలేం, సరుకు నాణ్యంకూడా చూసే తీరికఉండదు. పైగా తప్పుడు తూకాలతో సహా మన్ని దగాచేస్తారు. బాహాటంగా ఈ దగాలను ఒప్పుకొంటున్నాం. ఇలా గడించి పైకొచ్చిన వాళ్ళనే ఆఖరుకు నాయకుల్ని చేస్తున్నాం. ఆలోచించండి. ఇలాటివాళ్ళ గతచరిత్ర తిరగేస్తే ఎన్నిసార్లు ఎన్నిరకాల పెనాల్టీలు చెల్లించారో తెలియదా!— ఇక లేనివాడు

దొంగతనంజేస్తే వాడ్ని దొంగఅని బిరుదిచ్చి సత్కరిస్తాం. దొరికితే తంతాం; లేకుంటే తిడతాం. ఇదీ లోకం – అంటే మనం !'' అరుణ మాట్లాడుతున్నంతసేపూ గాంభీర్యంగా ధ్వనించింది. ముఖంలో భావాలు తరంగాలుగా మారిపోయి చివరకు ప్రజల అజ్ఞానానికి జాలిపడిన పోజులో ఆగిపోయాయి. వాటివెనుక వ్యంగ్యం, కోపం అసహ్యం వరసగా క్యూలో నిలబడ్డాయి.

"బాగానేవుంది. మీ సిద్ధాంతం మీవరకూ రైటే! కాని, అమలుకు రావాలంటే ఇలాటి పక్షిరాజ్యపు టాలో చన్లు పెద్దవాళ్ళకు తట్టాలిగా ?'' పరిహాసపుధోరణి కనబర చింది.

"పోనిండి, పక్షిరాజ్యపు టాలోచనే అనుకోండి. వాటి ఆలోచన్లు ఆకాశంలో యెగురుతుంటాయనుకొంటే నా అభ్యంతరంలేదు. కాని ఆలోచన ఎలాటిదైనా, దానికీ ఓ స్థానంవుంటుందని నమ్ముతారా?— ఇదికూడా మిమ్మల్ని బాధపెడుతుం దనుకోలేదండి. నా ఆలోచనల్తో మీ మన సును క్షోభ పెడుతున్నాను'' నొచ్చుకున్నాడు మన స్ఫూర్తిగా.

"నన్ను మెప్పించటానికి పాటుపడుతున్నారా ? మరి ? అట్లా మాట్లాడుతారేం ?'' నవ్వువిసిరింది సుశీల.

"పాటుపడి యెవ్వారినీ మెప్పించలేకపోయాను. ఇప్పుడా ప్రయత్నంకూడా చెయ్యటంలేదు. వ్యక్తిగతంగాకాని, సామూహికంగాకాని యేవిధమైన మెప్పూ పొందలేక

పోయాను. అందుకు ఆశించటంలేదు, ఎదురుచూడ్డంలేదు." విరక్తిగా అన్నాడు.

"పోనీండి. ఇంకా దాన్నెందుకు తరచడం?... నిన్న మీరు ఎక్కువడబ్బు తీసికోలేదు. ఇంటినుండి వచ్చేలోగా మీ ఖర్చులెలా గడుస్తాయి? అందుకే పిలిచాను. అంతవరకూ ఈ పదిరూపాయలూ వాడుకోండి. కావాలంటే మళ్ళీ యిస్తాను. ఇబ్బంది పడొద్దు."

పదిరూపాయలనోటు అతని చేతి కందించి, తొందరగా లేచింది బైటికి వచ్చేయాలని.

"దీనికి వడ్డీకింద బిల్లు నేనే చెల్లించాలా? పద్ధతి బాగుందండీ!... ఈరకంగాకూడా దవాలాతీస్తానేమో ఆలోచించారా?" మనసుల్లో కలవరం మాసిపోయే ఛ[illegible]క్తి విసిరాడు.

మాట్లాడ్డంలో అరుణకూడా జాగ్రత కలవాడే ఆమె అడిగిన ప్రశ్నలవల్ల ఆమెకే బాధకలిగింది. ఐనా అతడి ఛలోక్తి అంతటిని కప్పేసింది. ఆమె అడిగినందుకు అతడే[illegible] బాధపడలేదు.



సుశీలవద్ద తీసికొన్న నోట్సు మూడోనాడు తిరిగి ఇచ్చే శాడు. అప్పుడే ఆమె బాకీకూడా తీర్చేశాడు. ఆ యివ్వటం ఎక్కడేనాఅయితే ఏమయ్యేదో కాని, క్లాసులోనే కాబట్టి ఒక నేరమైపోయింది. దానికితోడు అరుణకు సుశీల తోడ్పడి నట్లు అనేకసార్లు గమనించిన విద్యార్థిలోకం విపరీతార్థాలను కల్పించింది.

ఇతిహాసాల్లో డాన్‌లూ నైట్లూ అనిపించుకొనే వాళ్ళంతా ప్రపంచయాత్రలు సాగించేవారు. అంతఃపురాల్లో చాటున పడివున్న రాకుమార్తెలను ప్రేమించినట్లు భ్రమించి బయటికీడ్చి, ముసుగుతీసి ముఖంచూచి మూర్ఛపోయేవారో 'మోసపోయాము'ని వాపోయేవారో, ఏదో జరిగిపోయేది కాని, నేటివీరులు తమ క్లాసుల్లో ఆడపిల్లల్ను ఎంత పెంకెగావుంటే అంత అందగత్తెలనుకొంటారు. ఆమెకే హృదయ మర్పిస్తారు. (షరా: హృదయం యెక్కడుంటుందో తెలిస్తే.) వారా ప్రయత్నంలో ఉండగా ఆమె తమను గమనించటం లేదని, కారాలూ మిరియాలూ నూరేస్తారు. తమని లక్ష్య పెట్టదని తెలిస్తే, నయానో భయానో ఆమెను తమ దారికి తెస్తారు. ఆమె యెవరితోనైనా మాట్లాడినట్లు తెలిస్తే, ఓడి

పోయినవారంతా ఒక పార్టీగా డిక్లేర్ చేస్తారు. నాటినుండి ఆమె నేరంలేని శిక్ష ననుభవించాల్సిందే!

ఎంతోమంది కాలేజిగరల్సు ఆత్మహత్య చేసుకున్న వార్తలు వింటాం. వాటిలో ఎక్కువగా యీరకపు అవమానాలకు గురైన సంఘటన్లే! కొందరు యెవరినో ప్రేమించినట్లు భావించి మోసపొయ్యేవారు; తమ చదువు పెళ్ళిచూపుల కేనని సాక్షీభూతంగా తెలియబట్టి. అంతేగాని, సహ విద్యావిధానంవల్ల స్త్రీ ఇంతవరకూ అభివృద్ధి పథకాన్ని పొందలేకపోతోంది. ఆదిలోనే హంసపాదు అనిపించే సంఘటనలు విద్యాదశలోనే యెదురవటంతో స్త్రీ చదువుకొనికూడా తలెత్తుకుని తిరగలేకపోతోంది.

క్లాసులో పిల్లలంతా జంతుప్రదర్శనశాలను ఆడియోగ్రాఫ్ చేశారు. ఆ కూతలు, అరుపులూ, వారి నేత్రానందాన్ని వేనోళ్ళ చాటుతున్నాయి. కొద్దిసేపటిలో వాటి భావంకూడా బయలుపడింది. దానితో అందుకు కారణాలు కూడా వెలువడ్డాయి. నెమ్మదిగా అరుపులు అణిగిపోయాయి. ఇక మీమాంస మిగిలిపోయింది.

"మార్కులొస్తే స్త్రీహృదయం కరిగి పోతుందా ?" "గేమ్సు ఛాంపియన్‌గా పాప్యులరవటం పాతపద్ధతి లేవోయ్" "స్టేజి డైరెక్టరుగా ఆర్టిస్టులమధ్య తిరగొచ్చుకాని స్టూడెంట్ల మధ్య కాదు..." "కవిత్వం ప్రజారంజకమే కాని, విద్యార్థినీ రంజకం గాదురా"—ఇంకా రకరకాల మాటలు వినిపించాయి.

ఇన్ని రకాల మాటలు వినిపిస్తున్నా తనకు సంబంధం లేనట్లే ముభావంగా ఊరుకున్నాడు అరుణ. ఏమీ పాలుపోక సశీ కూడా ఊరుకుంది. అరుణ ఒకసారి సుశీలవైపు చూశాడు. అక్కడున్న ఆడపిల్లలు కూడా తమ కళ్ళలో పరిహాసం వొలకిస్తున్నారు. అరుణకు అసహ్యమనిపించింది! తలొంచుకుని ఓ నోట్‌బుక్కు తీసుకున్నాడు. క్లాసంతా చర్చించే విషయం ఒక్కటే, వర్ణనా విశేషాలు పలువిధాలవి లోచించ దతనికి అందుకే లెక్కల్లో కరోలరీలపై ప్రయాణం సాగించడానికి దిగాడు అతణ్ణాపథంగ కూడా ఉండనియ్యరుగా!

"ఐతే, రొట్టివిరిగి నేతిలో పడిందా మిస్టర్" అన్నాడు శాస్త్రి. "మనం వేలేసినట్లు నెట్టేస్తే బూరెలబుట్టలో పడ్డాడురా" అన్నాడు రావు. "ఇంతకీ ఒక తెలివితక్కువవాడ్ని వల్లోవేసుకోడంలో కీలకమేదో ఉందిరా" అంటూ అసలు అనుమానం (విద్యార్థుల రాజకీయ జాడ్యం) వెలిబుచ్చాడు రెడ్డి. "ఉప్‌అంటే యెగిరిపోయేవాడ్ని ఎందుకు చేరదీయాల్సొచ్చిందో" సందేహించాడు స్పోర్ట్స్‌మన్ సింగు "మనవి నటనలు, నకిలీలు అనేమోరా" నిర్ణయించాడు ఆర్టిస్టు కుమార్. "పాపం, క్లాసులో 'ఏకాకి' అని జాలి కాబోలు" ప్రకృతించాడు బాలకవి రాజు.

ఈ మాట లంటున్న వారంతా ఒక టీమ్‌గా యేర్పడి ప్రతి తరగతిలోనూ అపరాధ పరిశోధన, తద్వారా మర్యాద కుటుంబాల మానరక్షణలాటి వెన్నో చేసేసి పేరు తెచ్చుకొన్నారు. వారొకరికొకరు పేప రందించుకుంటూ పైపై

పోతూ టీమ్ విడిపోకుండా సంఘగౌరవం కాపాడుకుంటూ వస్తున్నారు. వారికి కాలేజీలో వున్న పలుకుబడి తలిదండ్రుల దగ్గర లేదంటే వారి ప్రతాపం ఎంతగా విస్తరించుకుందో చెప్పనక్కర్లేదు.

వీరంతా అరుణచుట్టూ చేరి అల్లరిచేస్తూండగా 'తననుకాద' న్నట్టు అతడూరుకున్నాడు. అతడి అసహాయ స్థితిని చూడలేకపోయింది సుశీల. పైగా, తోడి విద్యార్థినులు కూడా పరిహాసంగా చూస్తున్నారు. అలాటప్పుడు తానెలా ఊరుకోగలదు?

'మొగుడు కొట్టినందుగ్గాక, తోడికోడలు దెప్పినందుక' న్నట్టు, అరుణ స్థితికిగాక, ఆడపిల్లల నవ్వులు చూసి ఉద్రేకపడింది సుశీల. కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. లేచి నిలబడింది. "చాల్లెండి మీ వాగుడు. పెద్ద చదువుల్లోకి వొచ్చి నందుకు, మంచి అలవాట్లబ్బుతున్నాయి" గర్జించింది. మీకు తెలివుంటే ఇరుగు పొరుగువాళ్ళకి సాయం చెయ్యండి. మెత్తగా కనిపిస్తే మొత్తడం బాగుండదు... అలా ఆడిపోసుకోటానికి అతడే కనిపించాడా? ఇంకెవరూ దొరకలేదూ?..."

ఏమేమో అనబోయింది; ఆవేశాన్నణచుకోడానికి చాల శ్రమపడింది. ఏమనాలో ఏమన్నదో కూడా గుర్తించలేని స్థితిలోవుంది సుశీల. ఇంతలో ఆమె గర్జనలకి ప్రతిధ్వని వినిపించింది. "మా అలవాట్ల జోలి నీ కెందుకులే"... "పరి

త్రాణాయ సాధూనాం" ... "కంకణబద్ధవు నువ్వుండగానా" "అంత మెత్తగా లేడంటావు" రకరకాల కంఠాలుగా, తలో చోటునుంచీ జవాబులొచ్చాయి. "జాలిపడ్డావుగా" "నువ్వే రక్షించు" ఒకమూలనుంచి వినిపించింది. "నువ్వున్నప్పుడు నేం పాలుపడతామూ" అన్నదింకో గొంతు. "తథాస్తు" అన్నాయి, ఒకేసారి చాలా కంఠాలు.

సుశీల కాళ్ళకింద నిప్పులు మండినట్లనిపించింది. వొంటినిండా తేళ్ళూ, జెఱ్ఱులూ పాకినట్లయి చీదరపుట్టింది ఆమెకు. "ఆ! నేనే ఉన్నాను. సమర్థురాలినే. నోరు మూసుకొని చూస్తూ ఊరుకోను. ఇంకా వాగేరంటే, తరవాతేమౌతుందో ఆలోచించుకోండి. నేను జాలీ పడగలను, జవాబూ చెప్పగలను. ఇంకేమైనా చెయ్యగలను. అంతటితో తగ్గండి" వొళ్ళు తెలియనట్లు వార్నింగిచ్చింది.

క్లాసంతా వాన వెలిసిన పరిస్థితి జారిపోయింది. ఆనాడు క్లాసులో ఆమె చెప్పిన జవాబు, కాలేజీ విద్యార్థిను లెప్పుడూ ఎక్కడా చెప్పి వుండరంటే, వింతలేదు.

ఇంత కోలాహలం సాకల్యంగా వింటూనే 'తన్నుకాద'న్నట్లు ఊరుకొన్నాడు అరుణ. ఐనా, ఆఖరున ఒక్కసారి తలెత్తి సుశీలవైపు చూశాడు; అతని భావమేమిటో-వెంటనే తలొంచుకున్నాడు.

లెక్చరర్ వచ్చి పాఠాలు ప్రారంభించటంతో గొడవణిగి పోయింది. క్లాసు ముగిసిన తర్వాత లెక్చరర్ అన్నాడు,

అరుణతో "రేపు నేనూళ్ళో ఉండనోయ్" అని. ఆ మాట క్లాసంతా విన్నారు; అరుణా విన్నాడు. అంటే 'విన్నాన'ను కున్నాడు. అంతే! తరవాతేమీ గుర్తులేదు.

౨౨

ఈ అరుణా, సుశీలల సంబంధం రెండు మూడుసార్లు కళ్లారా చూసి, మనసారా అంచనా వేసుకున్నారు; ఈనాడు నిలుపుకోలేకపోయారు. బయటపడ్డారు. అప్పటికీ, సిగ్గు పడ్డానికి బదులు 'తగుదున'ని, లేచి జవాబిచ్చింది సుశీల. అరుణేమీ అనలేదు. అతడు బాధపడ్డాడో, అవమాన పడ్డాడో, ఉగ్రుడయ్యాడో ఎవ్వరికీ అర్థంకాలేదు.

అరుణ ఎప్పుడైనా ఒక స్థితికి అలవాటుపడితే, ఆ యలవాటును ఆ ప్రాంతంలో వున్నంతకాలం కొనసాగిస్తాడు. ప్రస్తుతం తన కాలేజి జీవితంకోసం ఒక టైమ్ టేబిల్ తయారు చేశాడు, ప్రణాళికమాదిరి. ఉదయాన్నే లేవటం, కాలకృత్యాల తర్వాత కాఫీ, టిఫిన్లు హోమ్‌వర్కు పూర్తిజేసి ట్యూషనుకు వెళ్ళడం. ఎనిమిదిన్నరనుండి, తొమ్మిదిన్నర వరకూ పాఠం పూర్తి చేసుకొని హాస్టలు భోజనం చెయ్యడం, కాలేజికెళ్ళడం. మధ్యాహ్నం; లీజరులో కాఫీ తీసికోడం; సాయంకాలం గ్రౌండు అంచున కూర్చుండి చదవటం (ఆటవైపు చూడ్డం

నేరం) రాత్రి ఏడుగంటలకు ఇల్లుచేరి, చివరిసారిగా కడుపు నింపటం. కాస్సేపు పుస్తకంలో బొమ్మలు చూసినట్లు పేజీలు తిరగెయ్యటం; పుస్తకంతోసహా కళ్ళుకూడా మూసుకోడం. ఇదీ చర్య. శెలవు దినాల్లో తిండికీ, నిద్రకూ మినహాగా, అన్ని కార్యక్రమాలకూ స్వస్తి చెప్పటం. అతనిదో గడియారపు జీవితమైపోయింది. కావాలంటే కేలండరు జీవితంకూడా.

మర్నాడు యథాప్రకారం మాస్టారింటికి వెళ్ళాడు. తలుపులు మూసుకొని ఉన్నాయి. తట్టాడు. జవాబులేదు. పిలిచాడు. ఎవరూ పలకలేదు. "ఏంజెయ్యాలీ" అనుకున్నాడు. "ఇంటిలోవుంటే; ఎందుకుపలకరూ" ఆలోచించాడు. "బహుశః బైటికెళ్లారేమో" నిర్ణయించుకున్నాడు. "ఎక్కడికెళ్ళారో ఎలా తెలుస్తుందీ" మథనపడ్డాడు. ఇంతలో ఓ మెరుపులాంటి ఆలోచన తట్టింది; 'బైటికెళ్ళిన వాళ్ళ విషయం, బైట తిరిగే వాళ్ళకే తెలుస్తుంది' అని, కాకతాళీయంగానో, ఆలోచనా ప్రభావంమూలానో, బజార్లు తిరిగి కూరలమ్ముకొనే తాత బుజమ్మీద కూర్ల కావడితో ప్రత్యక్షమయ్యాడు. 'ఆ వేళ మందుకని' అవకాశం వినియోగించుకున్నాడు; అరుణ. వెంటనే అడిగాడు. "మా మేస్టారెక్కడి కెళ్ళారు తాతా" అని. కొట్టినట్టే కొడితే, యేడ్చినట్టే యేడ్చాట్ట అనిపించే జవాబిచ్చాడు తాత. "ఏమోబాబూ! మీ పంతులుగారెటెల్లారో, యాడికెల్లే పనుందో, అయన్నీ నాకేం తెలుత్తాయి; మీలాటోర్నడగాలి" అని జవాబిచ్చాడు తాత. "నాకు తెలిసిందే

నిజమైతే, తాతా! నాకు తెల్సు. మేస్టారు కాబట్టి కాలేజి కెళ్తారంతే. ఆయనకక్కడే పని. యేమంటావ్ తాతా" అంటూ తాత కభయమిచ్చి గడియారం చూసుకున్నాడు అరుణ. పావుతక్కువ తొమ్మిదైంది. 'అరే, కాలేజి టైమై, మాస్టారెళ్ళిపోటం జరిగిపోయినా తొమ్మిది కాలేదు. ఎక్కడో లంకణాల బండి నడక నడుస్తూందే' వట్టిగా స్వగతం చెప్పుకుంటున్నట్టు గడియారాన్ని మందలిస్తూ మెట్లు దిగుతున్నాడు.

తొందరగా మెట్లు దిగుతూన్న అరుణకు "ఇటు చూడండి" అనివినిపించడంతో, ఆగి వెనుదిరిగిచూశాడు. సుశీల కిటికీలో నిల్చుంది. "ఇదేమిటీ? జైల్లో వున్నట్టు యిక్కడున్నారేం?" ఆతృతగా అడిగాడు, భయపడుతూ.

"ఇదేగా మా ఇల్లు సరేగాని, యీ రోజున ఊళ్లో ఉండనని మాస్టారు చెప్పారు; మీకు జ్ఞాపకంలేదా?" నిన్నటి సంఘటనంతా జ్ఞాపకం చేసింది సుశీల.

"ఔనండీ! మరిచాను." మాస్టారి గది తలుపు పైకి చూసి "అదిగో తాళంకూడా వేసుంది. లేరు. నిజమే! మరి మీ విషయం? ఈ జైల్లో వుండవల్సిందేనా?" ఆస్కారం లేని అనుమానంలో చిక్కుకొని అడిగాడు అరుణ.

అరుణ అమాయికత్వానికి జాలిపడింది, సుశీల. "ఇందుకే మిమ్మల్నంతా లోకువ జేశారు."

"అన్నట్టు ... అడగాలనుకుంటున్నది అడిగేస్తాను జ్ఞాపకం చేశారుగా" పైకీ కిందికీ చూస్తూ ఆలోచించాడు.

"నిన్నమీరు నాకు సలహాలివ్వటంలో ఆదుకుంటానాన్నారు. త్వొందరపడ్డారా ?" ఎలాగో బ్రహ్మప్రయత్నంమీద పూర్తి చేశాడు.

నిన్నటి సంగతి గుర్తుకు తెచ్చిన వెంటనే సుశీలలో నిన్నటి రూపం, కోపం ఆవేశించి, ఆవిర్భవించింది. అరుణకు మనసులో వణుకు పుట్టింది. 'త్వొందరపడ్డానురా' అని నాలుకొర్కుకున్నాడు. 'ఏమైతేం, పెదివిదాటింది' అని విచారించాడు.

"వాళ్ళలా మాట్లాడితే, నేనూరుకోలేను. పైగా యేమైనా జరిగితే వాళ్ళంతు తేలుస్తాను" జవాబిచ్చింది.

ఆ రౌడీల నెలా అంతు తేలుస్తుందో తనకు అర్థం కాకపోయినా, తన అంతు కాదని అర్థమైంది. తనను కాదని తెలుసుకొని స్థిమితపడ్డాడు. జవాబిచ్చింది కాని, తన ప్రశ్నకు సూటైన జవాబుకాదు. అందుకే మళ్ళీ అడిగాడు. ఆ ప్రశ్నలోనే అతని ఉత్కంఠ పూర్తిగా ఇమిడి వుంది. "మనస్ఫూర్తిగా అన్నారా? నేనంటే, మీకూ అభిమానమే! అదృష్టవంతుణ్ని. అయితే, ఒక్క విషయం. నాకు లోకజ్ఞానంలేదట, అందుకని, నాకు పెళ్ళికాదట. నాన్నగారికిదే బెంగ. ఆ బెంగ పోగొట్టాలంటే, నేను పెళ్ళికి తగినవాణ్ణి అనిపించుకోవాలి. అహఁ, నాకు పెళ్ళికావాలని కోరికాదు. మీకు వీలుంటే, ఆదారికొచ్చేలా, ట్రైనింగివ్వండి. వీల్లేక పోతే, పోనీండి. నాఅదృష్టం" తప్పులేకుండా పాఠం వప్పచెప్పిన విద్యార్థిలా వినయంగా నిలుచుకున్నాడు అరుణ.

అతడడిగిన తీరు, అతని ముఖలక్షణాలు, అతని అడగటంలో భావం ఒకదాని కొకటి చేర్చి, పోల్చి ఆశ్చర్యంగా చూస్తోంది, సుశీల. చూస్తున్న సుశీల చూస్తూనే వుంది కాని, జవాబివ్వలేదు. ఆమెలో కలిగిన ఆశ్చర్యంతో చాలసేపటి వరకూ ఆమెను విడిచిపోలేదు. ఆమే తదేకంగా చూస్తూ నిలబడింది.

అరుణకు ఆమె వైఖరి అర్థంకాలేదు. 'నాలుక జారిందను' కొన్నాడు. 'ఆమెను బాధపెట్టాన'ని విచారించాడు. "మీకు బాధ కలిగించాను; అది నా పొరపాటు. ఇక నా విషయాన్ని మరిచిపొండి. శెలవు." తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

౬

అతడు ఎదుటి సందుమలుపు తిరిగివెళ్ళిన తర్వాత సుశీలకు వొళ్ళు తెలిసింది. అతడడిగిన ప్రశ్నకూడా గుర్తుకొచ్చింది. 'అతడ్ని ఆశపెట్టడం దేనికి? అడిగినప్పుడు అతనికేమీ జవాబుచెప్పకపోవడం ధర్మంగావుందా? భావ్యమేనా! ఎవర్నైనా అతడు సహాయం అడిగాడా?' తనకు తాను స్వయంగా పూనుకొని, అతడ్ని విద్యార్థుల్లోంచి కేటాయింపు చేయించింది. అతడినలా అల్లరిపాలుచేసి, ఇప్పుడు చూస్తూ ఆనందిస్తోందా? అల్లరిపాలు చెయ్యటం బాగుందా? తన

తండ్రికి ఆ పట్నంలో ప్రాబల్యం వుంది. గనుక తానుగట్టిగా, మాట్లాడగలిగింది. పొరుగూరివాడు, అరుణ, యెల్గా మాట్లా గలడు? పైగా అతని తండ్రి కిలాటివి కిట్టవు. అందుకే, మాట్లాడలేకపోయాడు. అతనిలో బాధ పైకి కనిపిస్తే, కాకులు పొడిచినట్టు పొడుస్తారు స్టూడెంట్లు. అందుకే తనకేం పట్టనట్టు కూర్చున్నాడు. ఓర్చుకుని క్లాసుగడిపేశాడు, క్రమంగా మరిచి పోవాలని.

మరిచి పోయే ప్రయత్నంలో పరాకు తెచ్చుకున్నాడు. అరుణ. అదే పరాకులో మాస్టారూళ్లో ఉండరన్న సంగతి కూడా మరిచాడు. దాని ఫలితంగా పాఠానికొచ్చాడు. ఇక్కడ సుశీల కనిపించింది. ఆమె క్లాసులో అన్నమాటలతో సంగతంతా గుర్తుకొచ్చినా; పదిమందిలో ఆమె యిచ్చిన హామీ గుర్తుకురాగా, ఆశపడ్డాడు. అంతమందిలో ఆమె తెగించి మాటాడ్డమే అతడ్ని ఆశపెట్టింది. అదే ఆసరాతో, తన సందేహాన్నీ ఆశనీ వివరంగా చెప్పాడు. ఒక దానికి జవాబిచ్చింది, తర్వాత ముఖ్యంగా తనక్కావల్సిన దానికి జవాబివ్వనేలేదు. సుముఖమో, విముఖమో, అసలు జవాబే లేకుంటే? నాలుక్కరుచుకుని వెళ్ళి పోయాడు. 'గొడ్డుగోతిలో పడితే, అంతా తలోరాయీ వేసి పూడుస్తారు కాని, ఊతనిచ్చి పైకితీస్తారా' అనుకున్నాడు అరుణ. ('If hopes were dupes, feals may be lievs') 'ఆశలు అవకాశాలైతే, భ్రమలన్నీ మాయమౌతాయి' అనే సూక్తిమీద ఆశపడి, ఇంతగా గాయపడ్డాడు, పాపం! యింకెవర్నైనా నమ్ముతాడా?

తదేకంగా చూస్తూ నిల్చున్న సుశీల దృష్టిపథంనుంచి అరుణ తప్పుకొన్నాక స్మృతి పథంలోకి వచ్చింది "అరె! ఆతడు వెళ్ళిపోయాడు! అతడికి జవాబు చెప్పనేలేదు. ఒక్క క్షణం నిలబడి నా జవాబు వినివెడితేయేం? అంత తొందర పనుందా? ముళ్ళమీద నిలబడ్డవాడిలా, తప్పించుకుని వెళ్ళి పోయాడేం?' అతని తొందరకు ఆశ్చర్యం చూపింది సుశీల.

'ఆ ప్రశ్న అడిగిన తీరేమిటి? అదేనా అడగటం వరస? యే విషయం మాట్లాడుతున్నాడో, యెందుకడగాల్సి వచ్చిందో, ఒక్కటీ పట్టించుకోడేం? భలేవాడే! ఇందుకే ఆ తండ్రి కింత వ్యథ. ఇలాటివాడ్ని మార్చటం మామూలు విషయం కాదు. మాస్టరువల్ల నయ్యేదికాదు అనుక్షణం అతడితో తిరుగుతూ, అతడి కార్యక్రమాన్ని సరిదిద్దగలిగిన వ్యక్తి కావాలి. ఇతరులేం చెయ్యగలరు?'' అరుణ తత్వాం పూర్తిగా గ్రహించినట్లు నిర్ణయాని కొచ్చింది.

'పాపం! యేమనుకొన్నాడో యేమో? క్లాసులో అంతమంది పిల్లల్లో ప్రమాణం చేసినంత పనిచేశాను. ఇప్పుడిక్కడ, తనకావలిసిన పరిస్థితి చెబితే కిమ్మనకుండా ఊరుకున్నాను. నమ్మించి సమయానికి తప్పుకునే వాళ్ళల్లో నన్నూ జమకట్టేస్తాడు. ఇంకా నన్ను నమ్ముతాడా? ఇంకెవర్నైనా నమ్ముతాడా? అసలతనిలో నమ్మకానికి చోటుందా? అపనమ్మకం ప్రపంచంలో ఇలాగే ప్రవేశించిందేమో!' 'అవిశ్వాసానికి చోటును మీమాంసచేసి చూసింది.

ఆలోచించిన మీదట సుశీలకు తను చేసినపని 'తప్పు'ని తోచింది. ఒక విద్యార్థిని, తను ప్రేరేపించి క్లాసులో వెలి వేయించినట్టు తనకి స్పష్టంగా తోచింది. అదికూడా సహకార మనే పేరుతో, ద్రోహం చేసినట్టు కనిపిస్తూంది. తన్నతడు నమ్ముతాడా ?

సుశీలకు నిజంగా సహకారపు ధోరణుంటే; అతణ్ణి నమ్మించటం ప్రథమ కర్తవ్యం. ఆమె యీ నిర్ణయంమీదనే నిలిచి, మార్గాంతరం వెదుకుతోంది. ఒక నిర్ణయాన్ని తప్పు దోవలకీడ్చే ఉపాయలు తేలిగ్గాతోస్తాయి; అనువుగా నెర వేరతాయి. ఒక అపమార్గాన్ని ఖండించే ఉపాయాలు అరు దుగా తోస్తాయి; కష్టతరంకూడా.

కొద్దిరోజుల్లో పట్నం నిండా వింత వింత పోస్టర్లు వెలి శాయి. ఏ గోడమీద చూసినా 'అరుణ – సుశీల' అన్న అక్షరాలే ? రకరకాలైన సైజుల్లో, ఆకర్షణీయమైన రంగుల్లో చిత్రించబడ్డాయి. తరహాలవారిగా ప్రజలు యీ 'అరుణ – సుశీల' బ్రాండుకు విపరీతార్థాల్ని కల్పించుకున్నారు కూడా. వ్యాపారాలలో తిరిగేవారు యీ వాల్‌పోస్టరును మందుల తాలూకు ఎడ్వర్‌టైజ్‌మెంటేమో ననుకున్నారు. కొందరు మధ్యతరగతి ఉద్యోగులు, సామాన్యులు యీ ప్రచారాన్ని 'ద్విసభ్య నియోజకవర్గం (అసెంబ్లీ) లో పోటీదార్లేమో' ననుకున్నారు. ఇక రిక్షావాళ్ళూ, అలగాజనం 'ఇదేదో కొత్త సినిమా' అనుకున్నారు. దీన్ని సృష్టించడంలో ఆ వాళ్ళకే తెలుసునంతే !

# ౭

నెమ్మదిగా యీ విషయం ప్రిన్సిపాలుకు చేరింది అది కూడా అనామక లేఖరూపంలో. సంతకం లేని లేఖ నమ్మాలో అక్కర్లేదో తెలియదు. దస్తూరీ 'ఫలానివారిద'ని తెలియటం లేదు. ఏం జెయ్యాలీ? అడ్మిషన్ ఫైలు తిరగేసి చూశాడు. అరుణను గురించి డిస్ క్వాలిఫికేషను లేదు. సుశీల విషయంలో కూడా అంతే! ఇద్దరి విషయంలోనూ కేరెక్టర్ సర్టిఫికేట్లు అనుమానించడానికైనా చోటియ్యటంలేదు. ఐనా, ఊరుకుంటే ఇటువంటి అల్లర్లు మితిమీరి, మిన్నుముట్టి, మింటికీ మంటికీ ఒకటై, ప్రజావాహినిలో అనర్థాల్ని సృష్టిస్తాయి. ఒక విషయంలో వూరుకుంటే వెంటవెంటనే అనేక విషయాలు పుట్టుకొస్తాయి. దానితో కళాశాల ప్రతిష్ఠ పేపర్ల పాలయ్యే ప్రమాదంకూడా వుంది. "ప్రభువు దుర్మార్గుడయిన శ్రీవిభుని తప్పు" అన్నంతవరకూ పోయి పొలిమేరదాకా విస్తరించుకుంటుంది. ఏది యెలావున్నా తనస్థానాన్ని తనైనా గౌరవించుకోవాలి. లేకుంటే ప్రజలేం గౌరవిస్తారు? అంతవరకూ తనూ తనకాలేజీ శూన్యంలో జమయిపోడం నిజం! అందుకే విచారణకు పూనుకున్నాడు.

ముందుగా సుశీలను పిలిపించి విషయాన్ని ఆరా తీశాడు. అరుణతో తనకున్న సంబంధం, సానుభూతి క్రమంగా చెప్పింది. అతడ్ని గురించి వింతపడిన విషయం అతని అజ్ఞానానికిదొరికిన రుజువులూ, అతనికియ్యబోయిన సహకారం చివరకు తన నిర్ణయం, క్లాసులో జరిగిన అల్లరీ, అందుకు కారకులూ మొదలైన విషయాలన్నీ క్రమంగా నివేదించుకుంది. ఆమె పూనుకున్న వ్యవస్థకు ప్రిన్సిపాల్ సంతోషపడినా, ప్రజాదృష్టినికూడా ఆలోచించాల్సినవాడు కనుక, అరుణను కూడా విచారించాడు. "అతని భావంకూడా తెలియాలి; అంతవరకూ ఇక్కడే వుండు" అని సుశీలను నిలిపి, అరుణను పిలిపించాడు.

అరుణవచ్చి ప్రిన్సిపాలుకు నమస్కారం చేశాడు. ఓ ప్రక్కగా నిలబడ్డాడు, 'పిల్చినపని సెలవియ్యమ'న్నట్టు చూస్తూ. ప్రిన్సిపాలు అరుణవేపు పైనుండి క్రిందికిచూసి "ఈమె యెవరో తెలుసా" అంటూ సుశీలను చూపించాడు.

"ఈమెపేరు సుశీల; ఇంగ్లీషు లెక్చ్చరరున్న ఇంటిలో చూశాను. నా క్లాసు, నా గ్రూపే. విద్యార్థులు కాని, ఉపాధ్యాయులుగాని లక్ష్యపెట్టని విషయాన్ని యీమె తానుగా పూనుకొని, నా విషయంలో తోడౌతూ వచ్చింది. ఆమెను గురించి యింకేమైనావుంటే ఉండగలవేమో కాని, నాకు తెలిసిన వింతేనండి." వినయంగా చెప్పాడు.

"ఐతే మీ చర్యలు గోడలమీద పోస్టర్ల కెక్కాయిగా, దానికి నీ జవాబేమిటి?" రెట్టించాడు ప్రిన్సిపాల్.

"ప్రపంచంలో మానవులుగా పుట్టి జీవించటంలో ఒకటే విశేషం. జీవించి తానేనామే ఒక కార్యం సాధించటం, దానికి తగిన ఆలోచన చెయ్యటం, శ్రమించటం, ధైర్యముగా ముందుకు సాగటం; జయించటం, ఇవన్నీ కలిపితే 'జీవిత' మౌతుంది. వీటన్నిటికీ సహకారం కావాలి. ఏకాకిగా యెవ్వరూ యేమీ సాధించలేకపోవచ్చు. సహకారమన్నా మరొకరి ఆసరా అన్నా ఒకటే. యీ ఆసరా నివ్వటం (support) విద్యార్థి దశలోనే అలవాటు చేస్తారు. టీములుగా ఆటలాడించడం; జట్లుగా ఎక్స్‌కర్షనుకు పంపడం; స్క్వాడ్రన్‌గా స్కౌటు క్యాంపు చేయించడం మొదలైన రీతుల్లో సహకారాన్ని అలవాటు చేస్తారు."

"ఇలాంటి సహకారం మీరు చెప్పినంతవరకేగాని, మాకు మేం స్వయంగా పొందకూడదనీ, స్వయంగా సహకారమియ్యకూడదనీ అనుకోలేదు."

"నా విషయంలో ఒక్క నోట్సు యెరువిచ్చేందుకు ఎవరూ సిద్ధంగా లేకపోయారు. అనుకరించే సామర్థ్య మందరికీ ఉండదు సహజంగా; అలాగే నాకూను. యీమె దగ్గర నోట్సు తీసుకొని యిచ్చేశాను. యీ విషయంలో క్లాసంతా కాకి గోలకి దారితీసిందంటే? వారికబ్బిన సంస్కారం, ఆ చొరవ నిచ్చిన అధికారం, అలాంటివేమో ననుకున్నాను. ఒక్క పెట్టుగా క్లాసంతా అపహాస్యం చేసిందంటే, సహవిద్యపైన వాళ్ళ అభిప్రాయం చక్కగా తెలుస్తోంది. అధికార్లుకూడా ఆ విషయమ్మీద దాడి చెయ్యదల్చుకుంటే,

5)

వెనకబడ్డవారు అటుముఖంగా అధిగమించిపోతారు,మార్గాంతరం లేక !"

"తనకొ్కవలసినవిషయాన్ని ఎన్నోరీతులుగా పొందగోర్తాడు, మానవుడు. ఉపాధ్యాయుల్ని విసిగించని పద్ధతిలో ఇరుగు పొరుగు పిల్లల్నడిగి తెలుసుకోడం విద్యార్థి లక్షణం. అడిగేది ప్రశ్నే కావచ్చు, వస్తువే కావచ్చు. 'అలా సందేహం తీర్చుకోటం తప్పు' అనగలిగితే, యిక సందేహాలుండనక్కర్లేదు; దానితో విద్యాసంస్థలు కూడా ఉండనక్కరలేదు." ఇంకా చెప్పబోతున్నాడు అరుణ. ఇక ప్రిన్సిపాల్ వినలేకపోయాడు.

"సరే, యిక వెళ్ళొచ్చును." అరుణనుపంపించేశాడు. "సుశీలా! పాపం అతనంత ఉద్రేకంలో వున్నాడు. అతన్ని గుర్తించే వారెవరూ లేకపోయినా, నీవుపూనుకున్నావు. నీ వ్యవస్థకు నా స్వాగతం. అధైర్య పడకుండా, నియమంతో కార్యక్రమాన్ని కొనసాగించు." సుశీలకు ధైర్యం చెప్పాడు.

మధ్యాహ్నం 'అరుణ-సుశీల!' ప్రచార కార్యక్రమాన్నికొనసాగించిన వాళ్ళందరికీ తలా యాభైరూపాయిలఫైను, వారం రోజులు సస్పెన్షన్ విధించాడు.

నాటినుండీ, వాళ్ళ ముఠా రాజకీయం 'కామెట్ క్రాష్'చేసిన విమానంలా కూలిపోయింది. ఐనా, వాళ్ళ ప్రయత్నం విరమించటంజరగలేదు. దాని ఫలితంగా హాస్టల్ వార్డన్‌నుంచి అరుణ కొక శ్రీముఖం చేరింది. "ఇరవైనాలుగ్గంటల్లో హాస్టలు కాళీచేసి వెళ్ళిపోవలసింద"ని దాని అభిప్రాయం.

ఇటువంటి విషమసమయాల్లో ఎంత తెలివైనవాడైనా స్థయిర్యం చెడగొట్టుకుని, వెర్రి కోపం ప్రదర్శించి, తనకున్న స్థానాన్నే పాడుచేసుకుంటాడు. ఒకోక్కడు స్థయిర్యంపోగొట్టుకుంటాడు; ఇంకొకడు చదువు పోగొట్టుకొని యింటి ముఖం చూడలేక దేశదిమ్మరితనాన్ని యెరువు తెచ్చుకుంటాడు. కాని, అరుణ మాత్రం తనలో తానే తొక్కిసలాడుతున్నాడు. అంతేకాని, యెవ్వరికీ చెప్పుకోలేదు.



ఆ మధ్యాహ్నం లీజరులో క్లాసంతా తలోవిధంగా చెదిరిపోయింది. అరుణ మాత్రం ఎక్కడికీ పోలేదు. అసలెక్కడికీ వెళ్ళాలనిపించటంలేదు. తను రేపు ఈ సమయానికి హాస్టలునుండి బైటికెళ్ళాలి; అదే జ్ఞాపకంవొచ్చి 'ఎక్కడికి కెళ్ళాలి?' అనే అనుమానం బాధ పెడుతోంటే, సందిగ్ధావస్థలో ఊగులాడుతూ ఆలోచిస్తున్నాడు.

'ఈ కొత్తవూళ్ళో నన్నెరిగిన వాళ్ళెవరూ? నేనెవరినడిగితే యిల్లు దొరుకుతుందీ? .... నా గతేమిటీ? .... కాళీ చెయ్యకపోతే, సామాను వీధిలో పారేస్తారు. నేను సామానెక్కడ దాచాలీ? ... హోటల్లో రూమ్ తీసుకుంటే? .... ఇక చదువు సాగదు....వచ్చే పోయే రొదతో నిద్రా చదువూ

కూడా శెలవు తీసుకుంటాయి. పోనీ నాన్నగార్ని రమ్మని టెలిగ్రామిస్తే ?.... ఎందుకూ ?....

సలహాకోసం మాస్టారున్నారుగా.... ఐతే, మాస్టారికి వూళ్ళో పరిచయాలేమున్నాయ్?.... నాన్నగారికి మాత్రం వున్నాయా?....ఐనా, మాస్టారికి యీ విషయం చెబితే?.... చెప్పనక్కర్లేదనుకుంటాను.... ఈపాటికి తెలిసేవుంటుంది.... సరే!అలా చెయ్యొద్దు. ఇంకెలా చేస్తే యీ చిక్కు తొలుగుతుంది?.... యేమో. అంతా అగమ్యం.'

ఆలోచనల్తో తల తిరిగిపోతూండగా అరుణ నెవరో పిల్చారు. అటుతిరిగి, తొట్రుపాటునణుచుకుంటూ చూశాడు. జైరామ్, పిల్చాడు. "మీరు కాఫీ కెళ్ళలేదనుకుంటాను. వొస్తారా?.... కాస్త మాట్లాడాలికూడా." ఆహ్వానించాడు తనను. ఎంతో ఆప్యాయంగా పిలిస్తే 'రాన'నలేకపోయాడు అరుణ. ఇద్దరూ హోటలులో ఒకమూలకు చేరుకున్నారు. వెళ్ళడంతోనే 'రెండు కాఫీ' ఆర్డరిచ్చాడు జైరాన్.

"మీకు హాస్టలు వార్డర్‌నుండి నోటీసొచ్చిందని విన్నాను. అదెంతవరకూ నిజం?....అంహాం.... మరోలా అనుకోవద్దు. నేను వాళ్ళ కోవలో వాణ్ని కాదు. మీరు యిబ్బంది పడనక్కర్లేదు. మీకు కావాలంటే, నేనో గది యిప్పిస్తాను. నాకు తెలిసిన వాళ్ళున్నారు; వాళ్ళ ఇంట్లోనే ఓ గది కాళీగా వుంది. దాన్ని నా మాటమీద తీసుకుని మీ కిప్పిస్తాను. 'అవసరమా....కాదా' అనే అడుగుతున్నాను." ముక్కుకు సూటిగా మాట్లాడి లెక్కల విద్యార్థి ననిపించుకున్నాడు, జైరామ్.

"నిజంగా? ....మీకావుపకారధోరణేవుంటే, అలాగే చెయ్యండి. యీస్థితిలో నేనెవ్వరినీ నమ్మలేకుండావున్నాను. అందుకే యెవ్వరికీ చెప్పుకోలేకపోయాను,కూడా! సరే, గది యెలాటిదైనా, యెక్కడున్నా, అభ్యంతరం లేదు. అద్దె యెంతైనా సరే. అడ్వాన్సు కావలిస్తే చెప్పండి." అరుణ తన ధోరణిలో మాట్లాడుతూ తన నిస్సహాయ స్థితినికూడా బైట పెట్టుకున్నాడు. ఇంతలో జైరామ్ అతడ్ని వారించాడు.

"సరే. అవన్నీ సాయంకాలం మాట్లాడుకుందాం. రాత్రి యేడు గంట్లకి మకాం మార్చేద్దాం. సిద్ధంగావుంటారుగా?.... ఇక నేను క్లాసుకు రాను. ఇటునుండి యిటే వెళ్ళి, తాళం తీసుకొని, గది బాగుచేయిస్తాను. వస్తా." అంటూనే వెళ్ళిపోయాడు.

సుమారు రాత్రి యేడున్నరకు జైరామ్ సహాయంతో రెండు రిక్షాలమీద సామాను వేసుకుని హాస్టల్‌నుండి బైట పడ్డాడు, అరుణ. రాత్రి సమయాన మారటంచేత, పైగా హాస్టలునుండి రావటంచేత, అరుణ తను ప్రయాణించిన సందులన్నీ గుర్తుపెట్టుకుని కొత్తగదిని చేరుకున్నాడు.'అందువల్ల తెలవారాక దారి వెతుక్కోనక్కర్లేద'ని అభిప్రాయపడ్డాడు.

తెల్లారింది. పళ్ళు తోముతూ బ్రష్‌తో పెరట్లో కుళాయి దగ్గరికెళ్లాడు అరుణ. అక్కడ అదే సమయానికి ముఖం కడుక్కున్న సుశీల ప్రత్యక్షమయేసరికి నిర్ఘాంతపోయాడు, "ఇదేవిటీ? తెల్లారక ముందే మాయిల్లెట్లా కను

కున్నారూ?....అంత విశాల భావంతో నన్నింకా దయ తలుస్తున్నారా?" నిదానం లేకుండా మాట్లాడాడు.

"ఓహో...ఇతడా కొత్తగా దిగింది?" అనుకొంటూ సుశీల, పైకేం తెలియనట్టు నటించి, "ఇది మా యిల్లేగా" అంది.

"మీకు మా మీద అలాటి అభిప్రాయమున్నందుకు కృతజ్ఞుణ్ణే.... ఐనా, 'శ్రమ' అనుకోకుండా, తెల్లారేసరికి నా గదిని కనుక్కున్నారు. బాగుంది. లోపలికెళ్ళి గదంతా చూడండి, చదువుల గది అనిపిస్తూందో లేదో. ఇంకా కొంత సద్దాల్సిందే. మీకు యెలా అనిపిస్తుందో చెప్పండి. దాన్ని బట్టి మార్పులూ చేర్పులూ చేసి, మెరుగనిపిస్తాను." వేడుకోలుసం వేడుకున్నాడు.

సుశీల గదిలోకెళ్ళి చూసింది. 'చిందర వందరగానే వున్నాయిగా' అనుకుంది. కాని, పైకనలేదు. "బాగుంది. మిగిలింది మీరు చెయ్యలేరు. సాయంత్రమో, యెప్పుడో నే చేస్తాలెండి" అంటూ వెళ్ళిపోయింది.

ఆనాడు టీచరు దగ్గిరికెళ్ళటానికి, రాత్రి పెట్టుకున్న గుర్తులు తడువుకుంటూ హాస్టలుకెళ్ళి, అక్కడినుంచి తిరిగి మేస్టారింటికొచ్చాడు. ఒకే యింటికి యీ వైపునున్న గది చేరుకోవాలంటే 'నీ ముక్కెదిరా!' అన్నట్టు తిరిగొచ్చాడు.

అసలది సుశీల యిల్లనీ, దాంట్లో ముందువైపు ఓ గదిలో మేస్టారుంటున్నారనీ తెలిస్తేగా? అందుకే తనిప్పుడు వెనకవేపు గదిలో ఉన్నట్టుకూడా తెలియంది! ఈ 'తణుకోయి మాచారం' యాత్ర చూసి సుశీల జాలిపడింది. అతని కెలాగేనా ఆ విషయం తెలపాలనుకుంది.



సాయంత్రం కాలేజీనుంచి వొచ్చేటప్పుడు అరుణను కలుసుకుని "మా యింటికొస్తారా.... పనుంది" అంటూ తన కూడా తీసుకొచ్చింది. "ఇదిగో యిది నాన్నగారి గది. యిది నా చదువుల గది. యిది మేష్టారి కద్దెకిచ్చిన గది. ఆ పక్క వాటాలో ఓ సంసారం వుంది. ఇది హాలు, ఇది మా కిచెను. ఇది పెరడు. యీ నల్లాలమీదుగా పోతే అది బాత్‌రూమ్. అది మీ కిచ్చిన గది." అంతా పరిచయం చేసి కాఫీ చేతి కిచ్చింది.

"ఐతే, నేనే మీ యింటి కొచ్చానన్న మాట!"

"అంటే అంత పొద్దున్నే మీ యింటికి నే నొచ్చా ననుకున్నారా?" అరుణ విషాదానికి పరిహాసంగా జవాబిచ్చింది. అది అతన్ని గాయం చేసింది.

"అలా అనుకున్నా, అది పొరపాటని యెప్పుడో తెలుసు. ఐనా, యీమధ్య నాకూ పొరపాట్లుపడ్డం జోరై పోతోంది లెండి." బలవంతంగా నవ్వాడు. అంతలో ఆమె

తండ్రి వెంకటాద్రిగారొచ్చారు; "మెవరీ యబ్బాయీ" అంటూ.

"వీరే నిన్న రాత్రి మన గదిలో ప్రవేశించింది..." ఇంకా చెప్పబోతుండగా "మన గదిలో రాత్రి ప్రవేశించాడా" అన్నాడు కంగారుపడుతూ.

"కాదునాన్నా, ఆ వైపు గదిలో అద్దెకు దిగినదీయనే. నా క్లాస్‌మేటూ పైగా, యింగ్లీషు లెక్చరర్ దగ్గర ట్యూషన్‌కొచ్చేవారుగా అరుణ." తాపీగా అర్థంవయ్యేలా పరిచయం చేసింది.

"ఆయనే కాబోలు తండ్రీ" అనుకొని, అరుణ నమస్కారం చేశాడు.

"ఎవరబ్బాయివి నాయనా"

"అత్తలూరి వెంకటప్పయ్యగారబ్బాయినండి. మాది చోడారం." వినయంగా చెప్పాడు.

"అలాగా! బాగుంది. నీకు మా యిల్లు సౌకర్యంగా వున్నట్టేనా? ఏదేనా కావాల్సొంటే నాతో చెబుతూండు. మొహమాట పడకు." పెద్దవాడిన్ని అనిపించుకునేట్టు మాట్లాడి వెళ్ళిపోయాడు.

అరుణకు వాళ్ళిద్దరి పద్ధతులూ అదో రకంగా తోచాయి. 'తనకు తానొచ్చి సాయంచేసింది సుశీల. అందుకు ఫలితంగా హాస్టల్నుంచి బైటికి రావాల్సొచ్చింది. ఈయనకూడా మంచితనాన్ని కనబరుస్తున్నాడు. ఐతే, ఇదెక్కడికి దారితీస్తుందో!'....ఆలోచనలో తికమకపడుతుండగా పలకరించింది.

"ఏదో ఆలోచిస్తున్నారేవిటీ?"

"ఏబ్బే, రెండు లెక్కలు యీ పూట అడ్వాన్సుగా చేసేస్తే, ఫీజిక్సునోట్సు పూర్తి చేసుకోవచ్చుననీ" అర్థోక్తిలో నిలిచిపోయాడు.

"మీరు రాసేందుకు ఫిజిక్సు నోట్సేంమిగిలింది? అదెప్పుడో రాసేశారుగా!" ఆశ్చర్యంగా అడిగింది.

"రాసేస్తే వొచ్చినట్టేనా? రిఫర్ చేసుకుంటూ చదవొద్దూ?" ఆలోచనలేకుండా చెప్పినమాటను సమర్థించుకున్నాడు. 'ఇక పరాకుమాట లాడడం బాగుండదని' శలవ్ తీసుకుని గదిలోకొచ్చిపడ్డాడు విసురుగా.

ఇల్లు దొరికిందని సంతోషించినా, మళ్ళీ తన విషయం మొదటికే వొచ్చిందేమో ననే అనుమానం అతణ్ని పీకుతోంది. యేమైతేనేం! హాస్టలునుంచి పొమ్మంటే, తనకు నివాసం వెంటనే దొరికింది. అయితే తనకొకావల్సింది తన మనసు నంతలోనే సరిపెట్టుకొని రోజులు దొర్లిస్తున్నాడు.

సుశీల యింతవరకూ అతణ్ని బాధించానని పశ్చాత్తాపపడుతున్నట్లు అతని కర్థమైంది. చాలావరకూ అతని మంచి చెడ్డలని విచారించి సలహానిస్తూంది. యిలా కొద్ది రోజులు బాగానే గడిచింది.

అరుణ యే శలవులకీ యింటికెళ్ళే ప్రయత్నం చెయ్యలేదు అయినా, ఉత్సాహంగానే కాలం గడుపుతున్నాడు. అదంతా సుశీల యేర్పాటేనని చెప్పాలి. ఆఖ

రుకు ఉదయాన కాఫీకైనా బైటికి పోనీయకుండా తన యింటిదగ్గరే ఎరేంజి చేసింది. ఇప్పుడు భోజనం హోటల్లోనూ, చదువు స్కూల్లోనూ, విరామం స్నేహితురాలితోనూసాగిపోతూంది. అతడు అద్దె యింటో వుంటున్నట్టు కూడా మరిచాడు.

అరుణ తండ్రి వెంకటప్పయ్యగారు, ఏ నెలకో ఓసారి చూడ్డానికొస్తారు. ప్రతి నెలా అవసరమున్నా లేకపోయినా రెండొందల రూపాయలు పంపుతాడు. పండుగలకి గుడ్డలూ, ఇతర వస్తువులూ కొనేందుకు అదనంగా రెండొందలు పంపుతాడు, అంతే, ఆయన బాధ్యత అన్నట్టు. వొచ్చినప్పుడు 'విశేషాలేవిటి' అని అడగరు. అడిగినా అతడేమీ చెప్పలేడు. నీళ్ళు నముల్తాడు. 'ఆరోగ్యంగా వుంటున్నావా' అంటారు. 'ఆ' అంటాడు. 'చదువు జరుగుతోందా' అంటారు. 'ఆ' అంటాడు. 'ఇంకా ఏమైనాడబ్బు కావాలా' అంటారు. 'ఇంకానా, యెందుకూ' అంటాడు. 'యీడబ్బు చాల్తుందా' అంటారు. 'మిగుల్తోంది కూడా' అంటాడు. 'ఎక్కడికి పోతుందిలే, పోస్టులో వెయ్యి' అని సలహా యిస్తారు. 'అంతే చేస్తున్నా' అనడంతో వాళ్ళిద్దరికీ అడుక్కోడానికీ, చెప్పుకోడానికీ యేమీ మిగలవ్.

ఇక సుశీలకూడా తన బాధ్యతని సరిగా నిర్వహించినట్టే తృప్తిపడుతూంది. చదువుతున్నాడో లేదో చూస్తోంది. వేళకి నిద్రపోతున్నాడో లేదో తెలుసుకుంటోంది. ఆరోగ్యంగా ఉన్నాడనేది స్వయంగా గ్రహించి ఊరుకుంటోంది.

యిక "చాకలి బట్టలు తెచ్చిందా?" అని అడుగుతుంది. "నిన్ననే జైరామ్ వెళ్ళి గుర్తుచేస్తే తెచ్చింది" అంటాడు. "పాకీవాడికి మీరు మళ్ళీ పైసలిచ్చారా" అంటుంది. "అడిగాడు, యిచ్చాను" అంటాడు. "నాకు చెప్పలేదే" అని సాగదియ్యబోయి మానేస్తుంది. అయినా ఆమె గీర్వం తియ్యబోయిన ధ్వని వినిపిస్తుంది. "అదే, వాడడిగాడు, నే నిచ్చాను. ఇందులో మిమ్మల్నీ వాణ్ణి కన్నట్లు చేసేదే వుందీ, పావలాకోసం" అంటూ సాగదీసినట్టు సమాధాన మిస్తాడు. "పావలా అయితేమాత్రం"అని సణుక్కోబోయి తనకా అధికారం లేకపోయినందుకు నొచ్చుకుంటూ, నోరు నొక్కుకుంటూ వెళ్ళిపోతుంది చాటుకి. తెగేవరకూ లాగుతాడు అరుణ. "ఏదో అనబోయి మానేస్తారేం, మీ నోటికీ చేతికీ అడ్డువస్తున్నానా" అంటూనే, అడ్డు తప్పుకోవాలనట్టు వెళ్ళిపోతాడు. ఆమెలో తలెత్తిన కించిదుద్రేకానికి నవ్వుకుంటాడు కాని, కోపగించడు. 'మధ్య తన సొమ్మేంపోయిందనో, అలా సణుగుతుంది? చాకిరీ చేసేవాళ్ళు చిన్నపిల్లలూ సమానం' అనుకుంటాడు తనలో. ఓ రోజున తిరగబడి అడిగేసింది సుశీల. "ఏంవనుకుంటున్నారు, అడిగినవాళ్ళందరికీ ధర్మం చేసినట్టు పంచిపెడుతున్నారు?"

"చంటిపిల్లలు తల్లిదగ్గిరో కొంచం, తండ్రిదగ్గిరో కొంచం బెల్లించుకు తింటారు. చాకిరీచేసేవాళ్ళూ అంతే! మకాంలోవున్నవాళ్ళందరినీఅడిగితే ఏమనుకుంటారు. మందలించినట్టు నటిస్తూ పావలా బేడా పారేస్తూనే వుండాలి.

యెంత తిన్నా కడుపు నిండేవరకేగా, యెక్కువెవ్వరూ తినరులెండి.... పైగా, నెలకి రెండొందలు ఖర్చొతున్నాయ్. నాటిలో పావలాతిన్నవాడేనా మెచ్చుకుంటాడుకదానిపారే స్తున్నా నంతే. ఇందులో మీకు బాధగా తోచిన ఖర్చు యీ పావలా డబ్బులూనా?"

"పావలా అనికాదు, వాడికి జీతం జీతంలాగే ముడు తుంది. పైగా, మీ దగ్గిరా, నా దగ్గిరా, యింట్లో యెవళ్ళు కనిపిస్తే వాళ్ళదగ్గరే పావలాలూ బేడలూ వసూలుచేసుకు పోతున్నాడు. అలాటి అలవాటుచేసి నెలజీతా లెందుకివ్వాలీ అని?"

"అదా? సరే, మాన్పించెయ్యండి. కాని, చూడండి... విసుగులేదుగదా?.... మనం వేళకి కడుపునిండా తింటాం. అయినా, అప్పుడప్పుడు చిరుతిళ్ళకి ఎగబడతాం. ఎందుకనీ? మనకంటే వాళ్ళేం నాగరికులా! ఆరోగ్య సూత్రాలు తెలిసినవాళ్లా? యింతకీ, మిలటరీ తిండితో అందరూ బతగ్గలిగితే, ప్రత్యేకించి మిలిటరీ అక్కర్లేదు. అంతా వాళ్ళే! యేమంటారు?"

అరుణ జవాబు ఒక విధంగా బాగుందనిపించింది. ఆ జవాబును తనెదుట యెవరికేనా చెబితే తనకి నచ్చుదే! తనకే చెప్పడంమూలాన అది నచ్చలేదు, సుశీలకి. నవ్వు లాటల అనంతరం యిలాటిదేదో ఒకటి తటస్థపడి మాతి ముడుపులూ. ముభావాలు అనుభవంలోకి తెచ్చుకుంటూ ఉండేవారు. కొన్నాళ్ళకి మరీ చనువెక్కువయ్యాక, అంటే

దాదాపు మొదటి సంవత్సరం పరీక్షల సమయానికి ఇంకా సన్నిహితమైపోయారు. ఇలాంటి విషయాల్లో మందలించాల్సినప్పుడు "మీకు లోకజ్ఞానం రావాలంటే, యిలాటివే అర్థంజేసుకోవాలి. అందుకే చెబుతున్నా" అనేది.

"సరే చెప్పారు, మీ బాధ్యత తీరిపోయింది. లోకజ్ఞానం పేరుతో, పావలాతో పేదవాళ్ళు పొందే సంతృప్తిని తుడిచెయ్యమంటారు. అంతేనా? ఇక అర్థమైంది. లోకజ్ఞానమంటే యిలాగే ప్రతీచోటా పావలాతో...." ఇంకా యేదో అనబోయేవాడు; అతని ధోరణినాపుజేసేది సుశీల.

"పావలాతో లోకజ్ఞానం కొనుక్కోమని, నాభావం; అంతేకాని, పావలా యెగ్గొట్టేసి, లోకజ్ఞానం వొదిలించుకోమన్లేదులెండి" నవ్వుతూనే అతన్ని సమాధానపరిచేది.

మొత్తంమీద ఉత్సాహంగా ఆటపాటలతో మొదటిసంవత్సరం గడిపేశారిద్దరూ. అనుదినం కాకుంటే వారానికోసారైనా అతని తెలివితక్కువ పన్లు దొరికిపోగానే అతన్ని మందలిస్తూ, అలాటివింకా సంభవించటానికి విచారించినా, అతడు తనమాట వింటున్నందుకు సంతోషించేది.

## ౧౦

అరుణ అవలంబిస్తున్న లోకజ్ఞానపు సూత్రాలు సూత్రప్రాయం గాకుండా, అనుభవైకం గావాలని అతడిన్ని వేసవి శెలవుల్లోకూడా యింటికి వెళ్ళనీయలేదు. సుశీల అలాఅని గురుకులాశ్రమ సిద్ధాంతరీత్యా లౌకికజ్ఞాన ట్రైనింగివ్వదలచలేదు. కాని మొత్తంమీద అలాంటి నిర్బంధంలో ఉంచాలని మాత్రమే!

ఉదయాన కాఫీతీసుకుని లైబ్రరీ కెళ్ళేవారు. చెగో కథా తీసుకుని బజారుకుపోయేవారు. అక్కడా వారపత్రికల్లాటివేవో కొని, కూరలతోసహా యిల్లు చేరుకునేవారు. వంటలక్క కూరల్లో నాగరికత పొందినట్లు వాళ్ళు స్వయంగా రికగ్నైజు చేశారు. అందుచేత పర్యవేక్షణ లేకుండానే ఆమెకు స్వాతంత్ర్యం ప్రసాదించారు. యిక ఆమెకి గుర్తుకొచ్చిన రంగుల్లోనో, రుచుల్లోనో, లేకుంటే రూపాంతరాల్లోనో వండిపడేస్తే, చేతికొచ్చినంతో కడుపు నొచ్చినంతో తినే బాధ్యత సుశీలకీ, ఆమె తండ్రి వెంకటాద్రిగారికీను. అరుణకు 'సైసలసాటి' వారి అహ్వానం 'తోసిరాజ' నేంత ధైర్యం లేకపోవటంతో, అతనికా బాధ్యత లేకపోయింది. ఐనా అప్పుడప్పుడు గ్రహచార

రీత్యా అలాంటిది సంక్రమిస్తూండేది. అదేదో పండగలాంటి దినం మాత్రమే!

శెలవులు గడిచాయి. మళ్ళీ స్కూల్లో ప్రవేశించారు. అప్పటినుండి వెంకటాద్రిగారిలో విశ్రాంతి మాయమైంది. ఒకటి రెండుసార్లెవరో పెద్దమనుష్యు లొచ్చి సుశీలని చూసివెళ్లారుకూడా. ఇక సుశీల వూరుకోలేకపోయింది. 'యీ ముసుగుల్లో గుద్దులాట తేల్చేద్దా' మనుకుంది.

"ఏవిటి నాన్నా, యేదో బురదలో దిగబడినట్టు బాధగా కనిపిస్తున్నావు. యీ వచ్చేపోయే పెద్దమనుష్యులెవరు?" తుందురుసుగా అడిగింది.

"సంబంధాల వాళ్ళమ్మా" ముక్తసరిగా అన్నాడు.

"అంటే పెళ్ళి సంబంధాలా?....నాకేనా?...."విషాదంగా అడిగింది.

"ఔను. నీకే మరి. ఈడొొచ్చిన పిల్లవు. కావలసిన వాళ్ళు నలుగురూ వొస్తారు; చూసుకుంటారు. నచ్చినవాడు ముందుకొస్తా డంతే" చప్పరించేశాడు.

"ఐతే, నాతో చెప్పకుండానే నీకు తోచినవాళ్ళని పిలిచి బేరం పెడుతున్నావా?. .ఇంతకంటే కటికాడికి చేస్తే కొంత సొమ్మైనా వొస్తుందిగా?" అంది అంతకన్న కఠినమైన పదజాలం భాషలో లేదన్నట్టు.

పైగా, ఎంతచదువుకున్నా స్త్రీ వివాహవిషయం, అందులోనూ యిలాంటి పరిస్థితిలో ఒక గండంలా తోస్తుంది. కేవలం ఆమెకు 'తన ప్రమేయంలేని వివాహ

ప్రయత్నం, తమకి పెద్దలు చెయ్యబోయే అన్యాయం' అని వారి ఆలోచన. ఈ మాత్రపు ఆలోచనకి స్త్రీ కబ్బిన సంస్కారంగాని, నేర్పిన విద్యగాని అక్కరకు రావు. అలాంటప్పుడు ఆ కొందరు 'తమ ప్రేరణలేని వివాహం' అంటూ నిరాకరిస్తారు కూడా!

ఈ విషయంలో సుశీలకూడా అంతే చేసిందని చెప్పాలి. "కటికవాళ్ళ కియ్యవలసినంత కర్మేం కాలింది?....ఎప్పుడైనా పెళ్ళి చెయ్యాల్సిందేగా! అదే యిప్పుడౌతోందనుకోరాదూ?" వెంకటాద్రిగారు చెప్పిన జవాబులో 'నీ నిశ్చయం పరిజేసుకోవల్సిందేకాని, నా నిశ్చయం మారద'ని అర్థమైంది. అలాటప్పుడు తనేనా ఊరుకొనేది?....ఐనా, కన్నతండ్రి. తన కాయన—ఆయనకి తనూ మిగిలారు. తన మంచి గాకపోతే యెందుకు తల పెట్టాడూ?

"పెళ్ళిప్రయత్నం యిప్పుడొద్దు నాన్నా. కనీసం బి. ఏ. అనిపించుకోనీ" ప్రాధేయ పడినట్లు అడిగింది.

"చూడు తల్లీ; మనకెంత ఆస్తివున్నా లోకాన్ని కొంతవరకూ దృష్టిలో పెట్టుకుని మరీ బతకాలి. అంతే కాని తోచినట్టు చేద్దామనుకుంటే, లోకం కాకి కూతలు కూస్తుంది. అందుకే, అదును దాటిపోకుండా పెళ్ళి తల పెట్టాను." అర్థంవౌతుందేమోనని చెప్పి జూశాడు.

"లోకం నామీదే దృష్టిపెట్టుకుందా? స్కూల్లో వున్న ఆడపిల్లలందర్నీ విడిచి నామీదే బండి దొర్లి

స్తోందా ?....అయినా, భయపడి తొందరపడ్డం దేనికీ ? బెదిరేవాళ్ళని బెదిరిస్తుంది లోకం !....తలొంచుకుని గడి పేస్తేసరి." అనుభవం లేకపోయినా, వున్నంత ధీమాగా మాట్లాడింది. వెంకటాద్రిగారికి కోపం వొచ్చింది కాని, ఆమె ధీమా చూస్తే ఆశ్చర్యం తోచింది.

"అయితే, ఆ గోడలమీద ప్రచారం యేంవిటీ ? అలాంటి వుండగా పెళ్ళవుతుందా ? తలెత్తుకోగలవాఁ ?" శక్తి వుడిగిన తర్వాత వృద్ధుడిలా మాట్లాడాడు.

"అందుకేగా, ఆ ప్రచార కర్తలందరికీ జుల్మానాలూ, సస్పెన్షన్లూను. ఒక్కసారి ప్రిన్సిపాలును కలిసి మాట్లాడి చూడకపోయావా ? అంతా తెలిసేది." ప్రధమ ఘట్టంలో వొచ్చిన ఘన విజయం తాకట్టుపెడుతోంది సుశీల.

"స్కూల్లో మాటా ? కాని, యిది లోకంతో పోటీ !.... పోనీ, అతణ్ని యీ యింట్లోనుంచీ వెళ్ళి పొమ్మంటే ?" 'అసలు రోగం యిది' అన్నట్టు తేల్చాడు.

"హాస్టల్లో జరిగిన అన్యాయంతో దెబ్బతిన్నాడు. యిక్కడ్నించి కూడా నేరం నేర్పాలేకుండా తరిమేస్తే అతనిబతుకే దెబ్బతింటుంది....నాన్నా ! పైవాళ్ళ మాదిరిగా నువ్వు మాట్లాడితే యెల్లా ?.... అతనిలో వినయం లేదా....లేకుంటే దురలవాట్లున్నాయా ? పోకిరీవాడా ! మనకేవైఁనా ద్రోహం తలపెట్టాడా ? ఎందుకు పొమ్మనాలీ ? కిరాయి దారును పొమ్మనాలంటే తగిన కారణం

చూపించి పొమ్మనాలి. వట్టినే కాళీ చేయించలేం." అతి సిమితంగా నచ్చజెప్పినట్టు చెప్పి, బెదిరింపుతో 'కోర్టుపక్షికి కూతుర'నిపించుకొంది.

"అంతవరకూ నువ్వే వత్తాసిస్తున్నావా ?... సరే అయితే ఒక్కమాట వినిపించుకో. అతనితో స్నేహం మానెయ్. ఓ నాటి కీనింద మాసిపోతుంది." కఠినంగానే అన్నాడు.

"అదెట్లా కుదురుతుందీ ? అతనికి స్నేహంగావుండి, సలహాలిస్తానని ప్రమాణం చేశాను. యిప్పుడా మాట తప్పి తిరగలేను; నా మాట వినకపోతేతప్ప !" ఖండితంగా తన వుద్దేశం చెప్పేసింది. అంచేత తండ్రి హృదయం గాయ పడినా తన కిష్టమే.ఒకసారి అరుణ కీ జవాబివ్వక పోటంతో తనమీదున్న నమ్మకం పోగొట్టుకుంది. యిప్పుడీ పరి స్థితుల్లో అతన్ని వొదిలేస్తే దిక్కులేక అల్లాడిపోతాడు. అందుకే మారు మాటకి తావులేకుండా చేసింది. "పోనీ అంతగా పెళ్ళే చేసుకుతీరాలంటావా ? అరుణ మాత్రం, పరాయి జాతివాడుకాదుగా ! ఆస్తిలేనివాడు కాదుగా! చదువు లేనివాడు కాదుగా. మాట వినిపించుకోనివాడా ? లోకజ్ఞానం ? అల్పవిషయాలన్నీ నేంజూసుకోగల్ను.... అతడ్నే పెళ్ళిచేసుకుంటే లోకమేంజేస్తుంది ?" ఉద్రేకంలో తండ్రి పంతానికి యెదురు నిలిచి మాట్లాడుతోంది, తన ప్రమాణం నిలబెట్టుకోవాలనే ఉబలాటంతో. "లోకం లోకం అంటూ, ఆదరాబాదరా పెళ్ళిచేసి, నా మెడకు బండ తగిలించకు నాన్నా....పైగా, ఎన్నటివరకూ అత

నితో స్నేహంచేసి లోకంకోసం పెళ్ళి చేసుకుందని వాడు కొస్తుంది. అప్పుడు మాత్రం ఊరుకుంటుందా లోకం ?... ఒక్కసారి లోకానికి భయపడితే, బతుకంతా భయంతోనే గడపాల్సొస్తుంది నాన్నా !" హితబోధ చేసింది, సుశీల. "ఇక అతన్ని దూరం చేసినా, అపవాదు బలపడుతుంది కాని, మాసిపోతుందా ?... ఇంత అనుభవం వుండికూడా నువ్వు లోకానికి బెదిరిపోయి బెంబేలు పడతావేం నాన్నా! అప్పటి ధైర్యమంతా యేమైంది ?... అమ్మ పోయినప్పుడు మనవాళ్ళంతా కొంపమీదకొచ్చి అల్లరిచేసిన రోజున ... లీలగా నాకు గుర్తొస్తున్నాయ్. అప్పుడు నువ్వు చంకనెత్తు కుని యేడుపు మానిపించిన ఘట్టం యింకా కళ్ళముందు కనిపిస్తోంది నాన్నా !"

ఇక విన్లేకపోయాడు వెంకటాద్రిగారు. "గుర్తుందిలే తల్లీ, అప్పటికీ యిప్పటికీ నీ బాగు కోరే యింత జేసు కున్నాను అందుకే ఆ తెలివితక్కువ్వాడితో పెళ్ళొద్దు, స్నేహం వొద్దంటున్నాను." హితవు చెప్పబోయాడు.

"ఐనా, తెలివితేటలున్నవాడే కావాలిని పట్టుబడితే, తెలివిహీనులు కేవలం దంపతులై వాళ్ళ కుటుంబాలు మాసిపోవాలని కోరడం కాదా నాన్నా ? అలాటి వాళ్ళని కొద్దిపాటి కనికరించకపోతే, లోకం తెలివైన వాళ్ళకోసమే పుట్టిందా !... అన్నిటికీ నేనున్నాగా, సంసారానికి లోటు రాకుండా చూసుకుంటాను. సరా ?" ఖండితంగా చెప్పే సింది సుశీల.



కూతురు యెదురు జవాబియ్యడం యీనాడే జరిగింది, వెంకటాద్రిగారి జీవితంలో. యింకో విషయమైతే అంతగా పట్టింపు లేకపోయేదేమోకాని, పెళ్ళివిషయంలో ఖండితంగా మాట్లాడడం వొకటీ; అందులోనూ తెలివి మాలినవాడ్ని పెళ్ళిచేసుకుని సంస్కర్త డిగ్రీ పొందాలని పట్టుబట్టడం వొకటీను; రెండువైపులా ఆయన్ని క్రుంగదీశాయి. అందుకే ఆయనేమీ జవాబు చెప్పలేదు.

అసలామె కాధైర్యం యెక్కడిదీ ? తానిచ్చిందేగా! ఆ స్వతంత్రం ?... తల్లిపోయిన పదోనాడు బంధువులంతా చేరి రెండోపెళ్ళి చేసుకోమని రకరకాలుగా బోధించారు. పైగా యీ పిల్లని మేం పెంచుతాంలే! అని హామీయివ్వబోయేరు. మా పిల్లని జేసుకోమంటూ ఒక జ్ఞాతి తన ఆస్థి మీద ప్లానేశాడు. అలా చేసుకునుంటే, ఈ పిల్ల నేటి కింతటిది కానేరదు ! పిల్లికూనలా తన కంఠం కావిలించుకుంది. యేడ్చింది. అందుకే జాలేసి రెండో పెళ్లి చేసుకోలేదు.

తన ఆస్థికి పోటీ పెట్టాడు ఆ జ్ఞాతే, పెళ్ళికి సిధపల్లేదని ! ఆ చిక్కు వొదిలించుకొని యిప్పుడిప్పుడే గట్టె

కార్డాడు. యింతాస్తినిచ్చి ఆమెను మహారాజ్ఞిని చేద్దామను కున్నాడు. తీరా నేటికి తెలివిహీనుడిన్న పెళ్ళాడతానం టూంది ! తనెందుకు శ్రమపడ్డట్టూ ? రెండో పెళ్ళి చేసు కుందామంటే యీనాడీ జవాబు రాకపొయ్యేదిగా ! తన సౌఖ్యం వొదులుకున్నాడు. బంధువుల్తో విరోధం తెచ్చు కున్నాడు. కూతురికి సలహాదారుడేనా కాలేక పోయాడు.

అసలీ చదువెందుకు చెప్పించాలి ?... అదంతా ఓ గాథ. కూతురి ఆలనా పాలనా చూడరు సరికదా, బంధు వులు ఆస్తికోసం యెగబడుతున్నారు. వాళ్ళ దారిలో ఈ సుశీల కంటకంవై పోయింది. అలాని పసిగట్టి తాను బస్తీకి మకాం మార్చాడు, తన కోర్టుపనులుకూడా ఖర్చులేకుండా పూర్తిచెయ్యొచ్చని. ఈ బస్తీలో ఆడపిల్లలచదువు అదో అందం అనిపించింది. ఆలోచించే అవసరం లేకపోయింది. యేంవంటే, హైస్కూలుచదువు తేలిగ్గా ప్రయివేటు లేకుండా పేసైపోయింది. ఇంతకాలం తన మాట కెదురులేదు కూతు రడిగిందల్లా ఆలోచించకుండా తెచ్చియిస్తూంటే బాగానే సాగిపోయింది. యీ కాలేజీ చదువే యింత జేసింది. యీనాడే తనకెదురుగా మాట్లాడింది. ఈ నాటివరకూ తెలివి మాలిన ధోరణి కనిపించలేదు. అవినీతి పనులేం చెయ్యనూ లేదు. నేడే తనాడిన ఆటకి తాళం వెయ్యమంది; యీ కాలేజీ చదువొచ్చాకే.

వెంకటాద్రిగారు యెంత లౌక్యుడైనా యింటి విష యంలో పప్పులో కాలు వేశాడనక తప్పదు. 'పోనీ పిల్ల

ఏడుస్తుంది. పైగా, స్నేహాలుకూడా లేవు' అనుకుని స్కూల్లో చేర్పించాడు. ఒకరి ప్రమేయం లేకుండా చదువుతోంది కదాని కాలేజీవరకూ పోనిచ్చాడు. యిప్పుడే యింతగా తనకెదురుతిరిగి మాట్లాడింది. చదువుకొన్న దృష్టితో మాటాడిందా లేక చనువూ స్వతంత్రం దృష్టితో మాటాడిందా, అనే మీమాంసలో పడ్డాడు; తానోడి నన్నోడెనా, నన్నోడి తానోడెనా, అని ద్రౌపది దుశ్శాసనుణ్ణి అడిగినట్టు. ఇంతకీ యింతకాలం పిల్లపెళ్ళి చెయ్యకపోటం పెద్ద నేరం అయిపోయింది.



కాలేజీటైమ్ గావటంచేత అరుణ ప్రెపేరై సుశీల కోసం వాళ్ళ గుమ్మాలవరకూ వెళ్ళాడో లేదో 'లోపలేదో గలభా జరుగుతోంద'ని వాళ్ళ ధోరణిబట్టి అర్థంచేసుకుని అక్కడే నిలిచిపోయాడు. నిలిచిన అయిదునిముషాల్లో తాను విన్న మాటల్నిబట్టి, తన వునికి వాళ్ళకి కంటకప్రాయంగా వున్నదనీ, తనెక్కడకైనా వెళ్ళిపోవడం మంచిదనీ అతనిలో తోచింది. వెంటనే తన గదిలోకెళ్ళి ముడుచుక్కూచున్నాడు. మళ్ళీ అదే సమస్య తయారైంది. యేం చెయ్యాలి? ఒకసారికి జైరామ్ సహాయపడ్డాడు. అన్నిసార్లు సపోర్టిస్తాడూ? ... పైగా, వెళ్ళినచోటల్లా ఒకోరకమైన

అసంతృప్తిని రెచ్చగొట్టుకుంటే, తనకి నిలవటానికిమాత్రం చోటెక్కడుంటుంది? ఆలోచన్లో మునిగిపోయి, కాలేజీకి వెళ్ళలేకపోయాడు.

తండ్రితో వాదం పెట్టుకుని ఆలస్యంగా తేరుకున్న సుశీల, భోజనంమాట మరిచి పుస్తకాలు తీసుకుని తొందరగా కాలేజీకి వెళ్లింది. అప్పటికే ఫస్టవర్ లేట్. క్లాసులో ఎంతగా వెదికినా, అరుణ కనిపించలేదు. 'తను పిలవలేదని అతడు రాలేదు కాబోలు' అనుకుంది. మనసులో పరిపరి విధాల ఆలోచన్లు రేగుతున్నాయి. 'నాన్న మాటలతను విన్నాడా' అనుకుంది. వింటే మాత్రం? పూర్తిగా వినుండవలిసింది, అని విసుక్కుంది. పిలవందే రాలేడా? పసివాడా? తన చదువుకి నేను పిలవాలా ? చిరాకు పడింది. 'పై చదువులు చదువుతున్నా, తనవిషయం తను చక్కబెట్టుకోలేనివాడేం చెయ్యగలడూ' సందిగ్ధంలో ప్రశ్నించుకుంది. ఏది ఏమైతేనేం, అతడు రాలేదు.

మధ్యాహ్నం లీజరులో కాఫీకి వెళ్ళింది సుశీల. యథాస్థానంలో కూర్చుంటూండగా, అక్కడే కూర్చున్న అరుణ కనిపించాడు. "యిక్కడున్నారేం ? క్లాసుకెందుకు రాలేదు ?" తెల్లబోతూ అడిగింది.

"మీరు పిలుస్తారనుకుని అలాగే స్టోరీ చదువుతూ ఉండిపోయాను. ఎంతసేపు చూసినా మీరు రాలేదు. టైము జూసుకుంటే పన్నెండైంది. ఇక మధ్యాహ్నం వెళ్ళొచ్చులే అనూరుకున్నానంతే."

"నే పిలిస్తేగాని రాకూడదని యేం వుందీ? మీ చదువుమీది! చిన్నప్పటినుంచీ నేనే పిల్చానా? పిలిస్తేనే స్కూలుకెళ్ళారా?" ఓరగ్గా అన్నట్టే అంది. కాని, అతని కోసం చిరాకు మళ్ళించుకుంది.

"అదికాదు. మీ పరిస్థితినిబట్టి, మీరు పిలవగలుగుతారు. మీరు పిలవలేకపోతే, యేదో మార్పొచ్చిందనే వూహించాలి. పైగా, అసలే గొడవల్లోపడి, గొడవలకెక్కాం మనం. ఒకే యింట్లో వుండటం, పెద్దాళ్ళకిక్కూడా వ్యతిరేకమై పోవడమేకాని, యింకేం కాదు. అందుకని, మీతో చెప్పి ఈపని చేద్దామని ఆలోచించాను. యింతకీ ఈనాడే కాదు. యింకా ఇల్లు చూసుకోవాలి."

"రోగి పాలేకోరితే, వైద్యుడూ పాలే సలహా ఇచ్చాడు, ఇక రోగానికేది మోక్షం? హఠాత్తుగా యీ ఆలోచనెందుకు కలిగిందీ?"

"మన కిష్టమైనవన్నీ మన పెద్దాళ్ళకి నచ్చొచ్చా? నప్పుకోవద్దూ? మీ నాయనగారితో మీరెందుకు వ్యతిరేకించటం? అందుకని?"

సుశీలకి అరుణ జవాబులు వినయంగా నయంగానే ములుకులుగా తోచాయి. యేం చేస్తుంది? 'విన్నాడు కాబోలు' ననుకుంది. "సరే, యిక దాచటం ఎందుకూ, అంతా విన్నారుగా! నా వుద్దేశం కూడా తెలుసుకునే వుంటారు. యిప్పుడిలా మాట్లాడ్డం, ధర్మంగా వుందా?"

దాదాపు యేడుపొచ్చిం దామెకు. అంతలో దిగమింగి నవ్వు తెచ్చుకుంటూ మాట్లాడింది- "ఇంతకీ యింకోసారి ప్రమాణం చేయించుకోవాలనా? .... అయితే చూడండి. మీ బాగోగులు చూడ్డంతో ఇరవైనాలుగ్గంటలూ సిద్ధంగా వుంటాను. దీనికి తిరుగులేదు. కష్టసుఖాలన్నిటికీ జవాబు దారు నౌతాను. సరేనా? యింకా పరీక్షించాలా!" నవ్వుతూ లేచి, "ఇక క్లాసుకు నడవండి, చిన్న పిల్లాడిలా పట్టింపులు మానెయ్యండి," అంటూ నడిచింది.

సుశీల తండ్రి కెదురుతిరిగి జవాబివ్వడం గాకుండా, అంతే చేస్తానంటోంది. అది అరుణ కేం నచ్చలేదు. ఐనా, పైకేం అనలేదు. విధిలేదన్నట్లు ఆమెతో నడిచాడు.

ప్రయత్నంమీద కట్టుకున్న సంస్కార సౌధం చిన్న గాలికీ పెద్దగాలికీ ఒకే విధంగా ఊగులాడిపోతోందని సుశీల బాధపడసాగింది. ఆమె ఆలోచనాముద్రతో, ముఖం వికా సంగా కనిపించటంలేదు. యింటిలో శత్రుత్వంతో కూడిన బంధుత్వం అనుభవిస్తోంది. తన అభీష్టానికి భిన్నాభిప్రాయం గల తండ్రి-అతడే తనకింత విజ్ఞాన మిచ్చాడు; అందు కెంతో కారణ భూతుడుకూడా! ఇక అరుణ యొక్క అజ్ఞా నం, తన గురుత్వానికి బాట. అలాటి గురుత్వం యీ విద్యార్థి దశలోనే వొస్తోంది. దాన్ని పోగొట్టుకుంటే సంస్కర్త డిగ్రీ పోతుంది. స్త్రీకి సహజంగా కావలసిన అధి కారం పోతుంది. అలాటి దాన్ని పోగొట్టుకోడం యిష్టం కాదు. అందుకే యీ శత్రుత్వానికి కారకుడయ్యాడు

అరుణ. శత్రుత్వానికి కారకుడైనవాడు మిత్రుడెలాగు కాడు. అందుచేత ఆమె కిద్దరూ శత్రువులే. యిద్దరు శత్రువుల తోనూ ఆత్మీయత కలిగివుండి బంధుత్వంలో జీవిస్తోంది సుశీల. అయితే, ఈ యిద్దరిలో తేడావుంది. బంధు శత్రువు ఒకడు, శత్రుబంధు వొకడూను.

## ౧౩

ఆనాడు కాలేజీనుంచి యింటికి చేరిన సుశీలను తండ్రి అడిగాడు. "సరే, నా వొప్పందంతో నిమిత్తమేముంది? కాని, ఒకసారి అతన్ని మాటాడించి చూస్తాను. అధమం మన గౌరవాన్నైనా నిలపగలిగే వాడైతే...."

"అల్లాగే; కానియ్యి. దానికి నా అడ్డేముందీ? నేను నా హద్దువరకూ మాట్లాడా నంతే. పెళ్ళిచేసుకోడం విష యంలో అతని ఉద్దేశం తెలిసి మాటాడ్డం కాదు. ఇక పరీక్ష చేస్తానంటావా, వొక పరిధిలో చేస్తే...."నమిలినట్టే మాటాడి, వాక్యంపూర్తి చెయ్యలేకపోయింది.

కొన్నిచోట్ల చెరువులు వేసవిలో యెండిపోతూం టాయి. అవి ప్రతి సంవత్సరం యెండిపోవు. అలా అని అన్నీ యెండిపోవు. కాని, యెండిపోయే స్వభావం ప్రాంతీ యంగా వాతావరణ సిద్ధమై వుంటుంది. అలాటి చెరువుల్లో కొన్ని చేపలు తెలివిగావుండి, జాలర్ల వలల్నించీ, కొంగల

జపాల్సించీ బైటపడి, ఆఖరున, అదే తెలివితో వాతావర ణంలోకూడా బైటపడిపోతాయి. అదే విచిత్రం! సరిగ్గా సుశీల ధోరణి అందుకేదారి తీస్తుం దేమోననిపిస్తోంది. ఆమె తండ్రికి జవాబు చెప్పింది. ఇంకా చెబుతూంది. అతనికి నచ్చి వుంటుందనుకుంది. నచ్చేలా చెప్పాననుకుంది. ఐనా, తనలో బెరుకుపోలేదు. ఇక అరుణను తనవైపు తిప్పుకున్నా ననుకుంది. ఐనా, తన కతని విషయంలో నమ్మకమైన అభి ప్రాయంలేదు. మెలాగో పట్టుబట్టి తన మాటనిలబెట్టుకోవా లని వుబలాటపడుతోంది యీామె ప్రయత్నం ఆ 'మత్స్య భంగయత్నం' కాకుంటే....!

కొద్దిరోజులు ప్రశాంతంగానే గడిచాయనోచ్చు. ప్రశాంతమంటే అందరి మనస్సుల్లోనూ స్థిమితముందని కాదు. పొయ్యిగడ్డల మధ్య నొక సుంటను వేసుకుని, తమకేమి న్నట్టు నిశ్చలంగా కనిపించినా, దేనికచే లోలోప జ్వలించి పోతూంటాయి. అలాగే అరుణ, సుశీల, ఆమె తండ్రీ ఎవ రికి వారు పైకి భేషజంగా వున్నా, లోలోన స్థిమితం జోరుగా ఖర్చు పెట్టేస్తున్నారు; యింతకీ ఒక్క విషయ మ్మాదే!

ఓనాడు వెంకటాద్రిగారు అరుణ గదిలో కొచ్చి, "ఓకలం తెచ్చిపెట్టగలవా, నాయనా; జేబులోకేమీాలేదు" అన్నారు. "ఇప్పుడే తెస్తానండీ" అంటూ బజారు కెళ్లాడు అరుణ. అతనికి యే రకం కలం కొనాలో తోచలేదు. 'సుశీలను సలహా అడిగివుంటే' అనుకున్నాడు. 'కాని, వ్యవధిలేందే' అని ఆలోచించాడు. 'ఫరవాలేదులే' అని,

ముప్పావలా పెట్టి వో కలం కొని తెచ్చాడు. యీ లోగా వెంకటాద్రిగారు తమ హాల్లోకెళ్ళిపోయారు.

తన ఆలోచల్ని తనే మెచ్చుకుంటూ తొందరగా ప్రవేశించాడు. అరుణ. వెంకటాద్రిగారి చేతి కియ్యగానే ఆయన ఆ కలాన్ని అటుతిప్పి ఇటుతిప్పి ముఖం చిట్లించారు. "యింత ఆస్థి వుండి, ఒక్క కలానికి వెలపెట్టలేమా? యెందుకీ కలం?....మన కోసమేనా?" వెఱ్ఱెత్తినట్టు వొణుకుతూ అన్నాడు. నౌకరైతే కొట్టేవాడే! దిగమింగలేని కోపంతో అటూ యిటూ తచ్చాడాడు.

ఇందుకు అరుణ తొణక్కుండా జవాబిచ్చాడు. "జేబులోకే అన్నారుగా?....ఖరీదు పెట్టలేమా అంటారేమిటీ?....అందాకా నా కలం తీసుకోండి అది యిటిచ్చి. యింకో కలం తెచ్చి తీసుకుంటా లెండి." అని, తన కలాన్నాయన చేకతిచ్చి, ఆయన చేతిలో కలాన్ని దాదాపు లాక్కొచ్చేశాడు. ఇంతవరకూ సుశీలకేమీ తెలీదు.'ఎవరో అరుస్తున్నాడు' అనుకుంటూ వొచ్చింది. వెంకటాద్రిగారు ఆమెవైపు చురచుర చూశాడు. కాని, సుశీల ఆయన చేతిలో కలాన్ని ఆశ్చర్యంగా చూసింది. "యీ కలం అరుణది కదూ? నీకెలా యిచ్చాడు?.... చూశావా,మాష్టారికీ లేదు; నాకూలేదు, నీ కిచ్చాడు!" ఆశ్చర్యంతో అడిగింది. "యిచ్చాడులే, యింత రభసచేసి. యెవరికే స్థానమివ్వాలో తెలియనివాడికి నెత్తిమీద స్థానమిస్తానంటావు" ఉద్రేకంలో రెచ్చిపోతున్నాడు. "యేం జరిగిందేమిటి?" అడిగింది. "ఓ కలం తెమ్మన్నాను. అణాకానీ కలం తెచ్చి

నీ కిది చాల్లే అన్నట్టు పడేశాడు. యిదేం కల మన్నాను. అది లాక్కుని యివిచ్చి పోరాడు... యివి తెలివి తేటలు. యెవర్నెలా గౌరవించాలో తెలిస్తేగా!" అన్నాడు, కూతురు మీద పంతంగా.

నెమ్మదిగా సుశీల అక్కడ్నుంచి. అరుణ గదికెళ్ళిందో లేదో అరుణ ఆమెకు యెదురొచ్చి సంజాయిషీ చెప్తున్నట్టు మాట్లాడాడు. "చూడు, సుశీలా! నువ్వు లేవు కాని ఓ పెద్ద సంకటం వొచ్చి పడిందనుకో. 'జేబులో కేం లేదు. కలం తే' మన్నారు మీ నాన్నగారు. జేబులోకి మాత్రం పనికొచ్చే కలం కొనుక్కొచ్చాను. యింతాస్తితో వో కలం కొన్లేమూ అన్నారు. 'కావాలంటే యి తీసుకోండ' ని, నా కలమిచ్చాను....నువ్వే చెప్పు. కలం కోసం ఆస్తి అంచనా వేస్తావా ? పావలా డబ్బులు పాకీవాడి కివ్వాలంటే అది పాకీవాడి అంతస్తు లెక్కకదా ? కలాన్నివ్వాలంటే, కలాని కంతస్థా, లేక జేబు కంతస్థా? దేన్ని లెక్కచూడాలో తోచడం లేదు....యింతకీ ఈ కలం తక్కువదైనా, బాగా రాస్తోంది. నువ్వు రాసి చూడు." ఆమెకి కలాన్నిచ్చాడు. అతనిలో భావాల్ని దాచుకునే అలవాటు లేకపోటాన తనలో ఉన్న విషయాలన్నీ బైటికి దొర్లించాడు. సుశీలకేమీ అర్థం కాలేదు. ఆ కలంతో రాసి బాగుందనుకుంది. కాని, అరుణ ధోరణికి ప్రేకుపడ లేదు.

"ఈ కలాన్ని వాడాక వో చక్కటి విషయం తోస్తూంది. తనకున్న విషయాలనీ, ఆదాయాలనీ రక్షించి, తన కో విశిష్టత నిచ్చేందుకు రాజు వో స్త్రీని పెళ్ళి చేసు

కుంటాడు. బీదవాడు కూడా అందుకే పెళ్ళాడతాడు. స్త్రీని సద్వినియోగం చేసుకోలేనపుడు, రాజెలా నష్టపడతాడో పేదకూడా అలాగే నష్టపడతాడు. యింతకీ ఆ స్త్రీ యెవ తైనా, ఎలాంటిదైనా, స్త్రీ మాత్రమే!....అంతే ఈ కలాల విషయం కూడా. గంటంలా వుపయోగించుకోవాలంటే?.... అవి కలాలన్న విచక్షణ నశిస్తే, వాటి ఖరీదెంతైనా సరే. యింతకీ రాజు పెళ్ళికి, లక్షలక లక్షలు ఖర్చౌతాయి. పేద వాడి పెళ్ళి దమ్మిడితో పూర్తౌతుంది. ఒక్క ఖర్చు తప్పిస్తే, తేడా ఏముంది?"విషయాన్ని పూర్తిగా తరిచి తెలుసుకున్నట్టు పెద్ద లెక్చరిచ్చాడు.

ఇన్ని మాటలు చెప్పినా, ఆనాలోచితంగా తన కలాన్ని తండ్రి కెయ్యడం ఆమెకి నచ్చింది. ఒక స్త్రీని, కలంతో పోల్చి చెప్పడం నచ్చలేదు. అతనిలో రెండు స్థాయి లుగా ఒకదానికొకటి వ్యతిరేకంగా, తెలివితేటలున్నట్టు అర్థం చేసుకుంది. 'యెలావుంది' అన్న ప్రశ్నకి క్లుప్తంగా జవా బిచ్చింది 'బావుంద'ని.

ఆమెకు బాగున్నది కలమో, లేక యెవ్వరికీ యివ్వని తన కలాన్నియ్యటమో! అదీ కాకుంటే కలం వాడకం విషయంలో తనిచ్చిన ఉదాహరణో. యేదైతేనేం, బాగుం దందిగా; అంతే తన క్కావలిసిందికూడా. ఎంత బాగున్నా తన మూలంగా యింట్లో కల్లోలం బయల్దేరింది అంచేత నెల్లాగైనా ఆ ప్రదేశం విడిచిపెట్టాలి. లేకుంటే, సుశీల జీవి తం నాశన మౌతుంది...పోనీ యింకో రూములో వుంటే అది మరీ బాధ. ఆమె రాకమానదు. వొస్తే కాలేజీకో సహా

పట్నంకూడా గోల ప్రారంభిస్తుంది. ఆమెలో యే మంచి తనాన్నీ పరిగణించదుగా, లోకం! కాబట్టి తనుకూడా మద్రాసెళ్ళి అక్కతోపాటు చదువుకుంటే?.... కాని, ఈ యేడెలాగో పూర్తిచేసి పోతే, బియ్యేలో చేరచ్చును. ఈలోగా ఈ అవాంతరాలు గడిచేదెల్లా?.... పరిపరి విధాల ఆలోచనల్లో మగ్గిపోతున్నాడు, అరుణ.

ప్రపంచంలో యెవ్వరికీ యివ్వని కలాన్ని అతను తన తండ్రి కిచ్చాడు. ఐనా, అతన్ని అపార్థం చేసుకున్నాడు. తనోసారి కల మడిగితే, యిప్పుడేవస్తానని పోయి, పదినిమిషాల్లో కొత్తకలం తెచ్చిచ్చాడు. దాని వెల యెంతలేదన్నా ముప్పైరూపాయి లుంటుంది. అలా రక్షించుకుంటూవచ్చిన కలాన్ని తన తండ్రి కిచ్చాడు. అందులో ఆలోచించనైనా లేదు. దాన్నిబట్టి తనకెంత గౌరవాన్నిచ్చాడోకూడా గ్రహించలేకపోతున్నాడు. అలాటప్పుడు తండ్రి నెదిరిస్తే మాత్రమేం? తన భావి జీవితం, తన బాగోగులు తన కర్మైనంతగా ఆయన కే మర్థమౌతాయి?... అందుకు ఆతండ్రి మాట యెక్కడేనా పాటించవచ్చునుకాని, పెళ్ళి విషయంలో మాత్రం.... ఊహల్లో, అలల్లో సుశీల తండ్రిమీద హింతవుపోగొట్టుకుంది.

తన పరీక్షలో తప్పటడుగేసిన అరుణ తనకి అల్లుడుగా నచ్చటంలేదు. అందుకు ముభావంగా పూరుకున్నాడు గాని, యెవర్నీ యేమీ అనలేదు. అంటే, తన మాట నెగ్గదు. సుశీల వాదిస్తుంది. చేదుమాత్ర మింగినట్టు అనుభవించవలిసిందే అనుకున్నాడు. తన ముభావంమీద ఎవ్వరూ

వ్యాఖ్యానం చెయ్యకపోయినా, యెవరికి వారే వూసుకోని మాట్లాడ్డం మానేశారు. యీ రీతిగా తమలో తాము ఏకాంతంగా గడుపుతున్నారు. సుశీల అరుణని పలకరిస్తుంది. కాని, నిమిత్తంగా జవాబిస్తాడతను. వెంకటాద్రిని పలకరించడాని కిద్దరికీ ధైర్యంలేదు. పైగా, సుశీలకు వ్యతిరేకి కావటాన,ఆమె సాధ్యమైనంతవరకూ తప్పించుకుంటోంది. అరుణ స్వభావంచేత తనకి తానై యెవర్నీ పలకరించడు. ఈ ముగ్గురిలోనూ ఏకాంత వాంఛ, మౌనవ్రతదీక్ష విధిలేక ఆవహించాయి.

## ౧౪

మొత్తంమీద కాలేజీ చదువులు సరిగ్గానే జరుగుతున్నాయి. దాదాపు సంవత్సరం పూర్తయింది. ఇక పరీక్షల రోజు లొస్తున్నాయి. అంతలో అరుణా సుశీలల పెళ్ళి ఏర్పాట్లు జరుగుతున్నాయి. 'కళ్యాణం వొచ్చినా, కక్కొచ్చినా' అన్నట్టు పరీక్షల అభ్యంతరం లేకుండానే పెళ్ళి జరిగింది. విద్యార్థుల ఆశీర్వాదఫలం కాబోలు, అంత తొందరగా జరిగిపోయింది. తానా విధంగా, తెగించి, మొగబడి పెళ్ళి చేసుకున్నందుకు గాను, తనకేమీ పొగడ్త, మెచ్చికోలూ రాలేదు. ఆ విషయంలో తానెంతో ఆశను పొంది

వుండి ఏమీ పోందలేక తెల్లబోయింది సుశీల. ఇంతకీ ఆ పెళ్ళి ఒక విచిత్రమైన విధంగా జరిగిపోయింది. అసలది పెళ్ళిఅనిపించుకోని విధంగా జరిగిందనాలి.

అసలే జాతులపోరుతో పెనుగులాడుతున్న వెంకటాద్రిగారు, చుట్టాల నెవ్వరినీ ఆహ్వానించలేదు. తనకున్న పరిచయస్థుల్ని, కొద్దిమంది అధికారుల్నీ పిలిచారంతే. ఇక మగపెళ్లివారి తరఫున వెంకటప్పయ్యగారుకూడా అదే దారిన నడిచారు. అసలే తెలివితక్కువ్వాడి పెళ్ళి, అందులో కన్నుకుట్టే పెళ్ళిని బంధువులంతా చేరి చెడగొడతారుకాని, సంతోషించరు. ఇక అరుణ అక్కగారు మద్రాసులో చదువుతోంది. పరీక్షల సందడికాబట్టి ఆమె రాలేకపోయింది. రెండు వైపులా అత్తగార్లు ఆదిలోనే స్వర్గస్థానం అలంకరించారు. అందుచేత ఆయనకూడా తనకి తెలిసిన కొంతమంది ఆఫీసర్లని మాత్రమే పిలుచుకున్నాడు. ఇక యిచ్చిపుచ్చుకోడాలు యెవ్వరికీ తోచలేదు. అందుకే వేళాకోళాలుకూడా లేకపోయాయి.

వేడుకలూ, ముచ్చట్లూ, పెళ్ళి గందరగోళం లేకపోయినా, యే ఆటంకమూ లేకుండా నిర్విఘ్నంగానే వారి పెళ్ళి జరిగిపోయింది. పెళ్ళి జరిగిందని సంతోషించిన వాళ్ళే లేరు. ముఖ్యంగా తెలివిమాలినవాడ్ని పెళ్ళిచేసుకుందని వెంకటాద్రిగారు కొంత పెడముఖంగాఉండి, అలా ఉండటానికి మనస్కరించక యాత్రలపేరు చెప్పి దేశాంతరం వెళ్ళిపోయారు. యింత వ్యవహారం అయ్యిండి తెలివి

లేని తన కుమారుడ్ని అల్లుడుగా చేసుకోడంలో యేదో కీలకం వుండొచ్చుననుకున్నారు వెంకటప్పయ్యగారు. పైగా తన క్లాసులో వుంటూ అతన్ని ఎరుగుండికూడా ఈ పెళ్ళికి సుశీల యెందుకు వొప్పుకుందో అనే అనుమానంతో, ఆయన కూడా తప్పించుకు తిరుగుతున్నాడు. పెట్టుకున్న పాతలాగ, కొనుక్కున్న తద్దినం మాదిరిగా యీ పెళ్ళి జరిగిందేకాని, తన కెటువంటి ఘనతా సంప్రాప్తించలేదని దిగులుపడింది సుశీల. పైగా, యీ పెళ్ళితో తండ్రి దేశాంతరం వెళ్ళడం గాకుండా, తండ్రిలాటి మామగారుకూడా యేమీ పట్టించుకోవడం లేదని విచారించింది. యిక అరుణకూడా మార్పు చెందాడనే చెప్పాలి. ఇదివరలో తానొక్కడు, యిప్పుడు తనకో స్నేహితురాలు తనకి రూమ్‌మేటు అయింది! అని సంతోషించాడు. ఇదివరకుమాదిరి హోటలు భోజనం అవసరంలేదని తెలుసుకున్నాడు. యీ రకంగా మనోపరివర్తనాన్ని తెచ్చిపెట్టింది వారి పెళ్ళి.

ఇప్పుడిక సుశీల తన పరిస్థితిని గురించి ఆలోచించుకోటంలోనే కాలయాపనం చేస్తూంది; కాని చదువుమీద ధ్యానం వుండడంలేదు. అరుణకి యే ఆలోచనాలేదు. నిరాటంకంగా చదువు సాగిస్తున్నాడు. పరీక్షలయ్యాయి. ఫలితాలుకూడా తెలిశాయి. అరుణ పేసైయాడు. సుశీల ఫేలయింది. ఆమె కా విషయంకూడా పట్టలేదు. అరుణ కే విషయమూ పట్టలేదు. తను చదువుకోడమే తెలుసు వెంకటప్పయ్యగారికీ వీళ్ళ విషయాలేవీ పట్టలేదు, నెలవారి

రెండొందల రూపాయలు పంపడం తప్ప. పెళ్ళయింది లగాయతు అంతవరకూ వెంకటప్పయ్యగారు యిక్కడికి రావటంగాని, అరుణ యింటికి వెళ్ళటంగాని జరగలేదు.

•

## ౧౨

కాలేజీలు తెరిచారు. సుశీల చదువు సంగతి తల పెట్టలేదు. అరుణా తలపెట్టేవాడు కాదేమో! కాని, స్కూలు జీతాలకనీ పుస్తకాలకనీ, గుడ్డలకనీ మూడొందలు ప్రత్యేకంగా మనియార్డరు రావడంతో అతనికి గుర్తుకొచ్చింది. "రేపో, యెల్లుండో జీతాలు కట్టాలి" అన్నాడు సుశీలతో. "కట్టొచ్చును" అని ఊరుకుంది సుశీల. సరే తనే జ్ఞాపకం చేస్తుందికదా అన్నట్టు ఊరుకున్నాడు అరుణ. ఆమె కా తలంపే లేకపోతే! యిక అరుణకు సంవత్సరం చదువు లేకుండాపోయింది. కాళీగా కూర్చోలేకపోయాడు.

అరుణకో చక్కని ఉపాయం తోచింది. 'పాడు కథలు చదివేకంటే, ప్రైవేటుగా సూ టెక్నికల్ పరీక్షకేనా చదవటం మంచిది' అని. అంతే వెంటనే కొన్ని పత్రికల్ని ప్రకటల్ని ఆలోచించుకుని, 'కామర్స్‌కు సంబంధించిన చదువులు యింటిదగ్గరే కూర్చుని చదవొచ్చు' ననే నిశ్చయాని కొచ్చాడు. అంతే. లైబ్రరీలో దొరికినన్ని పుస్తకాలతో

ముందుకు పోనిచ్చాడు చదువును. కొన్ని పుస్తకాలు మాత్రం కొన్నాడు.

యిదే విషయం సుశీలతోకూడా ప్రస్తావించాడు. "సుశీలా, స్కూల్లో యెలాగూ చేరలేదు. పోనీ ప్రైవేటుగా నేనా కొన్ని టెక్నికల్ పరీక్షలకి చదువుతాను....ఊం." నసికినట్టే అడిగేశాడు. ఆదినుంచీ ఆమె తన మంచికోరింది గనక యీనాడు అడగాలిసొచ్చింది. లేకుంటే అడిగేవాడు కాదు.

సుశీల చదువుల విషయాన్ని అసలు వొదిలేసింది. అందుకూ్కడా సరైన జవాబివ్వలేదు. అసలా ప్రశ్నకి తను సిద్ధంగాలేదు. అందుకే పరాగ్గా మాటాడింది. "చదివితే చదవండి, నా అడ్డేముందీ" అని. ఈ జవాబు అరుణకి సంతృప్తిగా లేదు. ఐనా, తను చదువు మానుకోదలచ లేదు. మొదటగా లండన్ ఛాంబర్ ఆఫ్ కామర్స్(L.C.C.) అనే పరీక్షకు దరఖాస్తు పంపేశాడు. డబ్బుకూడా చెల్లించాడు. డిశంబరులో పరీక్షలుకూడా రాశాడు.

ఇన్ని జరుగుతున్నా సుశీల అంతగా పట్టించుకోడం లేదు. 'తనది కాద' న్నట్టే రోజులు గడిపేస్తోంది. తన చదువుమీాద ఆమెకంత నిర్లక్ష్యమేమిటో అతనికేం పాలు పోలేదు. అట్లాని, ఆమే పుస్తకంలేకపోతే ఒక్క క్షణం బతకదు. ఎంతసేపూ, వారపత్రికలూ, మాసపత్రికలూ వాటిలో వుండే కథలూ, నవల్సూ తప్ప యింకేం అక్క ర్లేదు. అరుణా కథలు చదివేవాడుకాని, అతని చదువులో

వొక ప్రత్యేకతేమంటే; ఆ కథ ఆ విధంగా రూపొందించగల శక్తి యెలాంటిదో అనిపించడం; దానిమీాద రచయిత యొక్క గుణగణాలు, అలవాట్లు, వయస్సు, అతనిచుట్టూ వున్న ప్రకృతి సంపద, అతని స్నేహాలు, అతని భావాలకి మూలమైన ఉత్సాహం, అతని విద్యావిశేషాలు మొదలైన వాటినే ఆలోచించేవాడు. అందుకే యీ చదువులో ప్రవేశించాడు. అందుకో చిన్న తార్కాణంకూడా వుంది.

కథలుగాని, వ్యాసాలుగాని రాయాలంటే, ప్రశ్న పంచకం పూర్తిగా విశదంగా రూపొందాలి. యీ ప్రశ్న పంచకమే అన్నిటికీ మూలం. గీన్నే థామస్ హెన్రీ 'ఫైవ్ డబ్ల్యూస్' (What, Where, Why, When, Who) అని ఉదహరించాడు. ఒక క్రియను తీసుకుని, పరిస్థితుల సమ్మేళనాన్ని యీ ప్రశ్నలకు సరైన జవాబుల్లో అల్లుకుంటే అదే ఓ కథౌతుంది. యిక విషయనిర్ణయం న్యాయవంతమైతే ఆ కథకి మంచి విలువ అబ్బుతుంది. ఐతే విషయనిర్ణయాన్ని చెయ్యడంలో, సమంజసం వుండాలంటే విషయ పరిజ్ఞానం కావాలి. చాలా విషయాల్ని ఊహించడంకోసం, అనేక విషయాలతో ముడిపడ్డ పుస్తకాలో చదువులోకావాలి. అట్లా విషయపరిజ్ఞానం యివ్వగలిగినది 'వస్తుగుణ ప్రకాశిక'. యీ పుస్తకం వైద్యాని కుద్దేశించబడింది. ఇంకోటి, 'శబ్దరత్నాకరం'. యీ గ్రంథం కేవలం భాషాపోషకుడై, వ్యాకరణవాంఛగలవాళ్ళకేగాని, అందరికీ ఉపయోగపడదు. అంచేత, ఈ రెండు మార్గాలూ అరుణకి ఉచితమైనవి కావు. యిక యిం[illegible]కూ తను చదివినదాన్ని

పురస్కరించి, ముందుకెళ్ళే చదువులో మిళితమైయుండగల గ్రంథంకావాలి. కాబట్టి విషయ పరిజ్ఞానం కాస్టు అండ్ వర్క్సు అకౌంటెన్సీ లోనే అనువుగా లభ్యమౌతుంది. దానికి సంబంధించిన పరీక్షల్లో మొదటిది 'అసోసియేట్ ఆఫ్ ఇనిస్టిట్యూట్' దీన్నే ఏ. ఐ. సి డబ్ల్యూ. ఏ. అంటారు. దీనిలో ఆఖరు పరీక్ష 'ఫెలోషిప్' ఎఫ్. ఐ. సి డబ్ల్యూ. ఏ. అంటారు. అసలీ పరీక్షని ఇంటర్మీడియెట్, ఫైనల్ అనే పేర్లతో పూర్తిచెయ్యాలి. ఒక్కొక్క సంకేతాన్ని రెండేసి భాగాలుగా చదివి పరీక్ష పూర్తిచెయ్యొచ్చు. అంత తేలికైన చదువు కాదుగనక! ఈ స్థాయిని చేరాలంటే, కామర్సులో విజ్ఞానమివ్వగల పరీక్షలు కొన్నిటిని నాందిగా, పునాదిగా దాటుకు రావాలి. అందుకే L.C.C. తో ప్రారంభించాడు. తదుపరి ఎ. సి. ఐ., ఎ. ఎస్. ఎ. ఎ., అనేవి రెండు పరీక్షలు గడిచాక, ఐ. సి డబ్ల్యూ. ఎ. కి రావాలి. ఈ చదువు లన్నిటిలోనూ, వ్యాపార వాణిజ్యాల లావాదేవీలు, న్యాయ సూత్రాలూ, చట్టాలూ మాత్రమే గాక, ఆర్థిక శాస్త్రం, దాని రూపకల్పనా, నిరూపణా మొదలైన విషయాలుండి తీరతాయి. ఆర్థిక జ్ఞానమే వస్తువిషయ పరిజ్ఞానమనిపించుకుంటుంది. ఇంత ఆలోచించి, ఈ చదువుల్లో ప్రవేశించాడు అరుణ.

ఇక సుశీల చదివే పుస్తకాల్లో కథావస్తువుకంటే, కథలో సంఘటనల్ని పరిగణించడం అతి. అందుకే ఆమెకి సంఘటనలమీదున్నంత మమకారం, విషయాన్ని సేకరించి రూపొందించగలి రచనాశక్తి మీద లేకపోవటం

చేత ఆమె చదువుయొక్క దృక్పథమే మరొక విధంగా వుంటుంది.

౧౭

ఓనాడు టేబులుమీద నున్న పుస్తకాల్లో వో పుస్తకాన్ని తీసి చూసింది సుశీల. ఏంలేదు! అరుణ ఏదో ప్రైవేటుగా టెక్నికలు పరీక్షకి చదువుతున్నాడుకదా, యేం చదువుతున్నాడో అని. ఆ తీసిన పుస్తకంమీదున్న హెడ్డింగు చదివింది, 'ఎకనామిక్స్ ప్రిన్సిపల్స్' అని. ఆర్థిక సూత్రాలు కదా అనుకుని క్రమంగా చదవటం ప్రారంభించింది. వెళ్ళగా వెళ్ళగా అన్నీగ్రాఫులూ, డయాగ్రమ్సు కనిపించాయి. ఈ లెక్కలేమిటో అనుకుంది. ఏవో ఉత్పత్తి రేఖలు గిరాకిరేఖలు వాటిగుండా ధరల హెచ్చుతగ్గుల శాసతు గీతలు అన్నీ కలగాపులగం అయిపోయినట్టు తోచాయి. "పైగా సంకులసమరంయొక్క సీను వర్ణించినట్టు ఈ చదువేమిటో" అని సాగదీసుకుంది. "ఆర్థిక సూత్రాలో, నాయనమ్మ శ్రాద్ధాలో" అని విసుక్కుంది కూడా. ఆమె కంతే తోచింది. అంతే అర్థమైంది; ఏంజేస్తుంది? అర్థమవడంలో వున్న పరిస్థితి యిది.

ఒక అవ్వ వుంది. ఆ యింట్లో పొరుగూరి యువకుడొక్కడే కాపరంవున్నాడు. అవ్వకెవరూ లేరు.

ఓ నాడు అన్నం తింటూండగా, నెయ్యి లేనని తోచిందామెకి. ఆ నేతితోనే, ఆమె భర్త చేసివ ఇతర అలవాట్లన్నీ గుర్తుకొచ్చాయి. అవన్నీ యిప్పుడు రావు. కాని అవి జ్ఞాపకం వొస్తా యంతే! ఏంజేస్తుందీ ఏడవక?....ఆ ఏడుపు విని, ఈ యువకు డడుగుతాడు ఎందు కేడుస్తున్నావని.' ఏం జెప్తుతుంది? పదేళ్ళ క్రితం చచ్చిన మొగుడుకోసం ఈ వాళ ఏడుస్తున్నానంటుందా?.... పోనీ, అప్పటిసంగతులూ, అతడిచ్చిన ఆదరణా జ్ఞాపకం వొచ్చా యంటుందా? అస లలాటివి చెప్పగలదా?.... తప్పించుకోటానికేదో చెప్పాలికనక, "కంట్లో ఏదో పడింది మంటపుడితే ఏడుపొచ్చింది నాయనా" అంటుంది. 'ఆమె అన్నం తినేప్పుడు తలొంచుకుంటే, కంట్లో ఏదో యెలా పడుతుంది! అనే అనుమానం తోచక్కర్లేకుండానే అయ్యో పాపం అనిపించేస్తుంది అతనికి, ఆ పరిస్థితియొక్క సంభావ్యం తెలియనట్టే. ఆ యువ్వ నిజం చెప్పినా ఆమెలోవున్న బాధ అర్థంగాదు. ఆమె ఏం చెప్పినా, యెలాటి పరిభాషలో చెప్పినా అతనికి దాని ఆంతర్యంకాని, యదార్థంగాని తోచదు. అంతే, ఆ పుస్తకంలో సుశీలకి తెలిసిందికూడా. ఓ కథాకాదు, వ్యాసమూ కాదు; ఏం పుస్తకమిది? అసలే అంతమాత్రపు తెలివి! దానికితోడు రోకలి తలకిచుట్టుకోమనే చదువొకటా! అని తెగవిసుక్కుంది. యిలా విసుక్కోడానికికూడా, చక్కని కారణం వుంది. అరుణ యొక్క తెలివిని బలపరిచేందుకు తారాక్కణంకూడా!

వోనాడు కాఫీలో చక్కెర యెక్కువైంది. ఆ కాఫీని సుశీల తాగలేకపోయింది. ఇంకొంచెం పాలూ, డికేషనూ కలుపుకుంది. కాని, అరుణ మరికొంచెం చక్కెర నోట్లో వేసుకుని ఆ తరువాత కాఫీ తాగేశాడు. ఆ నిమిషాన అరుణ నిజంగా 'అడివి మృగం'లా తోచాడు. "చదవేస్తే కాకరకాయ పోయి కీకరకాయైందిట!....అవేంషన్లూ? అసలే తీపెక్కువైతే యింకా తీపి నోట్లో వేసుకుంటారు? ఏకంగా పానకమో పాయసమో చేసుకు తాగితే తీరిపోతుందిగా; ఇంత డికేష నెందుకు దండగ?" గట్టిగానే చీదరించుకుంది. దానిమీా దోవుపన్యాసంకూడా యిచ్చాడు అరుణ ఆమెకి తెలిసొస్తుందేమోనని.

"చక్కెర ఉత్పత్తి సులభమైపోతే, ధరతగ్గిపోతుంది. అప్పుడు చౌగ్గావున్న వస్తువుని వాడకంలో లక్ష్యపెట్టరు ప్రజలు. అందుకే కాఫీలో చక్కెర యెక్కువౌతుందనుకో! కాని, ఉప్పు చౌకైనా దాన్ని యెక్కువగా వాడి ఆ కూర లెవరూ తినలేరు. అందుకే దాన్ని జాగ్రత్తగా వాడతారు. ఇక చక్కెర విషయం చూద్దాం. చౌకైపోతే దాన్ని బహు రీతులుగా వినియోగించుకోమంటుంది ఆర్థికశాస్త్రం. బహు రీతులుగా వినియోగమయాక మిగిలితే విదేశాలకి యెగుమతి చెయ్యొచ్చునంటూ అదే అర్థశాస్త్రంలో ఒక అనుబంధ సూత్రం. ఇప్పుడు మన వాడకంలో తీపి యెక్కువైంది. ఆ తియ్యదనాన్ని మళ్ళీ తియ్యదనంతోనే ఖండించు

అనే ప్రబోధంకూడా సామాన్యమైనదే! 'ఉష్ణం ఉష్ణేన శీతలం' అనే సూత్రంమీద నడిస్తే సరిపోతుంది.

"మూకవుమ్మడిగా మాట్లాడి, మాటల్లోనే ఫలితాన్ని అంచనా వెయ్యకూడదు సుశీలా! అసలే తీపి యెక్కువైంది అంటావు. దాన్ని అణచాలని నీ ఉద్దేశం. కాని, తీపిని అణచాలన్నంత వైషమ్యం తీపిలోయెక్కుడా వుండదు. మాటవరసకి మనమే హోటల్లో స్వీటు తిన్నాం. తరువాత కాఫీతాగేలోగా, యేదో ఒక కారపువుస్తువ తింటాం. ఎందుకని? .... ఆలోచించు — తీపి తినగా నోరు తీపెక్కింది. దానిమూలంగా కాఫీలో కావలసిన తీపి కనిపించదు. అందుకే నోరు చప్పబడే సాధనం వేస్తాం. ఇంతకీ కాఫీలో తీపి కనిపించదనేగా! అలా కనిపించకపోటానికి కారణం ముందాగానే నోరు తియ్యనైపోడం. అదే యిప్పుడూ చెయ్యమంటున్నాను. కాఫీలో వున్న తీపిని నోటికున్న తీపితో పోటీపెడితే సరిపోతుంది.

"తేలు కుట్టిందంటే మలయాళీ మంత్రగాడు యేం చేస్తాడో తెలుసా? ఊచిపుచ్చుకు లెంపమీద కొడతాడు. తేలుకాటు కంటె చెంపపెట్టు బలమైపోతుంది. ఒక గీతని చెరిపకుండా చిన్నదిచేసినట్టు తేలుకాటు బాధ తక్కువగా వున్నట్టు కనిపిస్తుంది అది ఆ రకమైన మలయాళీ మంత్రం; యిది ఈ రకమైన తంత్రం.

"ఇంకో విషయం. మామూలుగా మంచినీళ్ళు తాగితే చల్లగానే వుంటాయి. ఐస్ వాటర్ తాగి, అప్పటి

కప్పుడు మొదట తాగిన చన్నీళ్ళు తాగితే, ఈ చన్నీళ్ళు వేడిగా వుంటాయి. దీనికి కారణం? మన నోటి కప్పిన వాతావరణ పరిణామం! తినే వస్తువు లన్నిటికీ రుచుల్ని కల్పించేది ఒక్క నాలుక మాత్రమే. ఆ నాలుకనే రుచితో భ్రమపెట్టి, మరిపిస్తే, యిక తీపే కాదు, యేదీ యెక్కువ కానేరదు.

"చక్కెరే యెందుకు వాడాలి? పాలూ, డికాషనూ యెందుక్కలుపుకో కూడదూ? అంటావేమో! ఎక్కువగా వాడ్డం, నిర్లక్ష్యంగా వాడ్డం పోకటేనని చెప్పానుగా. ఇప్పుడు నీ ఒక్క తెక్కే తీపి యెక్కువైంది. చేతిలో వీలుందిగనుక వెంటనే పాలూ, డికాషనూ కలుపుకున్నావు. చక్కెర నిజంగా నిర్లక్ష్యంగా వాడే చోట్ల? ఇదే నిర్లక్ష్యం దేశంలో అందరికీ వచ్చిందనుకో. అప్పుడు? తాత్కాలికంగా నిల వున్న కాఫీపొడను ఖర్చవుతుంది. ఐనా, సంవత్సరాంతానికి కొరత అవుతుంది. ఇక, దేశమందరికీ కావలసిన పాలు, అందులోనూ వేళగాని వేళ యెక్కడిన్నుంచి వస్తాయి?— అలాటి ఆవు లున్నాయా, యే దేశంలోనైనా? .... 'విషయాన్ని బహుళంగా ఆలోచించు, సూక్ష్మంగా పరిష్కరించు' అంటుంది అర్థశాస్త్రం!"

ఇంతగా లెక్చరు దంచినా సుశీలకి ఏమీ తెలీలేదు, పైగా, విసుగూ కోపమూ ఒక్కసారి వొచ్చి ఉక్కిరి బిక్కిరి చేశాయి. యేమైతేనేం? ఆమెకీ సూత్రం నచ్చలేదు, ఈ మాట లర్థం కాలేదు. దానిమీద అతని శైలిని వెగటునిపించింది.

అందుకే ఆమె మనస్సు చివుక్కుమన్నది "ఇలాటి పుస్తకాలు చదివితేనే అలాటి తెలివొచ్చేది! ఇంతకీ చేతులు కాలాయి...ప్రయోజన మేమిటి?" ఆర్థిక సూత్రాల పుస్తకం చూస్తూ మనసు కలతపడేలా ఆలోచించింది సుశీల. అరుణ తనమాట వింటున్నాడన్న సుగుణంతప్ప తను అతడ్ని బాగుచేసిందేమీ లేదు. ఏం చేస్తే బాగుపడతాడో ఆమెకి తోచడంలేదు. "అతడ్నేమైనా చెయ్యాలి గాని ఊరికే వొదిలెయ్యకూడదు. .... లేకుంటే, రోజూ నాతో కూడా మార్కెట్టుకి తీసుకువెళ్ళి వస్తువుల నాణ్యం చూడమనీ, బేరమాడమనీ పురమాయిస్తే!—కొన్నాళ్ళకైనా మారతాడేమో" చివరి కిలాటి నిర్ణయంలో కొచ్చింది. సుశీల, "అదే మంచిదారి దారిలోకి రావాలంటే" అని.

# ౧౭

రోజూ అరుణా, సుశీలా మార్కెట్టు కెడతారు. కూరగాయ లేరమంటుంది. పుచ్చులో ముదిరిపోయినవో లేకుంటే వాడిలిపోయినవో యేరతాడు, అరుణ. "అబ్బే, అవి కాదు" అంటుంది సుశీల. "ఇదిగో, చూడండీ, యిలా వుండాలి కూరలంటే. ఇది చూడండి, నేనేరినవి చూసి నేనెల్లా యేరుతున్నానో అల్లా యేరండి" అంటుంది.

"నువ్వు నేరిన వాటిని చూస్తే, నువ్వెలా నేర్చావో తెలుస్తుందా?— రోగం కబురు తెచ్చిననాడిన్నీ పరీక్ష చేస్తే రోగిని పరీక్ష చేసినట్టేనా? " యెగతాళి చేసేవాడు. ఐనా సరైన కూరలేవో, ఏవి పనికిరావో అరుణకేమీ బోధపడ్డం లేదు.

ఇంత జరిగినా, అరుణ కూరగాయల చదువు తప్ప లేదు; ఇష్టం లేకపోయినా బలవంతంగానే శ్రైవింగాతు న్నాడు. అతని శ్రైవింగు ఓ విధంగా చూస్తే సరైనదే కావచ్చు! నాటు వైద్యుడి దగ్గర వైద్యం నేర్చుకుంటోన్న విద్యార్థి, గురువు పరీక్ష చేసిన ప్రతి నాడీ తనుకూడా పరీక్ష చేస్తాడు. ఆ శిష్యుడి బాటలోనే అరుణకూడా తన కూరగా యల చదువు పోనిస్తున్నాడు. సుశీల మంచివంటూ ఏరిన ప్రతీ కాయా కసరూ, ఆకూ అలమూ తను తీసి అటు తిప్పీ యిటు తిప్పీ, రంగుచూసి, చేతికెంత బరువగావుందో బరు వుగా వుందో చూసి, అవసరమనుకుంటే వాసనకూడాచూసి సంచిలో పడేస్తాడు. అయితే యిదంతా యాంత్రిక చర్యే గాని ఉద్దేశపూర్వకంగా కాదు. బజార్లల్లో ముష్టాడి చేతిలో టాడుతున్న కోతిమాదిరిగా ఈ చర్యనంతా చేస్తున్నాడు, అరుణ. ఏమంటే; ఆమె చెయ్యమంది, తను చేస్తున్నాడు అంతే! తన దృష్టి పుస్తకాలమీదే వుంటుంది.

మొదటిసారిగా యల్ సి సి పరీక్షలు రాయడానికి బొంబాయి వెళ్ళాడు. పదిరోజుల్లో పరీక్షలై తిరిగొచ్చాడు. 'ఎలా రాశావని' అడగలేదు సుశీల; తను చెప్పనూలేదు.

అరుణకి ఏం ధైర్యమో, యింకో పరీక్షకోసం పుస్తకాలు కూడా తెచ్చుకున్నాడు.

తన చదువుగురించి ఆమె కేమీ ఉత్సాహం లేనందుకు తను దిగులుపడ్డం లేదు. "ఉత్సాహం లేనివాళ్ళతో చదువు విషయం ముచ్చటించకూడద"ని భావించాడేమో, యింకో పరీక్షకు చదువుతోన్నట్టు కూడా చెప్పలేదు. ఏ. సి. ఐ. పరీక్ష లింక మూడు నెల్లున్నాయనగా, యల్. సి సి. ఫలితాలు తెలిశాయి. మొదటి తరగతితో పేసయ్యాడు తను. తన సంతోషం యెవరికి తెలపాలి? ఎకనామిక్సులో ఫస్టుమార్కొచ్చింది. దానిమీద యిద్దరు ప్రొఫెసర్లు అతనికి సేకట్లు పంపించారు కూడా. అయితే యేం? తను యెక్కువగా సంతోషించడానికి ప్రస్తుతం వీల్లేదు. ఈ ఉత్సాహానికే గాని, సంతోషానికి మనసులో చోటు లేకుండా చేసుకున్నాడు.

౧౭

ఆనాడు యింట్లో దాసీదానికి యితర పన్లేవో తగిలాయి... సుశీల ప్రసవించిన యిరవయ్యో రోజు. బాలెంత కావటాన సుశీల బైట తిరగటం లేదు. విధిలేక బజారుకు

అరుణనే పంపించింది, కూరగాయలు యేరి జాగ్రత్తగా తెమ్మని.

అరుణ మార్కెట్టులో ప్రవేశించి అటూ యిటూ తచ్చాడుతున్నాడు, యెక్కడినుంచి కొనటం మొదలు పెట్టాలో తెలియక. ముందుగా వంకాయలరాసి కనిపించింది. యింకేం? వెళ్ళి అడిగాడు, "తులమెంత" అని. దుకాణం వాడు అరుణ నెగాదిగా జూసి నసుగుతూ చెప్పేశాడు– "యెంత సదువుకుంటేమాత్తరం, యింత అనుభవంవున్నోణ్ణి బోల్తా యేయిత్తారా అయ్యా! ఇదేం బంగారమా, అంత దర సెబుతున్నామా? అలా అడుగుతారేం మారాజా? ఈసిలడగండి, సేర్లడగండి. తులాలడిగి యెటకారంసేత్తారా దొరా" దండకం చదివినట్టు నచ్చజెప్పాడు.

"ఏద్దైతే నేం? అదికూడా తూనికేగదా అని.... పోనీలే వీశ ధరే చెప్పు. యేంపోయిందీ?"

"ఈశ నాలు గణాలు దొరా. యేరుకోండి బాగు న్నాయి, సవగ్గూడా. యెంతో లేదు సరుకు." దుకాణంవాడి జవాబు విని తను తప్పుగా అడిగినట్టూహించుకున్నాడు అరుణ. ఆ కంగారులో నాణ్యంచూసే పద్ధతి మరిచిపోయి, "ఎలా యేరుకోవాలీ" అనుకుంటూ సుశీల చెప్పినపాఠాల్ని జ్ఞాపకంచేసుకోబోయాడు. "సూత్తారేం సామీ, ఏరుకోండి" అని అదిలించడంతో అరుణ కేమీ గుర్తురాలేదు. తొందరగా యేరేశాడు 'పచ్చగా నిగనిగలాడేవి దొరకటంలే' దనుకున్నాడు. తెల్లగావుంటూ పచ్చిరంగుపోతూ, పసుపు

రంగు కనిపిస్తున్న కాయలు మంచివేమో అనిపించాయి. యేరి తూపించాడు.

అక్కడ్నుంచి ఆనపకాయల దగ్గరి కెళ్ళాడు. "ఏశెం తోయ్" అనేసరికి అంగడివాడో గండకం చదివాడు. "ఆనప కాయ పీసిల్లెక్కని కొనే రోజొత్తే సూద్దామయ్యా! ఇప్పుడు మట్టుకి ఒకోటి బేడ జేసి తీసుకోండి; పడుసు కుర్రోళ్ళకంటె గెట్టిగున్నాయ్, నవ్ నవ్లాడిపోతా." వర్ణించినంత గట్టిగానూ ఉన్నాయో లేదో ముట్టుకుచూశాడు. గట్టిగానే ఉన్నాయ్. పై నెక్కడా బూడిదలేదు. నున్నగా మిలమిలా మెరుస్తున్నాయ్. 'బాగున్నాయ్ చవగ్గా' అనుకుంటూ ఓ కాయ తీసుకున్నాడు.

ఆపక్కనే కందదుంప లున్నాయ్, ఆనపకాయలంత పెద్దవే! "ఒకోక్కదుంప యెంతకిస్తావ్?" అడిగాడు తెలివిగా.

"ఇయి లాటుబేరంలోయి గావు దొరా. యీసి పావలా, తీసుకోండి." నవ్వుతూ జవాబిచ్చాడు కాబట్టి ఒకోక్కటి యిస్తాడేమో అనుకున్నాడు అరుణ. కాని వాడి ధోరణి యెటకారంగా మారింది. "సరే, మంచిచూచ్చి ఓ పీసియ్యి" అని తూకంలోనే తీసుకున్నాడు.

అవతలవైపు అరిటికాయలు కనిపించాయి. "ఏశెంత" అనడిగాడు. "ఈసేందయ్యో, సదువుకున్నావ్ గామాలున్న- కొనేదుంటే డజనడుగు, తీస్కెల్లు" అని చీదరించుకున్నాడు. వాడి జవాబువిని పట్టరానికోపం ముంచుకొస్తే నిలవలేక, 'ఒద్దులే' అంటూ దొండకాయలపోగు దగ్గిరి కెళ్ళాడు.

"డజనెంతయ్యా?"

ఈ ప్రశ్న వినగానే ఆశ్చర్యంగా తలెత్తి చూశాడు, అంగడివాడు.

"అలాకాక్కడ్డారా, యీశల్లెక్కని తూసుకెల్లండి" అన్నాడు.

"అంతా తల తిరుగుడుగా వుందే! ఈ బజారంతా నన్ను తలకిందులుచేస్తోంది.....ఊఁ ఇయ్యి ఓ వీసెయ్యి" అన్నాడు అరుణ.

తరువాత పొట్లకాయలు కనిపించాయి. అక్కడికెళ్ళి, "గజమెంత" అన్నాడు. "ఒక్కోటి అణాగా" అని జవాబిచ్చాడు అంగడివాడు. "కొన్ని చిన్నవీ, కొన్ని పెద్దవీ కదా" అని సందేహించాడు అరుణ. "సేతి కైదేళ్ళు, పెద్దేటి; సిన్నేటి దారా, అన్నీ ఒకిటే." సమర్థించి అనుమానం పోగొట్టేడు వాడు. "బాగున్నాయా?" యింకో అనుమానం అడ్డమేశాడు అరుణ. "పసురకం బాబూ, యింతదూరం బండ్లోవచ్చినా, వాడిపోలేదంటే" గ్యారంటీగా మాట్లాడాడు దుకాణదారు. ఎలాగో తోచినట్టివి యేరుకుని వెడుతూండగా తోటకూర కనిపించింది. దాన్ని బేరమాడాలనిపించిం దతనికి. "దీన్ని వీశల్లెక్కని తూస్తారా, శేర్లతో కొలుస్తారా" అన్నాడు. ఆ కూరలమ్మికి ముక్కుమీద కోపంగాబోలు, "ఆకుల్లెక్కెట్టిత్తారయ్యా, ఏమాత్తరం తీసికెల్తావో, లెక్కెట్టుకో" అంది. దాని విసురుచూసి భయపడ్డాడు తను. ఐనా "తోటకూర బేర మంతే" అనిపించింది. ఇంకేం మాట్లాడక యింటికొచ్చాడు.

# ౧౯

అరుణ రాకకోసం గుమ్మంలో యెదురుచూస్తూ నిల్చుంది సుశీల. "వొచ్చారా! యింత సేపేం జేస్తున్నారూ, నాలుక్కూరగలు కొండానికి?" సాగదీసుకుంది.

తనకి మార్కెట్టులో వొచ్చిన అనుభవమంతా చెప్పాడు అరుణ, నవ్వుకుంది సుశీల. తెచ్చిన కూరల్ని చూసి ఏడుపుముఖం పెట్టింది. "ఒక్కటీ వొండుకోడానికి పనికిరాదు. యెందుకీ కూరలూ" అని తనిచ్చిన ట్రైనింగు వృథా అయింది కదా అని ఏడ్చింది. ఆమె ఏడుస్తోంటే తనలో వున్న అనుమానాలన్నీ ఒక్కసారి అపుజేసుకున్నాడు.

"ఏమండీ, యెన్నిసార్లు నేయేరిన కూరలు చూపించలేదూ? యిన్నాళ్ళూ నా వెంట బజారుకి తిరిగారు. ఒక్క విషయమూ అర్థంకాలేదా!" జాలిగా అడిగింది. పైగా అర్థంకాలేదా అంది కూడా. అందుకే యిప్పుడర్థం

గాకుండా వున్న కొన్ని విషయాల్ని అడిగేశాడు. "ఐతే యిదివిను సుశీలా! అరటికాయలు తుయ్యరట: దొండకాయలూ కాకరకాయలూ తూస్తారట. అదేం పద్ధతి? సైగా, ఆనపకాయలు ఒక్కొక్కటి యిస్తాడు, కందదుంపలు తూస్తాడు; తక్కెట్లో కందేగాని, ఆనప (సొర) కాయి పట్టదనా? యింకోటి; పొట్లకాయలుకూడా లెక్కనట. ములక్కాడలూ అంతేనట, గజాల్లెక్క లేదట! అదేం బజారు సుశీలా? నువ్వు పంపేవని, ఓర్చుకుంటూ తిరిగాను, లేకుంటే వాళ్ళ తెలివి జోలికి నే వెడతానా ? అన్నట్టు ఆకు కూరలన్నీ ఆకుల్లెక్కెడతారట! అలా యెంతని అమ్మగల్రూ?" వింతగా చెప్పేసరికి సుశీలకి నవ్వొచ్చింది. ఆ ఏమువులోనే "ఆకూర్లు పోగులెట్టి, పోగణానో, అర్ధణానో చెప్పి అమ్ముతారు. ఆకుల్లెక్కెట్టరు" అంది నవ్వుతూనే. "అద్సీ, నువ్వు కూడా బజారువాళ్ళ అనాగరికంలోకే పోతున్నావు! ఇంత చదువుకుని ప్రయోజన మేమిటీ?" ఉడుకుబోతు తనంగా అన్నాడు. "బాగుంది, ఈసారి మీరు బజారుకెళితే, మీరు కూరలు కొంటానికి బదులు మిమ్మల్నే కూరలు కొనేస్తాయ్" అంది వేళాకోళంగా. "అంత యెటకారంగా తోచినా పరవాలేదు. కాని నేనడిగినట్టు ఆ వేషాలకి సరైన కారణం చెప్పచూద్దాం. కొన్నెందుకుతూచాలి? అదే జాతిలో కొన్నెందుకు తూచకూడదూ? ....మరికొన్నింటిని, తూనికాగాకుండా, లెక్కగాకుండా యే ఆధారంతో అమ్మాలి ? ఓ పిచ్చి బాటలో మనుషులు నడిస్తే, దుకాణదార్లు తెలి

వున్న పిచ్చివాళ్ళవుతారు.'' తన ఆఖరి రిమార్కిచ్చేశాడు. సుశీల అతని రిమార్కును కాదన్లేక పోయింది. ఆ విషయం తనకీ తెలుసు, అందరికీ తెలుసు. ఐనా, వింతగానే వుంది. బజారు వ్యవహారంలో యిన్నిరకాల వంకర నడక లున్నాయని యిప్పుడే అనుకుంది. యిన్నిటినీ అరుణ యేకరూ పెట్టాక, "యీ తేడా యెందుకో" అని తనూ జవాబు వెతికింది. యిన్ని తేడాల్నీ యెరుగుండీ, యెరగనట్టుగానో లేక, వాటి కారణాలెరిగున్నట్లో తనో బజారు వ్యవహర్త గా మొగుడుదగ్గర చెలామణీ అవుతూంది. యీనాడిన్ని లోట్లూ వెతికి అడిగేసరికి తనేమీ జవాబివ్వలేకపోయింది. అరుణే ఆమె ఆలోచనల్ని మళ్ళించేశాడు. "సర్లే, ఇప్పుడు వాటి నాలోచించి ప్రయోజనం లేదు. అధికారయుక్తంగా మార్పు అమల్లోకి రావాలి. యే దశాంశ పద్ధతో వాళ్ళ నెత్తికి రుద్దితే, 'తిలాపాపం వో పిడికెడూ' అన్నట్టు మన్నెత్తికూడా కాస్త కాస్త అంటుతుంది. అప్పుడందరి కళ్ళూ తెరుచుకుంటాయి.'' సమర్థిస్తూ తన అంత్యోపన్యాసం కూడా కానిచ్చాడు అరుణ.

విషయం యెంత విచిత్రంగా వుందో, అంతకంటే మించి అతని మార్కెట్ ఎక్స్‌పీరియన్సు వింతగా తోచిందామెకి. ఐనా, తన తెలివికీ లోపాలు తోచనేలేదు. పైగా యిన్నిటిలో వాటికి సవరణ మార్గంకూడా సూచనచేస్తున్నాడతనూ! యింతకీ తననొక తెలివితక్కువ వ్యక్తిగా లెక్కగడుతున్నాడని తోస్తూనేవుంది. ఆ భావం తోచేట్టు

ప్రజలందర్నీ అజ్ఞానులనో, పిచ్చివాళ్ళనో గమనిస్తాడు. అదే విచిత్రం! నేటినుండి తనని 'తోసిరాజం'టాడేమో అనికూడా భయపడింది.

•

## ౨౦

అరుణ కూతురు లక్ష్మి, అచ్చంగా అతని తల్లిపోలికలో పుట్టింది. మూడోనెలొచ్చింది. అమాయికంగా ఆ పసి బిడ్డ నవ్వుతుంటే అరుణకీ లోకమే తెలిసేదికాదు. కొంతసేపటికి తన చదువూ, పరీక్షలూ జ్ఞాపకం వొచ్చేవి. యేవంటే; చేతిలో పుస్తకం వుండగా బిడ్డతో నవ్వులాట ప్రారంభించేవాడు. కొంతసేపటికి అతి వుత్సాహంలో ఆ బిడ్డనెత్తుకోవాలని చెయ్యిజాపితే, పుస్తకమడ్డొచ్చేది. అప్పుడు వొళ్ళు తెలిసి చదువు గుర్తొచ్చేది. "యెత్తుకోడం తెలియకుండానే పైకి లేపనిస్తే, చెయ్యో కాలో వూడొస్తుందిగాని, యింకేంవుందీ" అనుకుని అప్పుడా ప్రయత్నమాన్ని, చదువులో మునిగిపోయేవాడు.

ఈసారి యే.సి.ఐ పరీక్షకెళ్ళి పదిహేను రోజుల తరువాత తిరిగొచ్చాడు అరుణ. వొస్తూ వొస్తూ ఆ తలనొప్పి పుస్తకాలు ఓ బీరువాడు తెచ్చాడు. తేవడమేనా ? ముందుగా తన గదిని పిచ్చాసుపత్రిలాగ యేర్పాటుచేశాడు.

అరుణ చర్యలు చూస్తూంటే, సుశీలకి ఎంతో యేవగింపు ముంచుకొచ్చి, చలిజ్వరమొచ్చినంత పనయ్యేది. ఐనా, ఏమీ అనలేకపోయేది. మూడుసంవత్సరాల వైవాహిక జీవితం సైతం, సుశీలను గృహిణిగా మార్చటానికి బదులు, గురువుగానే ప్రోత్సహిస్తూంటే యిక ఆమెలోవున్న చదువెంతటిదైతేమాత్ర మేం ప్రయోజనం? యింతగా అభిప్రాయ భేదాలున్నా, అరుణ పై అనురాగం లేకపోలేదు. అతడుతననింకా గురువుగా యెంచకపోడం తనకి బాధగా తోచింది.

లక్ష్మి అల్లారుముద్దుగా అరుణకంటికి మెరపుతీగలా మెదుల్తూ, వన్నెలూ చిన్నెలూ మారుస్తూ పెరుగుతూంది. నెమ్మదిగా అరుణ ఏ. యస్. ఏ. ఏ పరీక్షలకు సిద్ధపడుతున్నాడు. ఈ పరీక్షలతో తన విజ్ఞానాని కొక రీతి ఏర్పడుతుంది. తనకెంత విలువుందో తెలిసొస్తుంది. తన స్థానం తానేర్పాటు చేసుకోవాలి. అప్పుడు తనకెవరు గురువో, ఉద్ధరించినవాళ్ళెవరో, యేంజేసి తన్నింతవాడ్ని చేశారో, తన వాళ్ళనిపించుకొనే వాళ్ళందరికీ తెలుస్తుంది. అదే తన లక్ష్యంకూడా!

అరుణచేసే ప్రతీక్షణ సుశీల వెర్రితనానికి రాచబాటో అన్నట్టు ఆ యెదురుచూసిన పరీక్షలొచ్చాయి. బొంబాయి వెళ్ళి నెలరోజులకి తిరిగొచ్చాడు. యిప్పుడు కూడా కొన్ని పుస్తకాలు దొర్లించుకొచ్చాడు అరుణ యెప్పుడు కొత్తపుస్తకాలు తెచ్చినా, వోసారి వాటన్నిటినీ

పరీక్షగా చూడ్డం సుశీల కలవాటు. ఏంలేదు, "తనకేమేనా వున్నాయేమో" అని.

లక్ష్మికి అప్పటికి రెండో ఏడు. మాట్లాడ్డం అలవాటు చేసుకుంటోంది. లక్ష్మితో మాట్లాడుతూన్న సందర్భంలో అరుణ హఠాత్తుగా సుశీలతో అన్నాడు, తను ఉద్యోగం చెయ్యదలిచినట్టు. "చెయ్యొచ్చు, దానికేం తొందరొచ్చిందని!.... యెప్పుడో చెయ్యొచ్చులెండి, ఉద్యోగమేగా!" పూర్తిచెయ్యకుండానే, సగంలో తన అభిప్రాయాన్ని నిలిపేసింది. యింతకీ తన కిష్టంలేదని చెప్పడానికి యింత డొంక తిరుగుడు రస్తావేసింది సుశీల. అయినా అరుణ, తనఉద్యమం మానుకోడం బాగాలేదనుకున్నాడు. పైగా కావాలన్నప్పుడు నౌకరీలు దొరకవ్! తన అదృష్టంకొద్దీ, ఐ.యల్.టి.డి.లో ఎక్కౌంటెంట్ పదవి కాళీ అయిందని ప్రకటనొచ్చింది. తనలాటి క్వాలిఫికేషన్లున్నవాడు ప్రస్తుతం దొరకడం కష్టం. ఈ విషయంలో సుశీల వొప్పుదలేమిటీ? తన గౌరవం చూడగలిగినంతసేపే, తనుండ గలిగేది! లేనప్పుడు తనెందుకు కట్టుబడి వుంటాడు ? తన్నొ వో మనిషిగా చూడాలి వ్యక్తిత్వం కలిగేలా చూడాలి! అలాటిది పోయి తనకి తనే ప్రజల్లో పడతానంటే కూడా అడ్డుచెప్పడం, తన శ్రేయస్సుకోరడమేనా ? యేమైనాసరే, తను దరఖాస్తు పంపాల్సిందే!

ఒక వారం తర్వాత అరుణకు ఇంటర్వ్యూ వచ్చింది. దాన్లో సెలక్టయ్యాడు కూడా. యిప్పుడతడు ఐ.యల్.టి.

డి. అకౌంటెంటు. రెండొందలు తెచ్చుకోగల సమర్థుడు. తనలాగే యింటర్మీడియటు చదివినవాళ్ళెందరో అరవై రూపాయలేనా సంపాదించుకోలేని స్థితిలో వున్నారు. బస్సు కండక్టర్లు కొందరు, కోమటి గుమాస్తాలు కొందరైతే; కంట్రాక్టరు గుమాస్తాలు కొందరు; యెలక్షన్ ప్రోపగేటర్లు కొందరూను; పోతే ఫిలింరిప్రజంటేటీవ్‌లు, థియేటర్ బుకింగుక్లర్కులుగా వెలిసినవాళ్ళనేకులూ! ఈ స్థితిలో తనకలాటి నౌకరీ దొరకడం అదృష్టంకాదూ? అలాటి తన స్థితిని జూసి, సంతోషించడం, వుత్సాహపరచడం పోయి, మరీ చిన్నకుర్రాడ్ని మందలించినట్టు నిరుత్సాహపడే మాటల్లో జవాబుచెప్పడం సుశీల పొందిన విద్యా సంస్కారాలకి మెరుగుకాదు.

## ౨౧

ఆనాటినుండీ అరుణయొక్క కార్యక్రమం మారిపోయింది. ఉదయంలేచి దంతధావనాదికాలు పూర్తిచేసుకునేసరికి ఆరున్నరౌతుంది. ఏడున్నరకి ఆఫీసుకు వెళ్ళాలి. అందులోనూ తొలిసారిగా నౌకరీ చెయ్యడం. తనపైన ఇంకా యిద్దరధికార్లు హాజరుగా వుండటం మొదలైన పరిస్థితుల్లో వెంగలాడే యిల్లువిడిచి పోక తప్పటంలేదు. యేం

చేస్తాడు? తనింట్లో కాఫీవేళకి సరిగ్గా ఆఫీసులో తనసీటులో తను కనిపించకపోతే అధికారికి వాంగ్మూలం యిచ్చుకోవల్సొస్తుంది. కాఫీ యింట్లో గాకపోతే హోటల్లో తాగినా చెల్లుతుంది. తన నౌకరీ, తన హోదా యెలాగో నిలుపుకోవాలి. అందుకే, కాఫీకేనా యెదురుచూడకుండా ఉదయాన్నే వెళ్ళిపోయి పన్నెండున్నర కొచ్చేవాడు. తొందరగా భోంచేసి, సాయంత్రం ఐదున్నరకొచ్చి ఉస్సురంటూ కుర్చీకి అతుక్కుపోయేవాడు. అప్పటికి మిగిలుంటే సుశీల స్నేహితురాళ్ళెవరూ ఆతిథ్యం స్వీకరించకపోతే ఫ్లాస్కులో వున్న కాఫీ తనకి దక్కేది. తర్వాత కాసేపు లక్ష్మితో మాట్లాడేవాడు. అంతే, ఆపైని యెప్పుడు భోజనమై యెప్పుడు నిద్రపోయేవాడో యెవరికీ తెలీదు. తనూ తన పుస్తకాలూ కలిసి రాత్రి పన్నెండింటివరకూ జాగారం చేసినిద్రపోయేవారు. ఈవిధంగా సుమారు మూడు వారాలు గడిచాయి. అంతవరకూ అరుణలో వొచ్చిన మార్పుని పరిశీలిస్తూన్నా, సుశీలయేమీ అన్లేదు. ఐనా, తన ఆలోచనకి, అతనలా బైట సంచరించేందుకు కారణం తోచలేదు. అందుకే ఉండబట్టలేక వోనాడు నిల్దీసి అడిగేసింది కూడా.

"ఏవో కొంప లంటుకున్నట్టు ఉదయం కాఫీమానేసి పోతున్నారు; పైగా భోజనానికి వొచ్చినట్లేవొచ్చి, నడుం వాల్చకుండా హోటల్లో చెయ్యికడుక్కున్నట్టు పరుగెడుతున్నారు; బొత్తిగా యిల్లు పట్టడంమానేశారు. ఎక్కడికెళుతున్నారు? ఏం పనుందని, [illegible] కంమానిరి తోక ప్రశ్నలతో [illegible] సుశీల.

అరుణకి జవాబు యిరుకైపోయింది. నౌకరీకి సుశీల యెంత మాత్రం సుముఖంగా లేదు. అందుకా విషయం మరుగు చెయ్యాలి; చెయ్యాలంటే అబద్ధం చెప్పాలి; అది తనకలవాట్లేదు; నిజం చెప్పడానికి వీల్లేదు. ఆమెకిష్టంలేని పనిచేస్తున్నట్టు తెలిస్తే, అమితంగా ఉద్రేకపడుతుందేమో! ఏం చెయ్యాలి? సందిగ్ధంలో నలుగుతూండగా సుశీల రెట్టించింది. "ఏమాలోచిస్తున్నారూ ? ఏం చెప్పాలనా.... నిజం చెప్పనా మాననా - అనా ? ఏవైనా పేకాటల్లాటి వాటికి అలవాటుపడుతున్నారా కొంపదీసి" కంగారు ఆప లేక అడిగేసింది. అరుణ నిజంగా అలాటి అలవాట్లకి పాలు పడినా, తాను నమ్మదు. ఐనా, తన ఉద్వేగంలో మాటలు జారింది; నిలదొక్కుకుంది.

ఆమె మాటలప్రభావం కాబోలు, అరుణ ఠక్కున అబద్ధం కల్పించి జవాబిచ్చేశాడు. "ఆఁ ... ఏం లేదు... యింట్లో యెంతసేపు గడుస్తుందీ? బైట కాస్త స్నేహితుల్తో గడిపేస్తున్నానంతే ! పేకాట్లూ జూదాలూ నేరుస్తానా సుశీలా?" అబద్ధమాడుతూనే విషాదంగా అడిగాడు అరుణ. కాని అతని ముఖంలో నిజం చెబుతోన్న ధీమా లేదు. కళా హీనంగా, పేలవంగా వుంది.

అతని ముఖ భంగిమలు చూస్తున్న సుశీల అనుమానించి యెదురుప్రశ్నగా వెక్కిరించింది. "మన్నిరానిచ్చి, మాట్లాడే స్నేహితులా? అంత భాగ్యం కూడానా ? హుఁ రాత!" విదిలిస్తూ తిరస్కార భావంతో అరుణయొక్క అంతస్థునే కూల్చేసింది.

సుశీల మాట్లాడిన పదాల్లో యెంత తిరస్కార ముందో ఏమో ; అరుణ మనస్సు కలకబారి ఒక్కక్షణం కొయ్యై పోయాడు. ఇక తనలో ప్రేరేపించిన ఉద్రేకం ఆగక మహాఘాతంలాటి జవాబిచ్చేశాడు.

"ఒకప్పుడు, 'మా మతం మా దేవుళ్ళు,' అంటూ యెగుర్లాడుతూ మన పెద్దలంతా, పెద్దపెద్ద దేవాలయాల్ని నిర్మించారు. ధర్మరక్షణ మతరక్షణ పేరుపెట్టి, విద్యాలయాలు కూడా స్థాపించారు. నిర్వహిస్తామంటూ నిక్షేపాలిచ్చారు. యెన్నో నిధులిచ్చారు. వాటిలో సోమనాథ దేవాలయం వంటివి చెప్పుకోదగినవి; ఐతే, కడకేమైంది?... 'మీది మతంకాదు,....రక్షణ తెలీదు' అంటూ ఉద్ధరించే వాళ్ళలా వొచ్చిన మహమ్మదీయులు; నిక్షేపాలతో సహితం విగ్రహాల్నికూడా తర్లించుకుపోయారు అలా యెంతదూరం మోసుకెళ్ళారనీ ? మార్గమధ్యంలోనే అరేబియా యెడారిని దాటించలేకపోయారు. నిర్మించిన వాళ్ళ వుద్ధరణ మహమ్మదీయులదాడి వరకూ సాగితే, మహమ్మదీయుల వుద్ధరణ అరేబియా యెడారి కప్పగించడం వరకూ సాగింది. ఆ ఎడారి చేసిన తుపానుదాడికి వశమైపోయాయి మనవిగ్రహాలు. యిసకతుపానుల తాకిడికి ఆ విగ్రహాలు నునుపెక్కి సూర్యకిరణాలలో మెరుస్తూ ఈనాడు స్ఫినిక్సు అనిపించు కుంటున్నాయి. శిల్ప కళాచాతుర్యం 'మాసొమ్ము' నుకుని విగ్రహంగా మలిచి, మతం అనే వాతావరణపు భ్రమలో 'దాచేద్దాం' అనుకున్నారు హిందువులమనుకున్న వాళ్ళు. 'మీకేం తెలుసు, వాటివిలువ! మేం వుద్ధరిస్తా'మంటూ

పట్టికెళ్ళినవాళ్ళు మహమ్మదీయుల మనుకుంటూ హిందూ దేశంమీద ఆధారపడ్డవాళ్ళు! యీ రెండు రకాల వాళ్ళ హద్దుల్లోనే నియమితమై దాచబడే వస్తువేదేనా కావచ్చు కాని,....మానవత్వాన్ని ప్రసాదించి, ప్రతిష్ఠించి, ప్రతిపాదించీ చేసి, మానవ నైతిక విలువలను సమకూర్చే శిల్పకల నిర్బంధించబడేది కానేరదు. ఈనాడు, ఆ విగ్రహాలను చూడ్డానికి మూడు మతాలవాళ్లూ, యెడారిని లక్ష్యపెట్టకుండా వెళ్ళి చూసివొస్తున్నారు...." అరుణ చెప్పదలిచిన భావం యిప్పటికి అర్థమైంది సుశీలకి. ఐనా, అతను చెబుతున్న జవాబు పూర్తిగా కాలేదు. అతని ధోరణిలో జవాబు తోచటంలేదు, వెనకపాటుగా వాత పెడుతున్నట్లు తోచి, బాధ పెడుతోందంతే! మొదట్లో ఆ ధోరణి పైత్యపు వాగుడుగాతోచింది, కొద్దిసేపటికి యేదో పొడుపుకథ అనిపించింది. యిప్పటికి అది వాతగా పరిణమించి భరించలేనంత బాధ పెట్టింది కూడా! అందుకే విదిలించుకుంది.

"అంతగా యెవళ్ళ పుద్ధరణా లక్ష్యంలేకుండా ఇంతవాళ్ళయిపోయారా?....ఆనాడు....ప్రాధేయపడినక్షణం.... యిప్పుడు గుర్తుండదు కాబోలు! ...చదువు చెప్పిన వాళ్ళకే యెదురు చెప్పగల సాహసం యెంత కాలంనించీ పొదుకుందీ?....సాహసం చాలా దూరంవొచ్చింది!" అహంకారం పూర్తిగా వ్యక్తమయ్యే జవాబుతో, అరుణని కసిరి కొట్టింది సుశీల. దాంతో అరుణలో పౌరుషం రెచ్చిపోయింది. వెంటనే ఉన్నదున్నట్టు చెప్పేశాడు కూడా.

"సుశీలా చాలా ఉద్రేకం తెచ్చుకుంటున్నావ్ ! అనవసరంగా, విడిలించుకు మాట్లాడతావేం ?.... ఆనాటి మాట వుదాహరణైతే, దానికి నే పొందిన జవాబేదీ? .... దానికిదా జవాబూ? .... పెళ్ళి చేసుకోడమా ? .... అదా నీ అర్థం ! .... యింతకీ నేనింట్లో వుండక బైటికెళ్ళిపోతున్నానని కదా, నీ యీవింత విజృంభణ ! వుద్యోగం చెయ్యాలనుం దన్నాను. యిప్పుడు కాదన్నావ్. కావాలన్నప్పుడు దొరకవు, అందుకని దొరికిన వెంటనే ప్రవేశించాను. అప్పుడే చబితే, మాట విన్లేదని బాధపడతావని చెప్పలేదు; అబద్ధమాడి దాచేశాను. గురుత్వాన్ని తీసికొచ్చి అడ్డం వేస్తున్నావంటే... ? ఈ చెయ్యబోయే పనులకి నీకే ఆలోచించడం తెలుసనా ? నా కూడా చదువు సంధ్యల ప్రభావం అంటిందంటావా ?..." చాలా దూకుడుగా జవాబిచ్చాననుకున్నాడు అరుణ. ఉద్రేకంలో, కోపం అణుచుకుంటూ, వొణుకుతూన్న స్వరంతో ఊగులాడుతూ సంబాళించుకుంటున్నాడు అరుణ.

"యెందుకొచ్చిన నౌకరీలు; యేం నిండుతుందనీ ? చెప్పినమాట వినకుండా !" సాగదీసుకుంటూనే అయిష్టంగా అవతలి గదిలో కెళ్ళిపోయింది సుశీల. అయినా, ఆమెలో అహం దెబ్బతిని, అకారణ కా[illegible]ష్ఠ రెచ్చగొట్టింది. సంస్కారంలేని భావనా విశేషం, తమోగుణాన్ని ప్రేరేపిస్తుంది; ఇదే అవిద్యా లక్షణం! సత్యగుణార్థమైన భావనా భావిత విద్య, సవిద్య !

# ౨౨

“యీ నాటికి యింత పెద్ద అయిపోయాడు! నేనెంతగా త్యాగం చేశానో యిప్పుడు గుర్తుచేసుకోలేకపోతున్నాడు. ఇంతవరకూ చాపకింద తేలుమాదిరిగా, బురదలో వున్న గాజుపెంకులాగ ఊరుకుని, ఈనాడు నన్ను బాధపెట్టాలని చూస్తున్నాడు. యెంతటి వాడెలా మారిపోయాడూ!... ఈనా డింతచేసి, రేపెంత చేస్తాడో కదా!... యిప్పుడు నేను తేలికైపోయానుకదా !...యిందు కేమిటి విరుగుడు ? నేనేం చెయ్యాలి?... యేంచేస్తే దోవకొస్తాడు?...నా బుద్ధియింతగా మందగించి పోయిందేం ?... అయ్యయ్యో, పాముని పెంచుకుంటున్నానేం ?... నా కేమిటి దారి ?

‘నాన్నా ! నువ్వు నచ్చజెప్పాలనుకున్నప్పుడు విన్నానుకాదు, ఈనాడు తెలిసొస్తూంది. అమ్మపోతే, అన్ని విధాల ఆదుకుని, అ[illegible] సౌఖ్యాలూ విడుచుకుని, ఒక్క లక్ష్యంతో ముద్దుగా పెంచి, నన్ను మన్నించకుండా వెళ్ళిపోయావా? క్షమించలేనంత తప్పుచేశానన్నమాట, ఈనాడు తెలుస్తూంది, నాన్నా! అనుభవిస్తున్నాను; యేమో అనుకున్నాను; దారికొస్తాడనుకున్నాను; ముందుచూపులేకుండా

నీకెదురు తిరిగాను. యిప్పుడు నలుగుతున్నాను. యికమేలు కుంటాను, నన్ను ఆదుకోనాన్నా! నాతప్పులన్నీ మన్నించు నాన్నా! నువ్వు కాకుంటే, యింక దిక్కెవరూ?''

ఆకాశం చిల్లుపడినట్టు కురిసిన కుంభవృష్టిలాగ ఏడ్చింది సుశీల. తనకింక గతిలేదన్నట్టు బాధపడింది. అప్పటి నుండి అదే ఆలోచన; తదేకంగా ఆలోచించడంచేత, బిడ్డని కూడా సరిగా సంరక్షించలేకపోతోంది; యిక అరుణ విష యంలో తనకున్న సదభిప్రాయమంతా చెరిపేసుకుంది. అందుచేత అతన్ని పలకరించడం లేదుకూడా! చాలా నిమి త్తంగా మాట్లాడుతూ, యిష్టమున్నట్టు లేనట్టూకూడా సంచ రిస్తోంది.

అరుణ యివన్నీ ఆలోచించడంలేదు. అతని ఉద్దే శంలో ఆమె కోప మణిగిపోతే మాట్లాడొచ్చులే అని మాత్రం అనుకున్నాడు. అందుకే, సుశీల ప్రసన్నంగా లేక పోడానికి విచారించడంలేదు. 'కొన్నాళ్ళకదే సద్దు మణుగు తుందిలే' అని, ఆ క్షణంకోసం ఓపికతో ఎదురుచూస్తూ; రోజులు నెట్టేస్తున్నాడు. యింతకీ లక్ష్మినికూడా, సుశీల సరిగా చూడ్డంలేదని తెలుసుకోలేదు; అతనికా అనుమా నమే రాలేదు. అలా నాలుగు రోజులు గడిచాయి.

ఆనాడు అరుణకి జీతంవొచ్చింది. ఎక్కౌంటెంటుగా అతని జీతం నూటయెనభైయేడు రూపాయలు ముట్టాయి. తనకి తండ్రి పంపించే రెండొందలు ఖర్చవటంలేదు. ఇప్పుడీ జీతంకూడా వొస్తోంది ఏం చెయ్యాలీ? ఆలోచ నల్తో ఉక్కిరిబిక్కిరౌతూ అరుణ బజారులో ప్రవేశించాడు.

అలవాటు లేనివాడు స్వయంగా బట్టల దుకాణంలోకెళ్ళి 'మంచిరకం చీర కావాల'న్నాడు. దానికి తగ్గట్టు వో జాకెట్టుగుడ్డ తీసుకున్నాడు. లక్ష్మికో గాను కొన్నాడు. సుశీల యెవరికి వారికే అన్నట్టు విడివిడిగా పార్సెలు చుట్టించుకుని రాత్రి యేడౌతూండగా యిల్లు చేరుకున్నాడు.

గుమ్మంలో ఎదురైన భార్యారత్నానికి ఆమె బాపతు పార్సెలు యిచ్చాడు. లైటు వెలుగులో, కాగితం తప్పించి చూసింది. 'ఉఁహూ' అనుకుంటూ అక్కడున్న టేబులుమీద ఉంచేసింది. ఆమె భావమేమిటో అగుణకి అర్థంకాలేదు. యేం జేస్తాడు పాపం! తన జేబులోవున్న లక్ష్మి గాను పైకితియ్యక వూరుకున్నాడంతే.

'నన్నుయెరేసి తనకి తొత్తును చేసుకోవాలని ప్రయత్నం కాబోల్ను అబ్బాయిగారి వుద్దేశం! పాపం, యీ చీరెల మోహమెవరెరగరనీ? ఈ మాత్రానికే మురిసిపోతాననుకున్నాడు కాబోలు! యింకానయం, పూలుకూడా తెచ్చాడుకాదు. తెలివి తేటలిందు కుపయోగిస్తున్నాయన్న మాట !... అణాకానీ మనిషి, ఉరి తగిలించుకున్నట్టు వోకోమటి గుమాస్తా నౌకరీచేస్తూ ఆ పావలా డబ్బులికీ' తోడువాళ్ళ నాన్న పంపించినడబ్బు వో కొంచం వేసి యీ చీర తెచ్చుంటాడు. ఈ రూపాయిణా చీరలెవరిక్కావాలీ అంట! నేనంత ఏం తెలియని చిట్టి పాపాయినా? ఇంకా నాాసం చేద్దామనుకున్నాడు కాబోలు! అమాయకుడు లైటిలుతో యిప్పటికేముంచాడు. యింకేం మంచుతాడు?

యిప్పటికీ కళ్ళు తెరవకపోతే యింకా మించేవాడే! ఇలాటి సంగనాచికి నే లొంగుతానా ? ..చూద్దాం, నే జవాబు చెప్పలేకపోయినాడు కదా! నాకెదురు తిరిగితే, నేనేం చెయ్యగలనో ఆనాడు కాలేజీలో చూపించడానికి అవకాశం రాలేదు. ఈనాడొచ్చింది. చూపిస్తా, యెట్లా నిగ్రహించుకుంటాడో చూస్తాగా! వెఱ్ఱి సుశీలనుకున్నాడేమో!

కత్తి మరీ పదునెక్కేలా నూరుకుంది, సుశీల. ఆమెలో అంతులేని కోపం! తన ఆసరాలేకుండా తెలివి తెచ్చుకున్నాడన్న ఈర్ష్య; కావాలనుకున్న ఘనత తన క్కాకుండా చేసేడన్న భావంతో పగ; తనకంటె పై చెయ్యిగా బతకాలన్న పట్టుదల ఒక్క పెట్టుగా ఆవేశించి, సుశీలని స్థిమితంలేకుండా చేస్తున్నాయి. వాటి ఆధారంతో గాలిమేడలపై శిఖరాలమీద గంతులేస్తోంది.

తెల్లారి ముఖాలు కడుగుతూండగా దాసిరంగమ్మని పిలిచి, "యిదిగో తీసుకోవే, మీ అయ్యగారు నీకు బహుమానం తెచ్చారు" అంటూ దానికందించింది. 'ఏదో పాట్లం' అనుకుని తీసుకుంది. తీరా విప్పిచూసి, తెల్లబోయింది. జార్జెట్ చీర, జార్జెట్ గుడ్డ! చూస్తున్న సుశీల కూడా కళ్ళు పచ్చబడ్డాయి. "యిలాటిది తెస్తాడనుకోలేదే" అని నాలుక కొరుక్కుంది. అయినా, పట్టుదల విడవగలచలేదు. "ఏదెలా జరుగుతుందో కానియ్, చూదాం" అనుకుని ఊరుకుంది.

ఈ సంఘటన చూస్తున్న అనంత నిశ్చేతనంగా నోట్లో బ్రష్‌తో కూర్చుండిపోయాడు. భూమి తనచుట్టూ

తాను తిరుగుతుందని భూగోళం చెబుతోంది కాని, ఇప్పుడు తనచుట్టూ తిరుగుతూన్నట్టు కళ్ళారా చూస్తున్నాడు అరుణ. 'యింతగా మారిపోతుంద'నీ పూర్తిగా వ్యతిరేకిస్తుందనీ ఊహించలేకపోయాడు. నోట్లో బ్రష్ నానిపోయి నంతపని జరిగినా, నిశ్చేష్టత పోదల్లేదు. ఏవేళకో తెములుచ్చుకుని, ఆఫీసుకి అరగంట లేటుగా చేరుకున్నాడు; ఆఫీసులో క్షమాపణ చెప్పుకున్నాడు.

మధ్యాహ్నం యింటికివొచ్చి తన గదిలో కూలబడ్డాడు. కుర్చీనుంచి పైకి లేచే అవసరం లేకపోయింది. సుశీల హాల్లో పడుకుని ఏదో చదువుతూంది. భోజనానికి రమ్మని పిలవలేదు. 'ఎప్పుడో పిలుస్తుందిలే' అనుకున్న అరుణకు నిరాశ యెదురైంది. యింకా యెదురుచూస్తే మళ్ళా లేటౌతుందని, వెంటనేలేచి వెళ్ళిపోయాడు. ఆనాడు సాయంత్రం హోటల్నుంచి టిఫిన్ తెప్పించుకున్నాడు ఆఫీసుకి. రాత్రికూడా సుశీల పిలవలేదు. అప్పుడూ హోటలే గతైంది. ఈరకంగా మూడురోజులు ఆచత్తా ఈచత్తా తిని కడుపు నింపాడు. యిక లాభంలేదని టికెట్ బుక్కొన్నాడు. విచిత్రంగా మారిపోయింది అతని జీవితం. ఉద్యోగంతో పగలంతా ఆఫీసులో, భోజనం వగైరాలు హోటల్లో, నిద్రమాత్రం సుశీల యింట్లో. ఈ పద్ధతికూడా సాగుతుందన్న నమ్మకమేదీ? ....“యిక్కడేం మిగిలిందనీ, యీ యింటికి రావడం?'' అని అడిగితే ఆనాడు హాస్టలు కాళీ చెయ్యడానికెన్ని అవస్థలు పళ్ళేదూ? యిప్పుడిదికూడా హఠాత్తుగా సంభవిస్తే ఏం చెయ్యాలి?....యింకో యిల్లు

తీసుకుని వుంటేనేసరి, లేకుంటే వోకోజున వీధిలో నిలబడాలి
సాస్తుంది." అరుణ ఆలోచన రైటే అనిపించింది. వెంటనే
ఆఫీసు నౌకరుతో చెప్పి, అక్కడికి దాపులోనే వో యింటో
వాటాని అద్దెకి తీసుకున్నాడు. ఉదయం ఆఫీసుకెళ్ళేముందు
అక్కడే కాఫీ టిఫిన్లు ముగిస్తాడు. మధ్యాహ్నం కారియర్
తెప్పించుకుని అక్కడే తింటాడు. సాయంత్రం కొంచంసేపు
చదువుకుని, భోజనం చేసి తాళంవేసి వొచ్చేస్తాడు. ఏమీ
తెలియని వాడిలా యింటికొచ్చి పడకుర్చీలో వాలి
చదువుకుంటాడు. యిన్ని అలజళ్లు వొచ్చినా, యింకోటి
మరోటీ పాడుజేసుకుంటాడు కాని; చదువూ పుస్తకం మరి
చిపోడంలేదు. అరుణలో పాదుకున్న లక్ష్యం అలా చేయి
స్తూంది.

ప్రతిదినం ఆఫీసుకెళ్ళేముందు లక్ష్మిని దగ్గరికిపిల్చి
'కాఫీతాగేవా' అంటాడు, 'బిస్కట్లున్నాయా' అని విచా
రణ చేస్తాడు. యేవేవో పిచ్చి మాటలు చెబుతుంది.
అన్నిటినీ ఓర్చుకుని వింటాడు 'ఊఁ అలాగ' అంటాడు.
నెమ్మదిగా లేచి వెళ్ళిపోతాడు. చీకటిపడ్డాక వస్తాడు. వస్తూనే
'అమ్మా' అని పిలుస్తాడు. మళ్ళీ విశేషాలడుగుతాడు. యిక
చదువు ప్రారంభిస్తాడు. మొత్తంమీద తనకి కాని జీవితం
గడిపేస్తున్నాడు అరుణ. యిలా రెండు నెల్లు గడిచింది.

## ౨౩

ఆనాడు శనివారం. ఆఫీసుకు వెళ్ళేసరికి ప్రతి గుమాస్తా ప్రతి అధికారీ అతనికి గ్రీటింగు చెబుతున్నారు. ఈ పరిస్థితేమిటో అరుణ కేమాత్రం పాలుపోడంలేదు. సుమారు పన్నెండౌతూండగా మేనేజరు అతడ్ని పిలిపించాడు. అంతక్రితం రాత్రి కలకత్తా హెడ్డాఫీసునుండి రిప్రజంటెటీవ్ వొచ్చాడు; ఆయన ఐ.యల్ టి.డి. కి అటర్నీగా వుంటున్నాడు. అతడితో యింటర్వ్యూకి అరుణని పిలిపించాడు మేనేజరు. వారిద్దరూ ఆఫీసులో తారసపడ్డారు.

"నీ సర్టిఫికేట్లునిబట్టి, నిన్ను కొన్ని విషయాల్లో తరిచి చూడాలనుకుంటున్నాను; సరైన జవాబులు చెప్పి పై నౌకరీలకి తగినవాడవనిపించు కోవాలని వుందా? నా ప్రశ్నలకి జవాబు చెప్పడం యిష్టమేనా?" అటర్నీ అరుణని సాపేక్షగా అడిగాడు.

"నేను సిద్ధంగానే వున్నాను. యిలాంటి పరీక్షద్వారా నౌకర్లలోవున్న శక్తినీ,యుక్తినీ తెలుసుకొంటూ ప్రమోషను నిచ్చే సంస్థ యెప్పుడూ అభివృద్ధి పొందుతూ వుంటుందని, ఆర్థిక శాస్త్రరీత్యా నా అభిప్రాయం. అడగవచ్చును" వినయంగా అన్నాడు.

అటర్జీ భువన్ ప్రసాద్ అతని జవాబు విని సంతోషించాడు. యిక వేరే పరీక్ష లేదన్నట్టు పిచ్చాపాటీతో ప్రారంభించాడు, "అయితే ఆ వుద్దేశం మీకెలా తోచింది ?"

"ఇది జాన్ స్టూవర్ట్ మిల్ కొంతవరకూ సూచన ప్రాయంగా చెప్పాడు; మార్షల్ ఈ విషయంలో 'చెకింగ్' అని మాత్రం ఉదహరించాడు కేవల్ క్రిష్ణ దేవేత్, ఆ చెకింగుకి భాష్యం చెప్పాడు; దాని సారాంశంలో కూడా పరీక్షించి ప్రమోషను నివ్మని కాదు. అసలా భావాన్నే స్పృశించలేదు. నా ఉద్దేశంలో లేబర్ ఆఫీసును నిర్మించి మూడోతరగతిలో వుండే మంచి చెడుగుల్ని సవిరించినట్టే చెకింగు పేరుతో జాబ్ ఎవల్యుజింగు కూడా చేస్తే స్థిరమైన పునాదులతో ప్రతి సంస్థా వర్థిలుతుందని, తోచింది. అందుకే అలా అన్నాను. నాది అడ్వాన్స్టు ఎనాలిసిస్ అనుకోండి పోనీ, అయినా న్యాయమాలోచించండి. అటర్జీ కాబట్టి మీతో కులాసాగా చెప్పగలిగాను" అంత ధీమాగా మాట్లాడినందుకు క్షమించమన్నట్టు చెప్పాడు.

"సరే; విదేశం అంటే యేమిటీ ? దానికి సంబం

ధించి వ్యాపారం యేవిధంగా అమలు పరచాలి ? యిరు పక్షాలూ నష్టపడని విధానమేది?"

"వస్తువుయొక్క ఉనికి సూచించేది స్వదేశం; స్థానం మార్చి యెటుతిప్పినా అదంతా విదేశమే! ఒకచోటి నుండి ఒక వస్తువుని తెచ్చి దాన్ని సంస్కరించి మార్చి, మరో రూపంలో దాన్ని అన్ని ప్రాంతాలకీ సరఫరా చెయ్యడం, వ్యాపార వ్యవహారం. అలా చెయ్యడంలో ముడిసరుకు దొరికే చోటునుండి వస్తువును ప్రయోజనకారిగా మార్చే స్థలానికి చేరవేయుగా, కొంతకూలి కమీషన్లు మొదలైనవి అసలు ఖరీదుతో చేరతాయి. వస్తువును సంస్కరించడానికి మరికొన్ని వస్తువుల్ని చేర్చి, యంత్రాల్ని ప్రయోగించి వివిధ మార్గాల్లో ఉత్పత్తిని పూర్తిచేసేవరకూ, యిన్ని రకాల ఖర్చులూ తగులుతాయి. వాటిలో కొన్నిటిని, ముడిసరుకు తెచ్చిన ప్రాంతాలకి కూడా సరఫరా చేస్తాం. అలాటి ప్రాంతాలవారికి ఆ సరుకు దాదాపు రెట్టింపు ధరకి లభిస్తుందన్నమాట! అందుచేత: ధరలని అదుపులో పెట్టాలంటే, ఉన్నతిలో ఈ రకానికి చెందిన మార్పిడి సంస్థలను నిర్మించకూడదు. ముడిసరుకులు అందుబాటులో వున్న ప్రాంతాల్లోనే వివిధ పద్ధతుల్లో సాంస్కారిక కర్మాగారాల్ని చిన్న పెట్టుబడులతో స్థాపించితే, ముఖ్యంగా నిరుద్యోగం పోతుంది. యంత్రాలకోసం, లోహకర్మాగారాలు ఏర్పడుతాయి. పలువిధాల ప్రజలకి పని కలుగుతుంది. ధరలు చెప్పనక్కరలేదు. అయినా, ఒకొక్క

తెగకి సంబంధించిన కర్మాగారాలన్నీ అనుబంధంగానూ వుండొచ్చును. జాతీయంగానూ కావచ్చును. సిమెంటు ఫ్యాక్టరీల సంస్థవున్నట్టే అన్నీ వుండొచ్చు. ఇక భూగోళా న్ననుసరించి దేశీయం విదేశీయం అనిపించుకునే రీతుల్లో చేసే వ్యాపారం చాలభాగం అధికధరలనే ప్రోత్సహిస్తుంది. ద్రవ్య మారకం విధానం మాని, వస్తుమారకం పద్ధతినే అమలు జరిపితే, బాగుంటుంది. అలాటప్పుడు అధిక ధరలని సూచించిన ప్రతి దేశంలోనూ ప్రజలకి మనస్థిమితం వుండదు. అంతఃకలహాలు రేగుతాయి. అంతఃకలహాల కారణంగా వ్యాపారం దెబ్బ తింటుంది. ఈ విషయానికి తార్కాణం యింతకాలంగా హిందూదేశాన్ని పాలించినట్టు భావించిన ఐరోపీయులే! వాళ్ల వ్యాపార సంస్థలు రూపనామాలు లేకుండా పోయాయి....ఒకే గూటిలో చీలిక వ్యాపారం పొసగేదికాదు. వస్తు మార్పిడి చేతకాని, అదే వస్తువునిచ్చి కాని వ్యాపారం చెయ్యాలి అనుకుంటే, దానికో పద్ధతి వుంది. పల్లెటూరునుండి చౌకలో సరుకులు కొనడం, చేరువలోవున్న బస్తీకి తీసికెళ్ళి అమ్మడం; అలాగే కొంటూ అమ్ముతూ వుంటే; వుత్పత్తి స్థానంలో వున్న ప్రజలకి ఆ కాలం వొస్తుంది. దీన్నే కరువు అనొచ్చును. షార్ట్ ఆఫ్ మెటీరియల్ సీజన్ అనిపించు కుంటుంది. అప్పుడక్కడి వారికే అధిక ధరలకు కిట్టే సరుకు కొనడం బస్తీలో అమ్మడం దుర్ఘటమాతుంది. మాటవరసకి పల్లెల్లో ధాన్యం చౌక, పట్నంలో ప్రియం. అదే వస్తువును పల్లెలో పల్లె ధరకు కొని బస్తీలో బస్తీ ధరకు అమ్మి — మొదటి పెట్టు

బడినే వినియోగించి అదేవస్తువును బస్తీనుండి పల్లెకుచేర్చి వారిధరకే వారికి అమ్మితే—వస్తువును సమూలం దోచుకున్నట్టూ కానేరదు; వ్యాపారికి తగిన లాభం వుంటుంది. కూడా!. ఈ పద్ధతి విచిత్రంగా తోస్తుందికదూ? సంస్థానాల కాలంలో హైద్రాబాదు, సికింద్రాబాదుల్లో జరిగిన వ్యాపారం అలాటిదే. కేవలం సొమ్ము మారకం చేస్తూ వుండేవారు. బ్యాంకిరేటుకు భిన్నంగా యెప్పుడూ నడవలేదు. అయినా లాభం గడించారు. అయితే యిలాటి వ్యాపారం తరుగుప్రాంతాల్లో వ్యాపారినీ ప్రజల్నీ కూడా నష్టపరుస్తుంది" "యింత చెప్పి ఊకదంచా ననుకుంటాను" ముక్తసరిగా చెప్పాలనుకున్న సారాంశం యింతకు పరిగింది.

"సరే, వొప్పుకుందాం. పల్లెనుండి బస్తీకి తెచ్చిన సరుకునే తిరిగి పల్లెకితెస్తే లాభమేం వుంటుంది? అందులోనూ ధర పెంచకుండా!"

"దానికీ ఉదాహరణిస్తాను. పల్లెలో ఒక రూపాయికి మూడుశేర్ల బియ్యం కొన్నాం. బస్తీలో రెండు శేర్లుగా అమ్మేశాం. అంటే ఎనిమిదణాలు మిగిలింది. దాన్ని వేరుగా వుంచుదాం. మొదటి పెట్టుబడి రూపాయి కాబట్టి ఆ రూపాయితోనే బస్తీ సరుకు కొందాం. అంటే రెండు శేర్లు. పల్లెలో అమ్మాలంటే, దానికి పదణాల యెనిమిది పైసలు వొస్తుంది. అంతకుముందు వున్న ఎనిమిదణాలు కలిపితే రూపాయి రెండణాల యెనిమిదిపైసలు అవుతుంది.

దాన్నిబట్టిచూస్తే ఆరోవంతు లాభం కనిపిస్తూనేవుంది. ధరల నిష్పత్తి 3 : 2 అయితే చక్రవ్యాపారపు లాభం మూడోవంతులో రెండోవొంతు (1/3+1/2) గా ఆరో వొంతు మిగుల్తుంది. ఒకవేళ పదిశేర్లు ఎనిమిదిశేర్లుగా ధరలుంటే నిష్పత్తి 5 : 4 కాబట్టి లాభం యిరవయోవంతు, యిలాటి వ్యాపారాలవల్ల తరుగు ప్రాంతాలకి ఉల్బణం సంభవిస్తుంది. ఇక్లేషనుకు కారణం. పల్లెలో సరుకు వుండొచ్చని బస్తీ, బస్తీలో వుండొచ్చునని పల్లె అనుకుంటూండగా ఖర్చైపోయిన సరుకు లోటుగా తేస్తుంది."

అరుణ చెప్పిన ధోరణి భువనప్రసాదుకు నచ్చింది. పైకేమీ అనలేదు. అయినా, వోరకంగా సూచనచేశాడు. "కొన్నాళ్ళపాటు హెడ్ అక్కౌంటెంటుగా యిక్కడే పని చేసి, జనరల్ ఆఫీసులో ట్రైనింగైతేనేగాని నీ సంగతి అంతగా చెప్పలేను. ఒచ్చేవారంనుండీ, ఇక్కడి అక్కౌంట్ల ఛార్జి తీసుకో." ఆర్డరు టైపుచేయించి యిప్పించాడు వెంటనే.

అరుణకు ఆశ్చర్యమేసింది. "ఇందుకా, అందరూ వినయం వలకబోస్తూ పలకరిస్తున్నారు" మనసులో అనుకున్నాడు.

"నాకు టీ పార్టీ యిచ్చి, నన్ను రిలీవ్ చెయ్యాలబ్బాయ్" అంటూ పాత అక్కౌంటెంటు రిజర్వు డిన్నరు టికెట్ తీసుకున్నాడు.

ఇంతమంది, యిన్నిరకాల పొగుడుతున్నా తనకు

తృప్తి కలగటం లేదు; ఈ వార్త విని సుశీల సంతోషిస్తేనే తనకి తృప్తి, సంతోషమూను. "రేపు ఆదివారంకదా, సరదాగా అప్పుడేర్పాటుచేసుకుందాం. ఏపద్ధతిలోసాగిడినన్నా రుక్తిగా వుంటుంది..... కాదంటే, యిప్పుడు వందరూపాయిలిస్తాను, మధ్యాహ్నం మొచ్చేప్పుడు యింకో రెండొందలు తెచ్చిస్తాను. ఏం చేసుకున్నా సరే. నా అభ్యంతరం లేదు. ఏమంటారు? తొందరలేదంటే రేపు తప్పక యేర్పాటు చేస్తాను." ఆఫీసు స్టాఫ్‌కి నచ్చచెప్పి మేనేజరు దగ్గర ఆ పూటకి శెలవు తీసుకుని యింటికొచ్చేశాడు. అతనిలో భరించలేనంత సంతోషం వుంది. నాలుగొందల జీతగాడు తాను. బియ్యేలకీ, యెమ్మేలకీ లేని నౌకరీ, గౌరవం, హోదా అన్నీనూ!

## ౨౪

అదే రోజున పోస్టులో సుశీలకో ఉత్తరం మద్రాసు నుండి చేరింది; ఆమె స్నేహితురాలు సరోజ రాసింది. 'ఒక వారంరోజుల్లో తాను మద్రాసు చేరగలిగితే వుమెన్ వెల్‌ఫేరులో వుమెన్ గైడు గా యిప్పించగలనని' దాని సారాంశం. దానితో వెధవ కోమటి గుమాస్తా నౌకరీని తలదన్నిన ఉద్యోగంలో చేరిపోతోన్నట్టూ, అరుణ గర్వాని

కిది సరైన విరుగుడు అన్నట్టు భావిస్తూ, "అతన్ని రాసి, చెప్పేస్తాను దాంతో తలతిక్క అణుగుతుంది" అనుకుని యెదురు చూస్తోంది. "అయితే, సాయంకాలం వరకూ రాడుగా, అలాటిది ఒంటిగంట వేళప్పుడొచ్చేశాడేం?" తెల్లబోతున్న సుశీలని అరుణే పలకరించాడు.

"భలేవార్త తెచ్చాను, నీకోసం, సుశీలా!" అన్నాడు గుమ్మంలో కాలిడుతూనే.

"అది మీకంటె ముందే నాకు తెలుసు" ముభావంగా అనేసింది.

"అప్పుడే నీకెల్లా తెలిసింది?" ఆశ్చర్యపోయాడు.

"నాకాబోతే మీకెల్లా తెలుస్తుంది?..." సాగదీసింది.

"ఏమనీ? ... నీకెందుకు తెలుస్తుంది?" విస్తుపోయాడు.

"అదే, నాకూ నౌకరీ దొరికింది ఓ వారం రోజుల్లో వెళ్ళి చేరాలి, మద్రాసులో.... అట్టేగా మీకూ తెలిసింది!" జ్యోతిషం చెప్పినట్టు మాట్లాడింది. అరుణకి మతిపోయినంత పనైంది తల దిమ్మెక్కిపోయింది. ఏం చేస్తాడు? శంకరుడు కాలకూటం మింగాడో లేదో తెలియదుగాని అంతకంటే మించిన ఘాతాన్ని భరించాడు. 'తను తెచ్చిన వార్త విని సంతోషిస్తుందేమో' ననుకొని సంతోషంగావస్తే, ఆమె ఈ విషయం దూరంగానెట్టి, తనమీద పగసాధిస్తోన్న స్వరంతో, గర్వంతో యెదురుదెబ్బతీసే మాట చెప్పింది. తన భావాల గాజుసీసా భళ్ళున పగిలిపోయింది తన రేకెట్

వేగం పర్వతాన్ని తాకి నిలిచినంత పనైంది. సుడిగాలిలో చిక్కుకున్న విమానంలా తన సంతోషం తన కేదురు తిరిగి నట్లయింది. అరుణకి కళ్ళు తిరిగిపోతున్నాయ్. కుర్చీలో దేహాన్ని చేర్చాడు.

"లక్ష్మిని యెలా పెంచుతారో; అది మహాపట్నం. అక్కడ పిల్లలు పెరగటం కష్టం. అందుకని యిక్కడే విడిచి పెడుతున్నాను సరిగ్గా వారంరోజుల్లో చేరాలట!" కళ్ళెగ రేస్తూ చెప్పింది.

ఐతే, తనేనా తక్కువ తిన్నది? తన యిష్టాయిష్టాలతో ఆమెకి నిమిత్తం లేకపోతే, దేవుడ్నైనా లక్ష్యపెట్టడు తను. జవాబుచెప్పటం తనకి తెలిసినట్లు మరెవ్వరికీ తెలియదన్న నిజం సుశీలకి బాగా తెలుసు. 'ఆమె కళ్ళకి వైకుంఠం కమ్మకొంది కాబోలు' అనుకున్నాడు. అందుకే జవాబిచ్చాడు, "నాకు రోజూ ఆఫీసుకి తిరగటం కష్టంగావుంది, దూరమైంది గనుక. అందుకే దగ్గర్లో యేదో యింట్లో మకాం చేస్తాను. ఇల్లు తాళంవేసినా సరే, అద్దెకిచ్చినా సరే. ఇంతదూరం తిరగలేకుండా వున్నాను." వ్యతిరేకం లేనట్లే జవాబిచ్చాడు. కాని, మకాం మార్చినప్పుడుగాని, ఆమెకి నిజం తెలిసిరాదని ఆ సాయంత్రమే తన ట్రంకుపెట్టే, బెడ్డింగూ, పుస్తకాలూ ఒంటెద్దు బండీలో వేసుకొని లక్ష్మిని యెత్తుకని వెళ్ళిపోయాడు అరుణ.

"అన్నంతపనీ చేశాడు! ఇంకా యిల్లు వెతుక్కోవాలి గదా అనుకున్నా. ఇదంతా ముందే ఆలోచించాడా, లేక యీరోజునే యిల్లు తీసుకున్నాడా? ... 'పోనీ, నేను

నీతో చెప్పకుండా నౌకరీలో చేరాననుకో, అబద్ధమాడే ననుకో నామీద కోపంతో యెందుకు సాధిస్తావు, నాది తప్పే' అనివుంటే ఈ ప్రయత్నం మానుకుని, మళ్ళీ భర్తగా గౌరవించేదాన్నిగా.... అలాటిమాట అనడం యిష్టంలేక పోతే నేనేం చెయ్యాలా? నాకూ చదువుంది, పట్టుదలుంది. నేనూ అన్నం తింటున్నాను" అనుకుంటూ దాసీదాన్ని పిలిచింది. "సుబ్బీ, ఆ బండివాడు వెంకన్న గదటే? వాడ్నోసారి అడుగు, పిల్లా వాళ్ళూ యెక్కడ దిగారోనూ" అని పంపింది.

ఆనాడు సాయంత్రం లక్ష్మిని బజార్లోకి తీసికెళ్ళాడు అరుణ. ఆమె కోరిన బొమ్మలూ అవీ కొన్నాడు. నిత్యం వాడకంకోసం ప్లేట్లూ, చంచాలు వగైరా పాత్రసామాన్లూ గౌన్లూ, దుప్పట్లు, పౌడర్లు, స్వీట్లు, బిస్కట్లు కొనుక్కొచ్చాడు. పైగా మర్నాడు డిన్నరుకూడాను! రాత్రి ఆచుట్టు ప్రక్కల పెద్దాళ్ళనికూడా ఆహ్వానించాడు. లక్ష్మికిదంతా యేదో వింతగావుంది. ఆమెకేమీ తెలియకపోయినా సరదాగా వుంది గనుక యేడవటంలేదు. తల్లినిగురించి అడగటంలేదు కూడా.

## ౨౦

తెల్లారింది. ముందుగా అరుణ తన పక్కలోవున్న లక్ష్మిని లేపాడు. "అమ్మా! ఈ రోజు పండుగ. ఆఫీసువాళ్ళంతా వస్తారు వాళ్ళకి మిఠాయిలూ, బిస్కట్లు అవీ యివ్వాలి. కాఫీలివ్వాలి. యిస్తావా?.... మంచిదానివనిపించుకుంటావా?.... 'వాళ్ళ లక్ష్మి మంచిది; నాకు మిఠాయిలిచ్చింది, కాఫీలిచ్చింది' అంటా రందరూను.... యేం తల్లీ యిస్తావా!" నిద్రమత్తొదలని పసిపిల్లను లేపుతూనే అడుగుతున్నాడు.

"ఎవరికివ్వాలీ?.... యెవరొస్తారు నాన్నా?.... యెవరు వాళ్ళు?.... మనవాళ్ళేనా?.... అయితే, నేనే యిస్తాగాని అమ్మ యియ్యనిస్తుందా?.... చేతిలో మిఠాయి లాక్కుని, 'పిచ్చిదానా, అందరికీ పంచిపెడితే మనకో' అంటుంది నాన్నా!" బుంగమూతిపెట్టి పాత అనుభవం అడ్డం వేసుకుని నిదర మత్తు వొదుల్చుకోడానికి కళ్ళు నులుముకుంటూ వొళ్ళు విరుచుకుంటూ లేచి కూర్చుంది లక్ష్మి.

"అందుకే అమ్మని పంపించేశాను. రెండు రోజులు దాకా రాదులే! యీవాళ నీ యిష్టంవచ్చినట్లు పంచిపెట్టు.

కావాలంటే రేపుకూడా పంచిపెట్టు. ఏం కావాలో చెప్పు. అన్నీ తెప్పించి యిస్తాను పంచిపెడుదూగాని. రేపో ఎప్పుడో తాతగారుకూడా వస్తారు.....తాతకూడా తెచ్చిపెడతారులే! నీకు-వలసినవన్నీ తెప్పించుకో." మాటకిమాట చేర్చేసి ఉత్సాహం ఉబికేలా చెప్పి లేవదీశాడు.

"బలే, తాతగారుకూడా వస్తారా! అయితే, బజార్లో వున్నవన్నీ కొనిపించేస్తాను, నాన్నా; యేం? చాల్తాయా' వొచ్చేవాళ్ళందరికీ, నాన్నా?" యెగిరి గంతులేసి అడిగింది. "అన్నీ పంచిపెడతాను" చేతులు విశాలంచేసి చూపింది. "చాలు బాబోయ్! అన్నంత మిఠాయిస్తాను. ఏంనాన్నా? తెస్తావా మరీ; తాతగారొచ్చాక పంచిపెట్టనా?" మళ్ళీ కళ్ళింత చేసుకుని అడిగి, గంతులుమానేసి నిలబడిపోయింది.

"అబ్బే, యెందుకూ? నేనూ తెస్తాను; తాతా తెస్తారులే! నీయిష్టమొచ్చినంత పంచిపెట్టు.. మరి మొహం కడుక్కుని బజారుకెడదామా?" నచ్చజెప్పి అనుమానాలన్నీ తీర్చి బెంగకి చోటులేకుండా చేశాడు.

ఆనాడు డిన్న రివ్వాటంలో చాలా హుషారుగా తిరి గేసింది లక్ష్మి. ఆ సమయంలోనే సుబ్బివచ్చి చూసింది. దానికేమీ తెలీలేదు ఈ వేడుకలేమిటో. కాస్సేపు లక్ష్మిని తీసుకుని, ఆ వేడుకలో తనూ కొందరికి ఫలహారాలు పంచి పెట్టింది. నెమ్మదిగా చేతులు దులుపుకుంది. అరుణే పలకరిం చాడు. "సుబ్బీ, అమ్మగారు కులాసాయేనా? ఏమయినా చెప్పమన్నారా? యెప్పుడెడతారట? .... చూశావుకదూ. ఈవేళ మా మేనజరికి విందులు ఏర్పాటు చేశాను. నాకు

పెద్ద నౌకరీ వచ్చింది. కూచో. నువ్వుకూడా కాస్త ఫల హారం చేసి, కాస్సేపు అమ్మాయిని చూడు; యీలోగా వాళ్ళని సాగనంపి వస్తాను.'' నెమ్మదిగా అటు వెళ్ళాడు అరుణ. కొంచెంసేపుండి సుబ్బి వెళ్ళిపోయింది. ఇక్కడి వార్త లేమని చెబుతుందో ఏమో!

గత రాత్రంతా సుశీల నిరీక్షణలోనే గడిపేసింది. రాత్రులు లక్ష్మికి తన దగ్గర పడుకునే అలవాటు. అరుణ దగ్గర పడుకోడమంటే ముళ్ళమీద పడుకున్నట్టు బాధపడి ఏడవక మానదు. ఆ తరువాత పేచీపెట్టకా మానదు. దాంతో గత్యంతరంలేక ''సుశీలా'' అంటూ రాకతప్పదు అని అభిప్రాయపడింది. ''ఒస్తే తలుపుతియ్యాను సరిగదా పల కనే పలక్కూడదు'' అని ఊపిరిబిగపట్టి యెదురుచూసింది. వాళ్ళ ధ్యాసలో నిద్రరాలేదు. రెండో ఆట సినిమా జనం సందడిలో అరుణా, లక్ష్మి వొస్తున్నారేమోనని గుమ్మం పక్కనే ఒదిగి నిల్చుంది. 'ఇదిగో పిలుస్తా రదిగో పిలుస్తా' రనుకుంటూ శిక్షనుభవిస్తోన్నదానిలా పురాణాల్లో అంతః పుర ద్వారపాలికలా గాకపోతే, ప్రస్తుత దేవాలయాల ద్వారపాలికా శిల్పాల మాదిరిగా, స్థిర నిశ్చలతా, తటస్థ నిశ్చలతా అనుభవంలోకి తెచ్చుకుంటూ, వీధి గుమ్మం పక్కనే నిలబడింది. యెంత నిలచినా ప్రయోజనం లేకపోగా తెల్లారిపోయింది.

తెల్లారాక 'ఎప్పుడు దాసీని పంపించి వార్తలు తెలుసుకుందునా' అని తొందర మనసులోవున్నా 'దాసీ దానికి లోకువైపోతానేమో'ననే భయం మనసులో పీకు

తోంచే ఉగ్గపెట్టి వూరుకుంది. ఐనా, దాసీదిఊరుకుంటేగా! “నేనెల్లి సూసొత్తానమ్మా! అమ్మాయినీ, ఆర్నీ” అని బయల్దేరింది. ఆఁ అనిగాని, ఊఁ అనిగాని అనకుండా “సీయిష్టం” అన్నట్టు చూస్తో వూరుకుంది.

సుబ్బి వెళ్ళి తిరిగి మధ్యాహ్నం పనిసమయానికొచ్చింది. దాన్ని చూస్తూనే అడిగేసింది “వెళ్ళావే” అని. “యెళ్ళానమ్మా! నిన్నమ్మగోరు నవ్వుతా ఈదులో మిటాయిలూ గట్రా పంచిపెడుతున్నారు. అయ్యగోరి ఆఫీసుల్లో వోళ్ళంతా ఒచ్చేరు. ఆ కాపీలేటి, ఆ ఫలరాలేటి? ఏంసెప్పనమ్మగారూ! నేనూ యెళ్ళాను. బుల్లెమ్మగారు తిరగ లేరని యెత్తుకున్నా. కొంతమందికి నేనూ యిచ్చానూ! యింత తిన్నాను....పాపం! అయ్యగోరడిగారమ్మా! యెట్టున్నారమ్మగోరనీ....‘అపుడపుడొచ్చి సూసెల్లు సుబ్బి’ అన్నారమ్మా! బుల్లెమ్మగోరు నే సిడికి రానన్నారమ్మా! బెతిమాల్తే యేంకానో, గాని బెతిమాల్లేదుండి మరి!” వివరం లేకుండా చెప్పేసి ఒక్కసారి ఊరుకుంది. ఆఖరున నోరు తెరిచి ఓ పెద్ద క్లూయిస్తూన్నట్టు వొంచలేసి మరీ వూరుకుంది.

సుశీలకేదీ అర్థంకాలేదు. పైగా అనేక సందేహాలు తలెత్తాయి” విందేమిటీ! యెందుకూ? యెవరికోసం? నా బెడద వొదిలిపోయిందనా! చిన్నపిల్లకూడా ‘నే రానం’దా! ఒక్కపూటలోనే మనసు మారిపోయింది? వీళ్ళిద్దరికీ ఒకే మాదిరిగా విషమైపోయానా? సర్లే. ఆ సరదా యేనాళ్ళో నేనూ చూస్తాను! ఆపీసంటుందేమిటీ? యే ఆపీసూ? అసు

ంకి ఆపీసుకీ సంబంధం యేమిటి? ఆయనగారి తెలివికి వో ఆపీసూ కచేరీనా? హుం అంతరాతేవుంటే, పదిమంది నోళ్ళల్లో యెందుకు పడతాడూ? నే నెలా వున్నానో అడిగితే తెలిసిపోతుందా? అంత యిదేవుంటే, యేమయావ్ సుశీలా అని అడక్కూడదూ? మధ్యలో ఈ రాయభారాలెందుకూ? యివన్నీ నాటకాలూ బూటకాలూనూ! పెదాలమీద అమృతం, లోపలంతా విషం. నా యోగక్షేమాలు కావలనుంటే, తెల్లారగానే వొచ్చి అడక్కపోయాడూ? నాన్న చెప్పినదానికంటే యెక్కువగానే మోసపోయ్యానేమో! చదువుకున్నానని అహంభావం తప్ప, యిలాంటి వంచకుల్ని గురించి ముందుచూపు లేకుండా చేసుకున్నా నేను! యిప్పుడేనా నాన్నొస్తే బాగుండును."

తర్కించుకు తర్కించుకుని సుబ్బిని మళ్ళీ అడిగింది. "బుల్లెమ్మ యేవందే? వస్తానూ రానూ, అనేం చెప్పలేదూ? మారాం చెయ్యడంలేదుకదా?" అల్లరిచేసి అరుణని విసిగించేస్తుందని చెబితే తనకి సంతోషంగా వుండును. అలాగైతే రాత్రికే దేవుడా అంటూ వెతుక్కుంటూ యింటికొస్తాడు. తన్ను కాదని వెళ్ళాడుగనక తనే వెతుక్కుంటూ రావాలి!

"లేదమ్మగారూ! ఆ సందట్లో తిరుగుతున్నారేమోగాని, నన్ను సూడగానే సంకెక్కారమ్మగారూ! ఆయనకి పిల్లని సాకటం యేంతెలుత్తుందండి? మాపిటేలకో రేపిటేలకో ఒచ్చేత్తారంతేనండి" సొంతకవిత్వంలాగ, జ్యోతిషం చెప్పింది దాసి. ఆ మాటతో సుశీలమనసు తేలికపడింది.

ఆ రాత్రికూడా సుశీల ఓర్పుతో ఎదురు చూసింది, వొస్తారేమోని. కాని రాలేదు. రాకపోడంతో సుశీలకి కోపం యెక్కువై పులుపుతగిలిన కత్తి పదునులా మెరుపూ చురుకూ తెచ్చుకుంది. యేదో సడి వినగానే వాళ్ళేనేమో అనుకుని యెదురు చూసేది. తలుపుతట్టిన ధ్వనే లేకపోతే యెంతకీ? వుడుకుమోత్తనం ఆవేశించింది. ఉక్రోషంతో మనస్సులో చించుకుంది. 'పిల్లముండ, వేలెడంత లేదు. దానిక్కూడా నన్ను చూడాలని లేదూ! చెబుతా జన్మలో నా ముఖం చూడ్డానికొస్తారా వాళ్ళు? తండ్రీ కూతుళ్ళు కట్టై నన్ను వేరుచేసిపోయారుకదూ? దానికీ సమయం వొస్తుందిలే!''

## ౨౦

ఆరకంగా వారంరోజులూ గడిపేసింది సుశీల. ఇక అరుణని దరికి చేరనివ్వకూడదనే నిశ్చయంతో రయిలెక్కింది. రయిల్లో వున్నంతసేపూ రయిలు రొద, దాని తొందరతో బాటు, తన మనసులో వున్న గందరగోళం, పట్టు నెగ్గించు కోవాలన్న తొందర కలతబెట్టేశాయి. రయిలు పొగలా, నరాలన్నీ ఆవేశంతో సెగలుజిమ్ముతున్నాయి. మర్నాటికి ఆమె రుద్రావతారం మద్రాసు క్షేత్రంమీద కాలు మోపింది.

సరోజ చెయ్యూపుతూ కంపార్టుమెంటు దగ్గిరకెళ్ళి సుశీలను దించింది. టాక్సీలో సరోజ రూముకి చేరుకున్నారు. రెండు రోజులు ప్రయాణపు బడలిక వొదిలేవరకూ, సిటీ అంతా తిరిగి వింతలూ విశేషాలూ చూసింది సుశీల. మూడోనాడు తన నౌకరీ ప్రస్తావన తెచ్చింది. దాని విషయంలో సరోజ చెబుతూంది:

"చూడూ, స్కూల్ ఫైనలయ్యాక ఉద్యోగమంటూ యిక్కడకొచ్చేశానా! నా అదృష్టంకొద్దీ ప్రమస్ వెల్ ఫేర్‌లో నౌకరీ దొరికింది. మా సెక్రెటరీచాలా మంచిదేశే. ఆమే నన్ను తన క్లాస్‌మేట్‌కిచ్చి పెళ్ళిచేసింది కూడా. యిప్పుడాయనదగ్గిరికి సిమ్లా వెళ్ళిపోతున్నాను. నే వెడుతున్నానుగనక నా సీటు ఖాళీగా వుంటుంది. దాన్ని మళ్ళీ యెవరో యెందుకు ఆక్యుపై చెయ్యాలి? నువ్వు కావాలంటున్నావుకదాని నీకు రాశాను. యీ విషయం ఆమెతో చెప్పానులే! నిన్నరాత్రికూడా ఫోన్‌చేశాను. సీటు నీకు రిజర్వయిపోయింది. నేనే సుశీలనని చెప్పి ఆక్రమించుకోవడం తరువాయి. అన్నట్టు మీ యాయునా, పిల్లా కులాసాగా వున్నారా? యేమిటి ముఖమంతా పీక్కుపోయి, దెయ్యంపట్టినదానిలా గైపోయావు? నా పెళ్ళికి రాద్దామనుకున్నానుగాని, వీల్లేకపోయింది. ఆయన పదిరోజుల శెలవులో వొచ్చారు. ఇక రేపు వెళ్ళిపోతారనగా పెళ్ళి కుదిరింది. ఆ పదిరోజులూ మవంతా ఒకరికొకరు యెదురుగానే తిరుగుతున్నాం. ఐనా పెళ్ళిఒప్పందం చాలా చురుకుసమయంలో కుదిరింది. అంతే, రిజస్ట్రేషన్ చేయించుకున్నాం. ఆయన

వెళ్ళిపోతాను. నేనీ రాత్రే వెడుతున్నాను వెళుతూ వెడుతూ నా రూమూ, నా నౌకరీ నీకిచ్చిపోతున్నాను. నా గౌరవంతో నా స్థానం జాగ్రత్త పెట్టుకుని అనుభవించు. అలా చేస్తే ఎప్పుడూ నా ధన్యవాదా లందుతుంటాయి. శలవు" అన్ని అప్పగింతలూ పూర్తిచేసి వెళ్ళిపోయింది సరోజ. సుశీల చెప్పబోయే సమాధానాన్ని విని, సానుభూతి చూపే పరిస్థితిలో లేదు. పైగా, ఆ సెక్రెటరీకి పెర్సనల్‌గానైనా పరిచయం చేయలేదు. యేమిటో అంతా హడావుడిగా ప్రయాణమై కాళ్ళమీద నిలుచున్నట్లు వెళ్ళిపోయింది.

ఉదయం తొందరగా బయల్దేరి సుశీల ఆఫీసుకు చేరుకుంది. చేతిలో అప్లికేషన్‌తో సహా ఆఫీసులో అడుగుపెట్టిన సుశీల, అట్లాగే నిలబడిపోయింది టేబిలుమీద సెక్రెటరీ అని వుంది. కాని, సీటులో వున్న మనిషే! ఆడవేషం వేసిన అరుణ! "యింతలో యెప్పుడొచ్చాడూ? ఈ ఆఫీసు నెలా తెలుసుకున్నాడో? పైగా యీ ఆడవేషా లెందుకూ? నన్ను శనిపీడిస్తోందా? దైవం పరీక్షిస్తూందా? వింతగావుంది! అంతగా ఒకే పోలికలున్న వాళ్ళుంటారా? ఆలోచిస్తూ నిర్జీవ ప్రతిమలావున్న సుశీలవైపు సెక్రెటరీ చూసింది. తలూపుతూ 'రమ్మని' సంజ్ఞ చేసింది. యింకేం చేస్తుంది? విధిలేదనట్లు దగ్గిరకెళ్ళింది. మర్యాదకోసం 'నమస్కార' మంది. ఏ రూపాన్ని అసహ్యించుకుని ఇంతదూరం వొచ్చిందో తాను ఆ రూపం యెదుటనే శిక్ష ననుభవిస్తున్నట్లు కూర్చొంది! ఆ మూర్తి ఆజ్ఞానుసారం తను నడుచుకోవాలి! యింతకీ తను చేసిన తప్పేమిటి? చూడూ, ఆ పెదాలు

నీళ్ళువేసినట్టు బిగపట్టి పెదాలమీదుండవలసిన మంద హాసం, ముక్కుపుటాల్లోంచి తొంగిచూస్తుంది. కళ్ళు వెక్కిరించినట్టు చూస్తూంటే, కనుబొమ్మలు వేళాకోళంగా నాట్యంచేస్తాయి. నీటిబిందెలు మోస్తున్న కావడిబద్ద భుజం మీద బరువుగా ఊగులాడినట్టు కొనలూగుతాయి. భావనా ప్రపంచంలో యీదులాడుతుండగా సెక్రెటరీ పలకరించింది. "ఏమమ్మా నీ పేరేమిటి? వొచ్చినపని మరచే, అలా చూస్తూ కూచుంటే, యీ ఆఫీసు పనులు నడుస్తాయా? అసలలా కూచుంటే, నిన్నెవరేనా పలకరిస్తారా?" వర్షం కురిపించింది.

"ఇదిగోనండీ నా దరఖాస్తు. నాగురించి సరోజ చెప్పిందనుకుంటాను. నా పేరు సుశీల అంటారండి" నీళ్ళు నలుముతూ చెప్పేసింది. కాని, మనసులో అనుమానాలు అణుచుకోలేక, చూస్తూ వూరుకుంది.

తన అరుణకీ యీమెకీ కొద్దిగా గొంతు ధ్వనిలో తేడా వుందంతే. అతనిది వెండిమువ్వల ధ్వని, ఈమెది షడ్జమంలో వీణమీటిన ధ్వని. ఇంతకంటే తేడాయేమీ లేదు, ప్రస్తుతానికి, మరి తరవాతేమైనా తేల్తాయేమోగాని!

"ఓహో! నువ్వేనా? చూడమ్మాయ్, చాలా రకాలైన భావాలు నీ మెదడులో పచార్లు చేస్తుంటాయట; భ్రమలో పడిపోయి పొరపాట్లు చేస్తూ కూచుంటే అక్కడో డానికి సమయమే కాకుండా వీలుకూడా వుండదు. యినీ

కత్తిపదునుమీద నౌకరీ. స్త్రీల అభ్యుదయానికి పాటు పడాలి. యెన్నో మహిళాసంఘా లున్నాయ్. వాటన్నిటినీ వారానికి రెండుసార్లయినా విజట్ చేసి, అక్కడ జరిగే సమావేశాల్లో హాజరై సభ్యుల అనుమానాలకి సరియైన జవాబులు చెబుతూవుండాలి. ఆ జవాబులు సాంఘిక ధర్మాల హద్దుమీరిపోకూడదు. ఒకవేళ సరియైన జవాబు తోచకపోతే, ఈ ఆఫీసులో యితర గైడ్లను సమావేశంజేసి, సమగ్రంగా చర్చించుకుని దాని సారాంశాన్ని తరవాత సమావేశంలో, అడిగినవారికి తెలపాలి. ఇది నీ బాధ్యత. యిక ఆఫీసులో నీ ప్రోగ్రెస్ తెలుపుతూ, హాజరయిన సమావేశాలూ, తీర్చిన సందేహాలూ మొదలయినవాటిని రిపోర్టు చెయ్యాలి. దాన్నే ప్రొగ్రెస్ రిపోర్టు అంటారు. వారానికొక రిపోర్టు యివ్వాలి. ఇలాంటి పనుల్లో చాలా మెలకువగా సంచరించాలి. లేకుంటే, ప్రజలు వెక్కిరిస్తారు. ఈ సంస్థ వెలిసికూడా ప్రయోజనంలేకుండా పోతుంది. అందుకే, అసంబద్ధమైన ఉద్రేకాలు తెచ్చుకోడం ప్రమాద మంటున్నాను. యిదంతా నే విన్న విషయాన్ని బట్టి చెబుతున్నానంతే; నాకేం ఆపోహ లేదు. కాని.... యిదిగో అప్లికేషనిదీ, దీనిమీద సంతకం చేసియ్యి. అపాయింట్మెంటు ఆర్డరు కాపీ మీదకూడా సంతకం చెయ్యి. డ్యూటీ సబ్మిట్ రిపోర్టు ఆ చివరిది. త్వరగా సంతకంచేసి ఇయ్యి." యేఁవిటో, తను చెప్పడమేగాని,

ఎదటివాళ్ళని వినిపించుకునే అలవాటు లేదన్నట్టుమాట్లాడిం దామె!'

సుశీల ఆ కాగితాల్నందుకుని, చదువుకుంది. తని చ్చిన అప్లికేషన్ చించేసిందామె. 'యీ అప్లికేషన్ మంచి ఇంగ్లీషు శైలిలో వుంది' ఆర్డరు చూసుకుంది. 'ఎనభయి రూపాయిల జీతం ఏర్పాటుచేసింది. సంతకం....! అదేం విటీ! ఎ. వి. అరుణ, ఎమ్మే....? యిది ఫోర్జరీకాదుకదా! ఎ.వి. అరుణ. నా క్లాసుమేటు....తర్వాత అన్నీనూ! అతడు ప్రైవేటుగా చదివి యెమ్మే అయ్యాడా?....బియ్యే ఒకసా రయినా కాలేజీలో చదవాలి; యెమ్మేకూడా అంతే! మరి ఈ పేరూ? ఈ రూపం....? రెండు అన్వయిస్తున్నాయనుకో! ఈ డిగ్రీ యెక్కడిదీ? యిదన్వయిస్తుందా? నమ్మలేకుండా వున్నాను! యింగ్లీషు యింతబాగా రాస్తాడూ చెస్తాడుగాని మా అరుణ....నోరువిప్పి మాట్లాడడు. ఈమె తెలియని మనిషితో తెలిసినట్లు పైగా ముందు సంభవించబోయే పొరపాటు యివాళే సంభవించినట్టుగా, వార్నింగిస్తూ పలక రిస్తూంది. ఒక్క అరుణని వొదుల్చుకుందామని మారంగా వొస్తే యింకో అరుణ సిద్ధం. రూపనామాల సహితంగా ప్రత్యక్షం. పరమేశ్వరుడిన్ని పట్టుకున్న శనిలా యీ ఆకారం నా వెంటపడిందేమోమరి!' ఆలోచనలు తెరలు తెరలుగా బాధపెడుతూండగా యంత్రంలా నడుచుకుంటోంది సుశీల; ఏదో సజీవశిల్పం మాదిరిగా.

## ౨౭

కూర్చున్న సుశీలకు అదే ఆకారం గుర్తుకొస్తోంది. తలొంచుకుని కాగితాలూ ఫైళ్ళూ తిరగేస్తున్న అరుణను చూసింది. పాపట నడినెత్తినవుంది. "అతనిది పక్కపాపిడి! అతని జుత్తులో పెద్ద కెరటాలున్నాయ్. యీమె జుత్తు చిన్న వుంగరాలదీ! అతనికి చేతి వేళ్ళమీదకూడా రోమాలున్నాయ్. ఈమె నిజంగా ఆడదే, చేతులూ, వేళ్లూ తెలుస్తూనే వున్నాయ్‌గా! మరి, ఒకే ఆకారంలో యిద్దరు మనుషులూ కొంచెం తేడాతో ఒకే వయసనిపించే రెండు విగ్రహాలా! అతనికి ఎడంచేతి మణికట్టుమీద పుట్టుమచ్చుంది. ఈమె కుందో లేదో మరి! "అరే, అనవసరంగా ఆలోచిస్తూ కూచుంటే, నా పనౌతుందా?—కోడ్ చదవాలి. ప్రీవియస్ ప్రోగ్రెస్ చూసుకోవాలి. సంఘాల సేట్లు పరిశీలించాలి. టూర్ ప్రోగ్రాములు అర్థం చేసుకోవాలి! యివేం పనులబ్బా?....'ఆడది యిట్లా బతకాలి' అని చెబితేకాని ఆమెకి తెలియదానేమో? వాళ్ళు బతుకేలా వున్నా, నాలాటి వాళ్ళు బతుకుతారులే!" విచిత్రంగా తన

సీటులో కూచుని ఆలోచిస్తోంది సుశీల. ఆమెకి యేం చెయ్యాలో తోచటంలేదు.

"ఉద్యోగం కోరుకుంటే, శిక్ష దొరికింది. వెనక చెరువుగట్టున తపస్సుచేసిన తోడల్లుళ్ళ మాదిరిగా వుంది! వాడికిచ్చిన దానికి రెట్టింపు కావాలన్నట్టు.... అది తెలిసినట్టుంది...నాకో కన్ను పోవాలని కోరుకున్నాడు. యింకేం? రెట్టింపు ఫలితం రెండోవాడికి తప్పలేదు. స్కూలుఫైనలు వాళ్ళు చేసే ఉద్యోగంలో ఎప్పుడాన్ని నేను ప్రవేశించాను. జీతం వొందేనా లేదు! అరుణ మనసుపడి కోమటి గుమాస్తా పనిలో చేరితే, పట్నం మోజుతో ఎనభై రాళ్లకి నేనొచ్చి చేరాను. పైగా యీ ఆకారంవొదల్లేదు సరికదా; హిరణ్యకశిపుడు విష్ణువు మీద పగపట్టి యెంతమనస్తాపం అనుభవించాడో, అంతగా నేనూ అనుభవిస్తున్నాను. అతనికున్నశక్తి నాకులేదు; యింతే తేడా!.." మనసులో క్షోభపడుతూ ఆఫీసు పని చూస్తోంది.

ఆలోచిస్తోన్న సుశీల హిరణ్యకశిపుడ్ని పోల్చుకుంటోంది. అయితే పరిణామమేమైందో, ఫలితం ఏమిటో ఆమెకి తోచనేలేదు. ప్రవాహంలో యెదురుగా ఈదినా, వాలుగా ఈదినా, ప్రవాహంతో కలిసి పోవలిసిందే! ఎదురీదేవాడికి ప్రయాస మిగులుతుంది. అలాగే భగవంతుడ్ని ప్రేమించినవాళ్ళూ ద్వేషించినవాళ్ళూ కూడా కైవల్యం పొందారు. తేడా యేమంటే; ద్వేషించినవాళ్ళు ప్రజల కంటికి మృగాల మాదిరి కనిపించేవారు. అయితే, ద్వేషించిన వాళ్ళుకూడా ముక్తిని పొందడం ఆశ్చర్యంగానే ఉండో

చ్చును. ఈ ద్వేషించినవాళ్ళు యెప్పుడూ తమ ద్వేషానికి గురైన వస్తువునే, తమకి ప్రబల శత్రువైనవాణ్ణే, వాడి ఆకారాన్నే తలుచుకుంటూ ఉండేవారు. ఈవిధంగా రూప ధ్యానాలే వాళ్లకి ముక్తినిచ్చింది...ఆ విషయం తెలియకనే సుశీల తన ద్వేషాన్ని ఆ రాక్షసుడి ద్వేషంతో పోల్చుకుం టూంది..'ఫలితం ఇలాటిదని తెలిస్తే యేం జేసేదో! దాన్ని బట్టి ద్వేషించడం అంటే ప్రేమించడంలే అని తెలిస్తే ఈ పాట్లెందుకూ?

## ౨౮

రాజమండ్రీలో అరుణ లక్ష్మితో ఎంతో అవస్థపడ వలసినవాడు, యాదృచ్ఛికమైన కొన్ని కారణ సందర్భాల ప్రభావంచేత ఓ విధంగా తేలికగానేజీవితంగడిపేస్తున్నాడు. సుశీల యింటినుండి వచ్చి ఆల్కాటుతోట ప్రాంతంలో ఉంటూండగా, రెండుకోజుల తరవాత, లక్ష్మికి కంటిలో నలకపడ్డం మూలంగా కన్నెర్రపడి, రెప్పలువాచిపోయాయి. దాపులోవున్న లేడీ డాక్టరు దగ్గరకి పంపించాడు అరుణ. "అక్కడ నొక్కకూడదు, తల్లీ. మందు వేస్తే చల్లగావుం టుంది. తగ్గిపోతుంది. మంచిపిల్ల వంటూయకూడా" అని చెప్పి పంపించాడు. అందుకే లక్ష్మి యేడవలేదు. అయినా, ఆ పది నిమిషాల్లోనూ వాతావరణం చూసి, ఆ డాక్టరు వృత్తి

మీద అసహ్యంచూపింది. "నాన్నా, అమ్మదగ్గిరి కెడితేనో! కళ్ళు నయం అయ్యాక మళ్ళీ వచ్చేద్దాం, యేం ?"

"అమ్మ మొన్న లండ నెళ్ళిందిగా! సుబ్బి చెప్పింది విన్లేమూ ?"

"లండనా ? యెందుకూ?...ఆ డాక్టరమ్మలా చదువు తుందా ?...నాన్నోయ్! యేడుస్తున్నా వినకుండా చెయ్యి గట్టిగా పట్టుకుని, సూది గుచ్చేసింది, నాన్నా!..యింకా, అక్కడేం చాకులూ కత్తులూ యెన్నో వున్నాయ్! కోస్తా రటగా !... అయితే, అమ్మకూడా యిదే చదవటాని కెళ్ళిందా ?...వొచ్చాక అందర్నీ సూదులు పొడుస్తుందా? అలాగైతే వొద్దు నాన్నా! అమ్మ మన కొద్దు..." ముఖం నిండా భయం ఆవరించుకుంది. యెర్రగా కందిపోయింది. చెమటపట్టినంత పనైంది. తండ్రి వొడిలోకి నెమ్మదిగా చేరింది.

"ఈ విషయాలన్నిటినీ గమనించకపోటంచేత అరుణ అన్నాడు లాంఛనంగా, "మరి, వొస్తానంటోంది. యేం చేద్దాం ?"

"వొద్దు నాన్నా! రావొద్దని రాసెయ్. మనకి అమ్మా వొద్దూ యెవరూ వొద్దు. తాతగారొచ్చాక, తాత గారికి వెళ్ళిపోతానంతే!" ఏడుస్తూ చెప్పింది. అప్పుడు చూశాడు ఆమె యెంతగా భయపడుతోందో? "అట్లాగే, రావొద్దని రాస్తున్నానులే; నువ్వెక్కడికీ వెళ్ళొద్దు. మరి,

నాతో ఆఫీసుకు రావా ?... అక్కడ నీకు బాగానే వుంటుం దిగా ?''

లక్ష్మిని ఒప్పించి, ఏడుపు మాన్పించటానికి, ఉత్తరం రాస్తోన్నట్టు వో చిత్తు కాగితంమీద కలం మోపి నటించాలిసొచ్చింది. లక్ష్మికోసం ఒకదాసీని కుదిర్చాడు. స్నానం చేయించడం, బట్టలు తొడగటం, పిల్లని తీసుకుని ఆఫీసులోనూ, గ్రేడింగు హాలుపక్కనున్న క్రికెటుమీదుగా ప్రదక్షిణాలు చెయ్యడం; యింటి పనులుచేసిపెట్టడం, హోటలునుండి కాఫీ ఫలహారాలూ, కారియర్లూ, మొయ్యటం, యివి ఆమె బాధ్యతలు. తనకింకా కావాలంటే ఆఫీసు నౌకర్లుండనే వున్నారు.

అరుణకి యిన్నిసుపేటలోవున్న సుశీల యింటిని గురించి దృష్టేలేదు. అప్పుడప్పుడు సుబ్బివొచ్చి చూసి పోతోంది. ఆఫీసులో ఉండగా గంటకోసారైనా లక్ష్మిని చూస్తాడు అరుణ. కంటికిరెప్పలాగ పాపకంటే మక్కువగా పెంచుతున్నాడు. 'విశేషా లేమిట'ని అడుగుతాడు. చూసినవింత అడిగి తెలుసుకుంటాడు. లక్ష్మి ఆశ్చర్యంగాచెప్పిన సంగతులన్నిటినీ అంతకంటె ప్రీతిగా వింటాడు. ఇంత హోదాలో వున్నా, అరుణకి తండ్రినుంచీ ప్రతినెలా డబ్బు వొస్తూనే వుంది. మూడునెల్లకోసారొచ్చి లక్ష్మిని చూసి వెళ్ళేవాడు ముసలాయన. యిప్పుడు ప్రతినెలా తనేవొచ్చి డబ్బిచ్చి పోతున్నాడు. డబ్బివ్వడం పేరుతో లక్ష్మినిచూసి పోతూంటాడు. రెండేసి రోజులున్నందువల్ల ఆయన మమకారం పెరుగుతోంది కాని, మోజు తీరటంలేదు. ఇంతాచూస్తూ

వుండికూడా వెంకటప్పయ్యగారు సుశీల వివాహాలడిగేవారు కాదు. అసలామె ప్రసక్తి ఎప్పుడు తెచ్చేవాడుకాదు. ఆది నుండీ ఆ సంబంధమంటే ఆయన కెందుకో అనుమానం; దాని మూలంగా కొడుకు స్థితి పాడైపోతుందనే భయం! అందుకే తొలిగి సంచరిస్తూవుండేవాడు. యింకో ఆరునెల్లు హెడాఫీసులో ట్రైనింగు ఇచ్చి అరుణ జీవితంలో ఏదో మార్పు తెచ్చారు. సుశీ కొత్త ఆర్డర్లొచ్చాయి; 'ఒక సంవత్సరం వరకూ కలకత్తా హెడాఫీసులో పని జెయ్యవలసింద'ని. 'అదృష్టం' అనాన్న రంతా.

ఆరొందల జీతంతో హెడాఫీసులో ట్రైనింగు తీసుకుంటున్నాడు అరుణ. అతనికి కంపెనీ తాలూకు అన్ని బ్రాంచీల బాపతు రికార్డ్సు యిచ్చారు. మొదటగా బ్రాంచీలలోవున్న లేబర్ అందుకుసంబంధించిన వివరాలూ పరిశీలించి, దానిమీద తన అభిప్రాయం వెల్లడించాడు. తరవాత బ్రాంచీల ఆఫీసులూ, వాటి పుట్టుపూర్వోత్తరాలూ లావాదేవీలూ పరిశీలించాడు. సరుకు కొనుబడి, అమ్మకం, మార్కెట్టు పరిశీలన, అవసరపరికరాలయేర్పాట్లూ మార్పిడీ స్టోరు విధానాలు, పెట్టుబడులూ, బ్యాంకి సంబంధాలూ, సంస్థ హక్కులో వుంటున్న ఆస్థిపాస్తుల వివరాలు, కొత్త కంట్రాక్టులూ, అగ్రిమెంటులూ సమగ్రంగా పరిశీలించి; వాటిపైని తన కేర్పడ్డ అభిప్రాయాలన్నిటినీ క్రమంగా థీసిస్ రాసి పడేశాడు. నిజంగా సంస్థ బాగుపడటానికి అతడెన్నో సూచనలుచేసి, వాటికి కారణాలు నచ్చచెప్పాడు. అతని రీసెర్చి మోనోగ్రాఫ్‌ను సంస్థ ఆదరించింది. అందుకే అతడిన్ని

ఆంధ్రా జోన్‌కు జనరల్ మానేజర్‌గానూ, జోనల్ రిప్రజం టెటివ్‌గానూ నియమించారు. బెంగాలులో అతడు గడిపిన సంవత్సర జీవితం అతనిలో పెద్ద మార్పును తెచ్చింది. వాతావరణంతో లక్ష్మికూడా మారిపోయింది.

వెంకటప్పయ్యగారు యీ యేడాదంతా ఏడెనిమిది సార్లువెళ్ళి వొచ్చారు. కేవలం లక్ష్మిని చూడ్డానికి వెడుతూ, పట్టణం తాలుకు పొలిమేరలన్నీ తిరిగి తిరిగి యింటికి చేరు కునేవారు. అరుణలో వస్తున్న మార్పునుచూసి ఆనందిం చారు; అతని హోదాకి తాను గర్వపడేవాడు. అతని తెలివి తేటల పరిధిని అంచనా వెయ్యలేక, మొదట తాను పొందిన అభిప్రాయానికి నొచ్చుకుంటూండేవాడు. ఐనా, ప్రతి నెలా రెండొందల రూపాయలు అరుణకి ముట్టజెబుతూనేవున్నారు.

ప్యాంటూ షర్టూ విడిచిపెట్టి అరుణ నెమ్మదిగా పంచకట్టు లాల్చీ పైమీదకండువా అలవాటుచేసుకున్నాడు. లక్ష్మికి పట్నం గాలిసోకి పేషన్లు అలవడ్డాయి. గుడ్డలు నలగటాన్నికూడా ఒప్పుకోనేదికాదు. మూడు సంవత్సరాల పిల్ల ముచ్చటగా బెంగాలీ మాటలుకూడా జారవిడుస్తోంది. కిండర్ గార్డన్ విధానంలో ఆమెకి చదువుకూడా సాగు తూంది. యిక శుచికీ శుభ్రానికీ విరామంలేకుండాపోయింది. "నాన్నా నీ జేబులోవున్న దస్తీ ఉదయం తీసుకున్నది; ఈ పాటికి మాసిపోయి వుంటుంది, దాన్ని తీసేసి యింకోటి వేసుకో"మని సలహా యిస్తుంది. అరుణ నవ్వుకుంటాడు.

అరుణని మార్కెట్ ఇన్వెస్టిగేటర్‌గా అమెరికా పంపించారు సంస్థవారు. విదేశపు భత్యం నెలకివందడాలర్లు,

జీతం రెండువందల డాలర్లు, ఆఫీసు మైంటెనెన్సు చార్జీలు యిస్తున్నారుకూడా. అక్కడో సంవత్సరం గడిచింది. అమెరికా ప్రభావంవల్ల చక్కని సూటువేసుకోటం, యిచ్చిన ప్రోగ్రాము ప్రకారం, అనుకున్నటైములో పనులకు హాజరు కావడం బాగా అలవాటైంది. లక్ష్మికి అమెరికన్ యింగ్లీషు కూడా పట్టుబడింది. శరీరంతో భాషకూడా ఐక్యమై తెల్ల వాళ్ళ పిల్ల అనిపిస్తూంది, చూసేవాళ్ళకి. వాళ్ళు అమెరికాలో వున్నంతకాలం వెంకటప్పయ్యగారు వెళ్ళలేక పోయారు. ఐతే, అందుకు బదులు ప్రతివేలా లక్ష్మిఫొటోలు రెండో మూడో అరుణ పంపిస్తూ వుండేవాడు. మోటార్లూ జీపులూ డ్రైవ్ చెయ్యడం, ఫొటోలు తియ్యడం అభ్యాసం ఐపోయింది.

అమెరికాలో వుంటూ, అరుణ ఒక్కొక్క ప్లాను పంతంపట్టి మార్కెట్టును స్తంభించిపోయేస్థితికి తెచ్చేవాడు. ఆ విధంగా అతడంటే, అమెరికా మార్కెటీర్లకూ, సూపర్వైజర్లకూ, భయం గౌరవంకూడానూ! అరుణని తమవైపు తిప్పుకోవాలని యెన్నో కంపెనీల వాళ్ళు ప్రయత్నించారు కూడా. అతడు దేనికీ లొంగలేదు. "మా కంపెనీ, మాకు సరైన జీతాలివ్వక పోతేకదా, తప్పుదార్లు పట్టేదీ" అని జవాబిస్తూ వుండేవాడు. తన సంస్థవారికూడా భయమే 'యింకో కంపెనీలో చేరిపోతాడమో' అని! ఆ పరిస్థితిని ఆ గౌరవాన్ని అదే రకంగా నిలుపుకుంటూ వొచ్చాడతను.

అక్కడ్నించీ అరుణని యిండియాకి పిలిపించి, ఒంగోలు హెడ్క్వార్టర్సుగాచేసి, ఆంధ్రా జోన్కి రిప్ర

జెంకెటీవ్‌గానూ, ఆంధ్ర బ్రాంచీల జనరల్ మానేజరు గానూ చేశారు. అతడూ సుశీలా విడిపోయిన రెండున్నర సంవత్సరాల్లో యెంత మారిపోయాడో అతనికే ఆశ్చర్యం! సుశీల అసలు నమ్మదుకూడా !

యజ్ఞం కోసమనిన లాక్కొస్తున్న మేకపిల్లని చూసి అందరూ నవ్వుకున్నట్టు అరుణని చిన్నప్పట్నుండీ తెలివితక్కువవాడు అనే గుర్తింపుతో వెలేసివారేస్తే, చేసేది లేక ఆ తండ్రి, మనసులో వ్యథని పైకిరానియ్యక, అతడి కేది కావాలంటే దాన్ని యిస్తూ, యేది యిష్టమంటే దాన్ని సమకూరుస్తూ, దైవాధీనం బస్సు సర్వీసు సాగించాడు. యిప్పటికీ, తన వంతుగా నెలకి రెండొందలూ పంపడం మానలేదంటే !

అలాటి అరుణ యిప్పుడు తిరిగి తెలుగు గడ్డ మీది కొచ్చాడు. ఒంగోలులో అతని బంగాళా. కార్మికుల, కర్మచారుల నివాసాలులూ, ఆఫీసులూ, ఫ్యాక్టరీహాల్లూ స్టోర్సూ, వేర్ హౌసూ, లేబర్ సెంటర్, కాంటీన్, క్లబ్బూ, ప్లే గ్రౌండూ, ప్రోవిషన్ స్టోర్సూ అన్నీ ఆ బౌండరీ లోపలే వున్నాయి. ఒంగోలునుండి బిట్రగుంట వెళ్ళేతోవలో యీ కంపెనీ((ఐ. యల్. టి. డి) భవనాలూ ఆఫీసులూ వున్నాయి. "ఇక దానికి కావలసిన పరివారంలో వ్రుమన్ వెల్ఫేరూ, లేబరు అర్గనైజరూనూ. యీ రెండు పదవులకీ కలిపి ఒక్కరనే నియమిస్తే బాగుంటుంది. అందుచేత క్వాలిఫైడు కాండి డేట్ (అభ్యర్థి) దొరికితే బాగుండును. ఆరువందల జీతం

మీద నియమించవచ్చును." అంటూ హెడ్ క్వార్టర్స్ పరిశీలనమీద తన సిఫారసును హెడ్డాఫీసుకు పంపాడుఅరుణ. అతని సిఫారసు వెంటనే మంజూరైంది.

. .

## ౨౯

మద్రాసులో వున్న సుశీల తన సెక్రెటరీ అరుణను చూస్తూ, తను ద్వేషించిన రూపానికి అణిగి, ఆ మూర్తి యిచ్చే ఆజ్ఞల్ని శిరసావహిస్తూజీవించటం చాలా దుర్భరం అనుకుంది. ఆమెని గురించి తెలుసుకోవాలనుకుంది. వోనాడు తీరిక చూసి అడిగేసింది కూడా. "మీ యింట్లో యెవ్వరూ వున్నట్టు తోచదు! తలిదండ్రులో లేక తమ్ముళ్లూ, చెల్లెళ్లూ యెవరైనానూ.... యిక్కడగాక యెక్కడేనా వుంటున్నారా యిన్నాళ్ళయింది నే నొచ్చి, యిప్పటివరకూ యెవరూ వొచ్చినట్టు లేదు" !....యేమో అడగాలనుకుంటూ నసుగుడు మొదలెట్టింది.

"అమ్మాయ్! నీకు తాత్కాలికంగా ఉద్రేకాలు కలుగుతుంటాయని, సరోజ చెప్పింది. అనవసరపుటాలోచన్లు చేస్తుంటావని అర్థమౌతుంది కూడా. ప్రపంచంలో ప్రాజ్ఞత కలిగిన తర్వాత తల్లీ, తండ్రీ, అన్నా, తమ్ముడూ, యిలాటి వాళ్ళు కలాటివాళ్లూ... యిదంతా వొట్టి భ్రమ! యెవరూ

వుండరు! వుండరంటే, నిజంగా వుండరని కాదు. వున్నా వాళ్ళకి మన భావ సంస్కారాలుండవు. అందుకే వాళ్ళు మనకూ, మనం వాళ్ళకూ పొసగటం అసంభవం!....ఇలాటి పిచ్చి ఆలోచన యెన్నాళ్ళనుండి చేస్తున్నావ్? యెందుక్కలిగింది?....చూడూ, మన వ్యవస్థయొక్క వుద్దేశాల్ని మనసులో పెట్టుకుని చెబుతున్నాను. నీకు పెళ్ళయిందని విన్నాను. ఆస్థి వున్నట్టుకూడా తెలిసింది. వాటికి సంబంధించి లక్షణాలు నీలో కనిపించటంలేదు. ఆలోచించు. అంతఆస్థి వుండీ, నీకీ వుద్యోగం ఎందుకూ! పైగా స్కూల్ఫైనల్ పాసు చేసీ వుద్యోగంలో చేరావు. బ్రతుకుతెరువు లేక, చదువుకునీ గూడా ప్రయోజనం లేక తిరిగేవాళ్ళ మార్గానికి అడ్డే కదా! యింకా చెప్పాలంటే: పెళ్ళయినదానవు. నీవాళ్ళొచ్చారనో, భర్త వొచ్చాడనో, వొక్కసారీ శలవు గాని పర్మిషను గాని అడగలేదు; రాలేదు గనక! యేంవని నిన్ను నీవే అడిగి, జవాబు రాబట్టుకో; అది నీ తరం కాదు.... 'పిచ్చి ఆలోచనల్లో కాలం వ్యర్థం చేస్తావు. యిప్పటికి ప్రోగ్రెస్ రిపోర్టు రాయటం అలవాటవలేదు! యే సభలోనూ మహిళల ప్రశ్నలకి సరైన జవాబులు చెప్పలేదు....యేదో సరోజ చెప్పింది కదా అని నిన్నింకా ఉంచాను లేకుంటే మొదటి నెలాఖరులోనే పంపించేసి వుండేదాన్ని....అందుకే చెబుతున్నాను. యిది మహా పట్నం. అనేక దుర్వ్యాపకాలకి పుట్టినిల్లు. అహంభావంతో వున్న ఆడది యీ ప్రాంతాల్లో తిరగటం నిజంగా ప్రమాదం! కాబట్టి, తోచినట్టు అనుమానించటం మానేసి, యిప్పటికీ నీ విధీ బాధ్యతా అలాటివాటిని పట్టిం

మకో యీ చొప్పదంటు ప్రశ్నలు అడగనూ వొద్దు; ఊక దంపు జవాబులు వినిపించుకోనూ వొద్దు. వెళ్ళి నీ పని చూసుకో!'' చల్లగా చీవాట్లు పెట్టి పంపించేసింది, అరుణ. కాలంతోపాటు అరుణలో మార్పు లొస్తున్నాయ్ కాని, సుశీలలో యేమీ మార్పు లేదు. అరుణ ప్రైవేటుగా యల్ యల్ బి ప్యాసైంది. సుశీల ఆఫీసు పనుల్లో మెలకువే తెలిసి కోలేదు.

రెండు సంవత్సరాల్లో యిద్దరూ సన్నిహితులయ్యారు. యే విగ్రహంమీద ద్వేషంతో వచ్చేసిందో అలాంటి విగ్రహం చెప్పుచేతల్లో నలగవలసొచ్చి, యిక దారిలేక, ఆరూపముతో స్నేహం చేసింది సుశీల. ఆమెలోవున్న వ్యథని అర్థంచేసుకోలేక పోయింది. ''యీమె కూడా దగాపడిన మనిషే'' అనే భావంతో సన్నిహితంగా జరిగింది అందుకే, ఒకరి విషయమై యింకొకరు పట్టించుకుంటున్నారు. ఇంతకీ అరుణకు సుశీలపైని జాలి మాత్రమే!

హఠాత్తుగా పత్రికలో పడిన ప్రకటన తనకి వీలుగానూ, సరైనదిగానూ తోచడంతో అరుణ వెంటనే అప్లికేషన్ పంపింది. అంతటితో సుశీలకి కంగారు పుట్టింది. ''లేబర్ ఆర్గనైజర్ గా అరుణ సెలెక్టౌతుంది, అప్పుడీ సీటులో యింకెవరో వొస్తారు. వొచ్చినవారు నన్ను ఉద్యాసన చెప్పి పంపించేస్తారు. నా పట్టుదల నెగ్గదు. ఓడిపోయి ఇల్లుచేరాలి ముండమోసిన దాసిలా నా కథ మొదటి కొస్తుంది సరికదా నవ్వులపాలైపోతాను. ముఖ్యంగా అరుణ నన్ను అసలు ఖాతరుచెయ్యదు. ఏం చెయ్యాలి?... అన్నట్టు ఆ ప్రకట

నలో దానికి సంబంధించిన ఆఫీసుకు స్టాఫ్ కావలసుందిగా. దానికైనా నేను పనికొస్తానేమో! కనుక్కుంటాను.'' సుశీల మనసంతా వికలమైపోగా, అంతులేని ఆలోచనల అగాధంలో యీదలేక, కొట్టుకుపోడానికి యిష్టంలేక అల్లాడిపోతోంది.

ఆమె ఆలోచనలు ఆ విధంగా ఊగులాడిపోతోం డగా అరుణకు అర్థరొచ్చింది వెంటనే ఆమె వెళ్ళి ఒంగోలు ఆఫీసులో కావలసిన ఏర్పాట్లు చూసుకోవాలని ప్రయాణ సన్నాహాలు చేస్తోంది. సరిగ్గా అప్పుడే సుశీలవచ్చి తన విన్నపం తెలుపుకుంది. "మీరు వెడుతున్నారు, సంతోషమే గాని నామాట మరిచిపోతారేమో?.... మీరున్నారనే ధీమాతో యిన్నాళ్ళూ యిక్కడుండగలిగాను. మీరు లేకుంటే నేనేమయ్యేదాన్నో ఊహించుకోలేను... అందుకే చెబుతున్నాను. నన్ను కడుపులో పెట్టుకోగలిగినవాళ్ళెవరూ లేరు, మీరుతప్ప! ఇప్పుడుకూడా నన్ను దృష్టిలో పెట్టుకుంటారని ఆశపడి అడుగుతున్నాను... కాకుంటే...'' సుశీల కంఠం బొంగుపోయింది. మాట పెకిలి రావడంలేదు. ఏమీ చెప్పలేకపోయింది. అరుణ వారించి ఊరుకోబెట్టింది. లేకపోతే సుశీల చిన్నపిల్ల మాదిరిగా ఏడుస్తుందని! "అలానే ముందుగా వెళ్ళి అక్కడి పరిస్థితులు తెలుసుకోవాలిగా; నా శక్తి వంచన లేకుండా నీ పక్షాన ప్రయత్నం చేస్తాను, సరేనా?... పిచ్చిపిల్లా, అలా బెంబేలుపడి ఏంచెయ్యగలవ్? ధైర్యంగా ముందుకుసాగాలిగానీ! నాకు చెప్పావుగా, సరే తప్పక ప్రయత్నిస్తాను.'' ధైర్యంచెప్పి, ఆమెలోవున్న బెంగ తాత్కాలికంగా అణిచివేసింది.

"ఉద్యోగం లేకపోయినాసరే, నా ఖర్చులు భరించు కుంటూనైనా వొచ్చి మీతో గడిపేస్తాను. ఇదే నా నిర్ణయం!" తన మనసులో కర్తవ్యాని కింతకంటే పరమార్థం లేదన్నట్టు చెప్పేసింది, సుశీల.

# ౩౦

ఒంగోలు ఐ. యల్.టి. డి. హెడ్డాఫీసులో "ఆనాడే సెక్రటరీ వచ్చి చేరుతుందనీ, ఆఫీసు స్టాఫ్ అంతా యెవరి స్థానాల్లో వాళ్ళుంటూ జాగ్రత్తగా పనులుచూసుకోవలసిం దనీ" అరుణ తెలియజేశాడు.

సెక్రటరీ సరాసరి జనరల్ మానేజరు ఆఫీసులోకి వెళ్ళింది. చూస్తూనే ఆశ్చర్యంగా "తమ్ముడూ" అంది. "అక్కా" అన్నాడు అంతకంటె ఆశ్చర్యపడుతూ. "ఎవరు నాన్నా ఈ యక్క" అనడిగింది లక్ష్మి. 'మనక్కే' అన్నాడు క్లుప్తంగా.

అప్పటినుండీ లక్ష్మి ఆమెని 'అక్కా' అనే పిలుస్తూంది. జనరల్ మేనేజర్ మిస్టర్ అరుణ గారూ, లేబర్ ఆర్గనైజర్ మిస్ అరుణగారూ చలామణీ అవుతున్నారు. ఆఫీసు వుద్యోగులకుగాని, పనివాళ్ళకిగాని 'వీరి సంబంధ మేమిటో' 'ఎవరేమవుతారో' తెలియనే తెలియదు, అసలే

దమ్ముల్లేవు. వాళ్ళందరికీ భయంకంటే భక్తే యెక్కువ! దానికో కారణం వుంది. యెవరైనా తప్పుచేస్తే వాళ్ళని మందలిస్తారు. పనిచేసే పద్ధతిని పరిశీలించి, సవరణజేసి నేర్పు తారు. అంతేగాని, నౌకరీనుంచి యెవ్వరినీ తీసే ప్రయత్నం చెయ్యరు. అందుకే అంత వినయంగా పనిచేస్తారంతా!

'ఏ' బ్లాకు బిల్డింగులో జనరల్ మేనేజరు, ఛీఫ్ కాషియర్, సూపరింటెండెంటు, ఫ్యాక్టరీ సూపర్వైజర్, వారి వారి బృందం పనిచేస్తూంటారు. 'బి' బ్లాకులో వర్క్స మేనేజర్, లేబర్ సూపర్వైజరు, ఆర్గనైజరు, టొబాకో బైయరు, వెల్ఫేర్ ఆఫీసరు, వారి బృందం పనిచేస్తూం టారు. అదే విధంగా వాళ్ళ నివాసాలు కూడా వున్నాయ్. 'ఏ' బ్లాకు బిల్డింగ్స్‌లో డిపార్టుమెంటల్ హెడ్సు, 'బి' బ్లాకులో ఆఫీసు పరివారం, 'సి' బ్లాకులో లేబరు సెక్షనుకు సంబంధించిన పనివాళ్ళూ వుంటారు.

అక్కా తమ్ముళ్ళు ఓకేచోట పనిచేస్తున్నా, ఒకే యింట్లో యెందుకు వుండడంలేదో అనే అనుమానమైనా లేదు వెంకటప్పయ్యగారికి. ఆయన కా పట్టింపులేదు. చిన్న పిల్ల కులాసాగా వుండటం మాత్రమే ఆయనకు కావలసింది. ఇప్పటికీ అదేరకంగా డబ్బు పంపిస్తూ వుంటాడు; రెండు నెల్లకో మూడు నెల్లకో ఓసారొచ్చి చూసిపోతాడు, యింతే!

అరుణ ఒంగోలుచేరిన నెలరోజులకో ఉత్తరం సుశీల దగ్గరనుండి చేరింది. "మీరు వెళ్ళినప్పటినుండి, నేను సరిగా ఆఫీసుకు హాజరుకాలేక పోతున్నాను. నాగురించి ప్రయ

త్నిస్తా నన్నారు. కాని, యింతవరకూ ఏ జాబూ చేరక పోటంచేత ఆఖరిసారిగా నా ఉద్దేశం తెలుపుతున్నాను. వారం రోజుల్లో నేను బయల్దేరి వొస్తున్నాను. అక్కడ మీా ఆఫీసులో కాకుంటే ఒంగోల్లో లం కెక్కడైనా యితర స్థలాల్లో పనిచేస్తాను. పనిలేకపోయినా సరే; నా ఖర్చులు భరించుకుంటూ వుండదలిచాను. ఇట్లు, మీా సుశీల" ఇది లేఖా విజ్ఞాపనం. దీన్ని మిస్ అరుణ చదువుకుని, తమ్ముడి కిచ్చింది, "చూడమ"న్నట్టు. ఆ జాబును చదివిన అరుణ, చివర సంతకం చూసి నిర్ఘాంతపోయాడు. 'దస్తూరీ ఆమెదే! అయితే, యీామెతో యెంత కాలంనుంచీ పరిచయం' అని తనలో తర్కించుకున్నాడు.

"ఎవరీమె?... యిలా రాస్తుంది; అంత పెద్ద పరిచయమా?" ఆమె తన సుశీలే అనే విషయం నిర్ణయించుకోవాలన్నట్టు, అడిగాడు.

"ఈమెది రాజమండ్రి రెండున్నర సంవత్సరాల క్రితం వొచ్చి నాదగ్గర వుమన్స్ వెల్ఫేర్‌లో పనిచేస్తూ వుంది. పాపం! అనౌసరపు టాలోచనలూ, అతి భావాలూ మధ్యపడి నలుగుతూ వుంటుంది... పని తెలియకపోయినా, యెందుకో జాలేసి ఆమె పొరపాట్లు దిద్దుతూ యింతవరకూ ఆ నౌకరీకి భంగంలేకుండా చూశాను... చూశావుగా వుత్తరం!... అక్కడ తనొంటరిగా వుండలేనంటోంది. అసలు నన్నొదిలి వుండలేని స్థితికొచ్చింది తన ఖర్చులుతనే భరిస్తూ యిక్కడుంటాననంటోంది.... వీలుచేసుకుని యీామె

కేదేనా తగినపని కల్పించాలనుంది యిక నీ ఆలోచనకూడా తీసికో" అర్ధోక్తిలో మింగేసింది అరుణ.

మిస్టర్ అరుణ ఆలోచన నోపక్కకి నెట్టేసి, అక్కగారిని చూస్తూ, ఆమె వుద్దేశ్యం అర్థంజేసుకున్న వాడిలా అన్నాడు. "సరే, యేమాలోచించావు మరి? యీమె నేషన్లో ఎంట్రస్టు చేద్దామనీ?" కుతూహలంగా అడిగాడు. ఆమె యిష్టమేనన్నట్టు.

"నే నేమాలోచించనూ! వీలేమైనా వుందో లేదో నువ్వే చూసి చెప్పు"

"సరే, మీ ఆఫీసులో వుమన్ గ్గైడు, క్రీచే ఆర్గనైజరుగా వుంచుకో. యేమైనా ఎదురుదిరుగుళ్ళుంటే. వాటిని మథించుకోవలసిన దానవు నువ్వే అవుతావు. అప్పటికి నీ కోరికా, ఆమెకోరికాకూడా సిద్ధిస్తాయి. మాటిమాటికీ, పొరపాట్లు దిద్దుతూ కూచోవలసిన బరువు నానెత్తిమీద వుండదు. నీ చేతికిందవుంటే, తేలిగ్గా దిద్దుకోగలవు, చెప్పగలవు. యేమంటావ్" సాపేక్షగా అడిగాడు.

"నాదగ్గిర యేసీటు కాళీగావుందనీ, ఆమెకివ్వటానికీ! అదికూడా నువ్వే చెప్పు" తిరిగి అడిగింది.

"అక్కా మనకి లేబరు ఐడ్వేజరు మించింది. అందుకోసం, వుమన్ గ్గైడు క్రీచే ఆర్గనైజరుగా వొకరుండవచ్చును. లేబరు మేన్యువల్ తీసిచూడు, ప్రొవిషనుంది దాని ప్రకారం నీ పనులు జరగటానికి అవసరమంటూ నోట్ పుటప్ చెయ్యి నేను రికమెండ్ చేస్తాను అప్రూవై వస్తుంది దానికి తిరుగుండదు యీలోగా యీమె వొచ్చినా పరవాలేదు. ఆ

సెక్లోకూలేసి, టెంపరరీ ఆర్డర్సు యిస్తేసరి. యింకోటి నీ స్టాఫ్‌ని నువ్వేయేసుకోవాలిగనక, ఆ సౌకర్యం కలగజేస్తుందిలే. కంపెనీ హెడ్ఆఫీసు అడ్డుచెప్పదు." నచ్చజెప్పి, సుశీల తన చేతికింద పనిచెయ్యడానికి వస్తోందిగదా అని సంతోషించాడు.

## ౩౧

అనగా అనగా ఆరోజూ వొచ్చింది. అప్పటినుంచి అరుణకి తలనొప్పి ప్రారంభమైందనే చెప్పాలి. అంటే శ్రీమతి సుశీల ఒంగోలు గోలుమీదికి చేరిందన్నమాట. సుశీల అలవాటు ప్రకారం రెండురోజులు రెస్టు తీసుకుంది. యీమెకి ప్రస్తుతం విడిది మిస్ అరుణ బంగాళాయే. అయితే, మిస్ అరుణదగ్గర పెరుగుతున్న లక్ష్మిని యీగాలి వాసనించి తప్పించి మిస్టర్ అరుణదగ్గరే వుంచారు. లేకుంటే సుశీలకి ఆలోచనపని యెక్కువైపోతుంది; మిస్ అరుణకి వివరించే బాధ్యత కలుగుతుంది; ఆ పిల్లెవరూ యిక్కడెందుకుంటుందీ, తలిదండ్రులెవరూ, అనే సమస్య లేచుకొస్తాయి. అందుకే, జాగ్రత్తపడ్డారు

ఆనాడు మిస్ అయిణా సుశీలకు ఆఫీసు విషయం బోధించింది. "చూడు, సుశీలా. యింతవరకూ లేని నౌకర్ని నీకోసం కొత్తగా సృష్టించారు జనరల్ మేనేజరు. ఆయన చాలా మంచివాడు. నీ అతి భావాలతో ఆయన్ని విసిగించకుండా జాగ్రత్తగా, యికనైనా పనిచేస్కోడం అవసరం. వెళ్ళి ఆయనకి కనిపించి అప్లికేషనియ్యి. తర్వాత 'బి' బ్లాక్ ఆఫీసుకొచ్చేయ్. యీలోగా, నే నోసారి ట్రేడింగు హాల్లోకి పోయి వర్క్ ఎలాట్మెంటును చూసుకుని వొస్తాను త్వరగా వెళ్లు. మళ్ళీ ఆలస్యమైతే లేబరు కాలనీకీ, స్టోర్సుకీ తిరిగొచ్చే వరకూ అను కోసం యెదురుచూస్తూ కూచోవాలి" యింకేం లేదన్నట్లు, వెళ్ళిపోయింది, మిస్ అయిణా. సుశీల టిప్‌టాప్‌గా తయారై జనరల్ మేనేజరు ఆఫీసుకెళ్ళింది. తొందరగా రాత పూర్తిచేసిన అప్లికేషన్ వోచేత్తోనూ, పర్సు యింకో చేత్తోనూ, వీధి భాగవతంలో చెంచులక్ష్మి నడకల్తో, నున్న రెండడుగుల వెడల్పు బాటనీ తానే ఆక్రమించుకుంటూ, వొయ్యారంగా సాగించింది.

ఆఫీసులో అడుగుపెడుతూండగానే జనరల్ మేనేజరు సీట్లోవున్న వ్యక్తి యెంతమంచివాడో అన్నట్లు చూసింది. అయినే పలకరించాడు. అతడుకూడా సుశీలకోసం యెదురు చూస్తూనే వున్నాడుగా! చూసి యేంచేస్తాడు? 'ఆ-ఆ' అంటాడా? అనరు. అయినప్పుడెందుకా యెదురుచూపు? యేమో! బహుశా, యిదేనేమో అనుబంధం! నైవాహికంగా అబ్బిన మనోవైపరీత్యం, కలుగుని సముషంలో తాళి గట్టిన విశేషమిదే కాబోలు! యేమైతేనేం అతడు యెదురు

చూస్తున్నాడు అలా చూస్తున్నట్టు దొరికిపోగూడదు. దానికో వుపాయం. కుర్చీలో చేరబడి కాగితాలో, పుస్తకమో చూస్తూన్నట్టు నటించాలి. పుస్తకం తీసుకుని నటించడం చేతకాదు. అది తన కలవాటుకాబట్టి తేలిగ్గా దొరికిపోవచ్చును. అందుకని న్యూస్ పేపరు తెరిచి చదువుకుంటున్నాడు. అదీకూడా విదేశీ పత్రిక 'టిట్‌బిట్స్' 'మాంచెస్టర్ గార్డియన్' కళ్ళజోడులేని నెహ్రూని, కళ్ళజోడున్న బోసుని యెంత సులభంగా గుర్తుపట్టొచ్చునో, పుస్తకం పట్టుకొన్న అటువానికూడా అంత సులభంగా గుర్తుపట్టొచ్చును. పేపరు తీసుకుంటోన్న సమయానికి సుశీలొచ్చింది. పేపరు తెరిచేలోగా అతని ముఖం యెంత పరిశీలించిందోగాని, అలా చూస్తూనిల్చోడానికే పూనుకుంది.

'ఆమె వొచ్చేసింది. పేపరు సిద్ధంగా పట్టుకోవాలి' అనుకుంటూ తొందరగా తెరవటంలో, కంగారుపడకుండా జాగ్రత పడుతూనే వెనక పేజీల్, దేనికి సంబంధించినదో కంటిన్యుయేషన్ మేటర్ చదివేశాడు. ఓ పేరా చదివి 'నన్ను చూస్తోందా లేదా' అనుకుంటూ అటు చూశాడు. "అరే! ఆమె చూస్తూనే వుంది" అనుకుని, ఆశ్చర్యంగా కనుబొమ తెత్తాడు. "మనిషికొంచెం బండబారింది"! అనుకున్నాడు. ఇంకా చూస్తూకూర్చుంటే, ఏమనుకుంటుందో" అని పలకరించాడు. పలకరించడంకూడా నోటిమాటగా కాదు, సంజ్ఞ చేస్తూను.

సుశీల గతుక్కుమంది తనలో! దగ్గరకొచ్చి అప్లికేషన్ నిచ్చింది. అప్లికేషను తీసుకుని "సుశీల; అంటే మిస్ అటువా

చెప్పింది. "నీగురించేనా" అని. పలకరించాడు "ఔనండి" అంటె నమస్కరిస్తూ. మనసులో మళ్ళీమద్రాసు చూస్తోంది. ఆవేళ అక్కడ జరిగినంత పరీక్షా యిప్పుడిక్కడా జరుగుతూంది. పైగా యీకూర్చున్నది మొగాడే! పోలికల్లో యేమీ తేడా లేదు. తన అరుణకీ సెక్రెటరీ అరుణకీ యే తేడాలున్నాయని అంచనా వేసిందో ఆతేడాలన్నీ యితనిలో ప్రత్యక్షంగా సర్దుకున్నాయి. వాటినే నెమరేస్తోంది.

"యేమిటీ? ఇక్కడేదైనా నౌకరీ ఖాళీగావుండొచ్చుగాబట్టి దరఖాస్తు చేస్తున్నానా! వుంటేమాత్రం నీకోటివ్వాలని అనుకుంటున్నావా? ఇంతకీ యేనౌకరికి దరఖాస్తు చేస్తున్నావో అందుకు నీకుండే అర్హతలేవో సూచనైనా చెయ్యకపోతే యేనౌకరీ ఇవ్వాలి! ఇది నీదస్తూరీ అని తెలుసుకొంటే డిస్పాచ్ క్లర్కుగా వేసుకోవచ్చును. అదీ ఖాళీగాలేదు! యేఆధారంతో నీకు నౌకరి ఇవ్వాలో కొంచెం సలహా చెప్పగలవా!" యెటకారంగా మాట్లాడించాడు.

"ఛీ! వెధవనౌకరి" అనిపించింది సుశీలకి ఆలోచిస్తూంది. "కొద్దితేడాలోవున్న అరుణతో యిన్నాళ్ళాగడిపాను. తేడాలేదనుకున్న అరుణవోవైపు, తేడావుందనిపించిన అరుణ ఇంకోవైపు వుండగా అవే ఆకారాలమధ్య వికారం లేకుండా అద్దాల మేడలో నడిచినట్లు నడుచుకోవాలి వొచ్చింది. యిది నాకు కఠినశిక్షా లేకపోతే. అసలు శిక్ష యీనాడు మొదలైందా? యింకా ఆలోచిస్తూనేవుంది. అసలు జవాబే చెప్పలేదు' నీళ్ళు నమిలేసిందంతే. "సరే అలాకూర్చో" అంటూ అరుణే సుశీలను మళ్ళీపలకరించాడు.

ఆమె యింకా, భావనా ప్రపంచంలో యీదులాడుతూనేవుంది. యింతలో అరుణ టైపిస్టుని పిలిపించాడు. కొన్ని వివరాల్ని రాసిచ్చి, దానితో సుశీల అప్లికేషను కూడా కలిపి యిచ్చాడు. పదినిముషాల్లో టైపిస్టు మూడు నాలుగు కాగితాలు తీసుకొని ప్రత్యక్షమైంది. వాటిల్లోంచి వోకాగితంయిచ్చి "దానిమీద సంతకం చేసియ్యి" అన్నాడు. సుశీల చూచింది. అది తనుయిచ్చుకోవలసిన దరఖాస్తు. మంచి పద్ధతిలోవుంది. తానురాసినదానికీ దీనికీ యెంతో తేడావుంది. వెంటనే సంతకంచేసి యిచ్చింది.

"యిదుగో, నీ అపాయింటు మెంటు ఆర్డరు. 'బి' క్లాసు ఆఫీసులో నీ సీ.ఐ. నీకు నూట పాతికరూపాయల కంటే ఎక్కువ మంజూరు కాదు. ప్రస్తుతానికి యిదితీసుకొని సంతకంచెయ్యి" అంటూ మొదట ఆర్డరు, తరువాత డ్యూటీ సబ్మిషన్ రిపోర్టు యిచ్చాడు. సబ్మిషను సంతకం చేసియిచ్చేసింది. లేచి నమస్కారంచేసి వెళ్ళిపోయింది. అరుణకి అప్పుడు ఆమె పరిస్థితికి జాలేసింది నిజంగా!

తన సీట్లో కూర్చున్న సుశీలకి ఆలోచన్లే ఫైళ్ళు, ఊహగానాలే రిపోర్టులూ అయిపోయాయి. పాలోచనగా ఆర్డరు చదువుకొంది. ఆదుర్దాగా చివరి సంతకం చూసుకొంది. 'వి అరుణ; యల్ సిసి; యఫ్ సిఐ, యమ్ యస్ ఏఏ, ఏఐసిడబ్ల్యూఏ జనరల్ మేనేజర్ రిప్రజెంటేటివ్ ఆంధ్రాజోన్, ఐ యస్ యల్ టిడి' అనివుంది. "యిదికూడా అదేపేరు! పూర్తిగా అదే పేరు. ఇక యీడిగ్రీలూ!, యేమో, అంతా మాయగా భ్రమ పెడుతున్నాయి. — అన్నప్పుడు యింత ధీమాగా మాట్లా

డం అతనికి చేతకాదు. యీసూటూ కోటూ అలవాటేలేదు. పైగా యిన్ని పరీక్ష లెప్పుడు చదివాడబ్బా! — ఈయన చేతిలో, విదేశీ పత్రికలున్నాయి. అతనికి పత్రికలుచదవ టమే అలవాటులేదు. అయినా ఈ యీకారం!" ఒక అరుణ నొదిలేస్తే యిద్దరరుణలు నాకు దాపురించారు. నామీద భగవంతుడికిగూడ శత్రుత్వం వుందేమో! లేకుంటే, యిదేం జీవితం! యిప్పటికి పరిచయం వున్న ముగ్గురుఅరుణల్లో యింతితవ్యత్యాసమా! పైగా, అసహ్యించుకుంటున్నందుకు నాముఖం ముందరే యిన్ని ఆకారాలా? — — —

ఆలోచిస్తూ కూర్చున్న సుశీలని మిస్ అరుణ పలక రించింది "మళ్లీ జామెట్రీ రైడిల్స్ తీసుకున్నావా? లేక ఆల్జీబ్రా సాల్వ్ చేస్తున్నావా? యిదీఅదీగాకపోతే, మూడో పంచవర్ష ప్రణాళికకోసం అంకెల్ని పూర్తిచేస్తున్నావా? ఏమాలోచిస్తున్నావ్? మళ్ళీ మొదలెటావ్!" చిరాకు పడి నట్టు మాట్లాడింది.

"ఎబ్బే! ఏమాలోచించడంలేదే! ఆఫీసు సిట్యుయేషను గురించి; అదే యింత పెద్దకంపెనీ చేతులలో వుండగా, మన వాళ్ళంతా మద్రాసో, కలకత్తానో బొంబాయో వెళ్లి నౌక రీలు చూసుకుంటారెందుకనీ అని"

సుశీలకి ఆలోచన్లు ప్రవాహంగా మారిపోయాయి. ఒక్క అరుణతోటే నేగలేక పట్నం చేరినప్పుడు ఆ అరు ణతో సహవాసంవల్ల కొన్ని ఆలోచన్లురేగి అవే బాధ పెట్టేవి. ఇప్పుడు ఇద్దరు అరుణలమధ్య తిరుగుతూ తన అసలరుణను గుర్తుచేసుకుంటూ ఆలోచనా ప్రవాహంలో

త్పుకో లేకపోతోంది. దానికితోడు మరో సంఘటనకూడా సంభవించింది. ఆమె చేరిన వారం రోజులకి లక్ష్మికి పుట్టిన రోజు వేడుక. అదే వింతగా మార్చింది.

ఆనాడు పట్నంలో వుంటున్న ఉద్యోగులూ, ఉద్యోగులస్త్రీలూ చాలామంది వచ్చి విందారగించారు. దీవించారు. వెళ్లారు. ఆ ప్రత్యేకపు ఏర్పాట్లన్నీ మిస్ అరుణ చేసినవే. అందుకే సుశీకి యెక్కువగా పని కలిగింది. డిన్నరుకి కావలసిన యేర్పాట్లు చేసింది. టేబులు అమర్చడం, యెవరికివారికే పార్సెలుగా అల్పాహారాలు సిద్ధంచేయడం అతిథుల్ని రిసీవ్ చేసుకోడం వారి వారి స్థానాలకు తెచ్చి కూర్చోబెట్టడం ఇంకా యిలాంటివే అనేకపనులు బాధ్యతున్నట్టు, కన్నతల్లి చేసినట్టు చేసింది పాపం! తప్పనిసరి, పైవుద్యోగులఆజ్ఞ. యేం జేస్తుందిమరి?

## ౩౦

లక్ష్మిని చూసినప్పటి నుండి సుశీలకి మనసు మన మనసులో లేదు. మనసు రాజమండ్రిలో వుండన్చు; లేదా మనసే రాజమండ్రిలో వుండొచ్చును, యేమైతేనేం? మనిషి మాత్రమే ఇక్కడ మిగిలింది. "నా బిడ్డకూడా యీపాటికి యింతౌతుంది! యిదే నాబిడ్డ యెందుక్కాకూడదూ?

అడిగిచూస్తే ?....అసలడగటం ఎందుకు? పసిపిల్లలు తల్లిని వెదుక్కుంటూనే వుంటారు....'అమ్మా' అని దగ్గరి కొస్తే, నా పిల్లే!....పోనీ అడిగితే ఏం? "మధనపడి. పటపటా యిస్తోంది. గానులోవుండే పుట్టుమచ్చలెన్నెలా చూడ్డం?.... లేకుంటే, నా లక్ష్మి నెలా గుర్తుపట్టడం?" ఆలోచిస్తూ కూర్చొంది. యీలోగా సందడి అణిగింది. యిక విందు బాపతు ఆనవాళ్లు తీసెయ్యడమే తరవాయి. 'ఇదే సమయ' మనుకుంటూ లక్ష్మి దగ్గిరి కెళ్ళింది.

"నీ పేరేమిటమ్మా?"

"లక్ష్మి! అమెరికాలో వాళ్ళు, అంత బాగా మాట్లాడ లేరు. ఏమండీ మీరు రోజూ వో గంటసేపు నాతో మాట్లాడగూడదూ!...మా అరుణక్కకి అసలు తీరడం లేదండీ!...మీ రొస్తారనీ, మీరు చాలామంచి వాళ్ళనీ అక్కయ్య చెప్పిందిలెండి". సుశీల ఎదురుచూడని ప్రశ్నల్ని తట్టుకోలేకపోయింది. అందుకే వెంటనే ఔనూ కాదూ అన్లేకపోయింది.

"మీ అమ్మగారు....ఎక్కడున్నారూ?" తడబడుతూ పూర్తిచేసింది.

"మా అమ్మగారేనా? మీ కింకా తెలీదేమో. మరి; లండనెళ్ళారు, డాక్టరీ చదవటానికి. అమ్మ వొచ్చిం దంటే అందరికీ సూది గుచ్చుతుంది. కత్తులెట్టికోస్తుంది! అందుకే నాదగ్గరికొద్దు పొమ్మన్నాను...ఏమండీ! మీరు

రోజూవొచ్చి మాట్లాడరూ?.... లేకపోతే నేనే మీ ఆఫీసు కొస్తానంతే!"

"మీ నాన్నగా రెవరూ?.... అహఁ, పేరేమిటీ?"

"మిస్టర్ అరుణా, జనరల్ మేనేజర్! అది కూడా తెలీదూ? పోనీ, యీ బంగాళా ఎవరిదో తెలుసు నాండీ?"

"తెలుసుగాని, నువ్వేమంటావో అని అడిగానంతే!"

"అయితే, యింకా చెబుతాను వినండి. మా అరుణక్క లేదూ? అక్కడ, ఆ బంగాళాలో; ఆమెకి నేనంటే యెంతో యిష్టం! అమెరికాలో నేను తీయించుకున్న బొమ్మలన్నీ అక్కడే వున్నాయ్. వారానికో ఫోటో తీసియిస్తుంది నాకు.... నాన్నగారు కాఫీ తాగి రోజూ పాఠం చెబుతారు. పాఠమంటే అదే వొకథ చెప్పి మళ్ళీ రేపు అడుగుతారు. అక్కయ్య ఇంగ్లీషు గ్రామర్ నేర్పుతుంది."

"నీకు గ్రామరేమిటీ; పెద్దాళ్ళకి గానీ! ముందుగా కొన్ని కథలూ, పాఠాలూ నేర్చుకోవాలిగాని! కొన్ని పదాలతో బాగా అభ్యాసమయ్యాక వ్యాకరణం నేర్చుకోవాలి గాని; యింత చిన్నపిల్లకి గ్రామరేమిటీ?"

"ఏం! ఇంగ్లీషు లోగడ చదవ గలనుగా?"

ఈ జవాబు విని సుశీల ఆశ్చర్య పడింది. "ఓ అట్లా చెప్పు."

సుశీల సమాధానం విని లక్ష్మి తెల్లబోయింది. ఆమెకి అది జవాబుగా తోచ లేదు.

'ఇలాటప్పుడు వ్యాకరణం నేర్చుకోవలలిందే' అనే భావంతో మాట్లాడాలి. అందుకే తెల్లబోయింది. తెల్ల

బోయి పూరుకోలేకపోయింది. అడిగేసిందికూడా. "అదేమి టండీ, మీరు యింగ్లీషు మాటాడ్డం. అలవాటు చేసుకో లేదూ?"

"నేనా?... గ్రాడ్యుయేటును కాదు కాని, యింటర్ లో మంచి మార్కులే వొచ్చాయ్."

"మార్కులు కాదండీ, నే నడిగింది! యింగ్లీషులో మాటాడ్డం" రెట్టించింది.

"వెంటనే అప్పటికా విషయాన్ని చర్చించటం యిష్టం లేదన్నట్టు నెట్టేసింది సుశీల.

'వేలెడు పిల్లకి యిన్ని మాటలెలా వొచ్చాయో' అని ఆశ్చర్యపడింది.

యింత చదివికూడా చిన్నపిల్లముందు, తన చదువు పనికిరాకపోయిందని బాధకూడా కలిగి, ఈర్ష్యగా మారింది. అతడు పాఠం చెబుతూండగా వినాలనే ఉత్కంఠతో అప్ప టికా చర్చవిడిచి లేచింది. మనసు ఏదో బరువుగానే వుంది.

'లక్ష్మిలాగే ఉంది. పేరుకూడా లక్ష్మే! అయినా, నా లక్ష్మికాదు; నాలక్ష్మే అనడానికి ఆధారం వొకటే. ఎడమవేపు తొడమీద పక్కవాటుగా పుట్టుమచ్చుంది అది యీామె కుందోలేదో తెలుసుకోడ మెలా! ఆ పిల్ల నా దారికి తేవాలంటే వో బ్రహ్మ ప్రళయం. నాకు చదువు చెప్పేసుటం! ఇక ఆమె నాబిడ్డ అనడానికి వీలెక్కడుంది? యీా అరుణే నా అరుణైతే, నా దగ్గిర నేర్చుకున్నవాడేగా! యింతటి పాఠాలెలా చెప్పగల్డూ! వట్టిభ్రమ! వీళ్ళెవరూ నా వాళ్ళుకాదు.'

సుశీల ఆలోచించలేక పోయింది. ఆ పిల్లని వదిలి రావా లనిపించటంలేదు తనకి. తనతో ఆపిల్ల వుంటుందనే నమ్మకంకూడా కలగటంలేదు. ఏం చేస్తుంది! తెల్లవార్లూ ఆలోచించి, 'అరుణకి సన్నిహింతగా జరిగితే' అనుకుంది అలా జరిగితే! తనకి.వొరిగే దేమిటి? ఏమో. అయినా, అతనితో స్నేహంచేసి, ఆ చిన్నపిల్ల నేర్చుకున్నంతైనా నేర్చుకోవాలి. తను అందుకే తెల్లారిన ఉదయమే వంట పన్లు ముగించుకుని, ఆఫీసుకు ఇంకా గంట వ్యవధి వుండగా మిస్టర్ అరుణ బంగాళా కెళ్ళింది.

అరుణ లక్ష్మికి అప్పటికే చెబుతున్నాడు అదే వింటూ నిల్చుంది, సింహద్వారం ఆనుకుని అలా నిల్చున్న సుశీలని అరుణకాని, లక్ష్మిగాని గమనించనే లేదు. వాళ్ళ పాఠంలో వాళ్ళు మునిగిపోయారు.

"ఈ రోజున వో కథ చెబుతాను; అది చేపల జీవితంలో వుండే ముఖ్యమైన లక్షణం. ఈ చేపలు ప్రవాహంలో కొట్టుకుపోతూ, అక్కడక్కడ సొన ముద్దలు జారవిడుస్తాయి. అవే గుడ్లు. ప్రవాహ లక్షణంచేత అవి ఒక వైపూ, తల్లిచేప యింకో వైపూ వెళ్ళిపోతాయి. రెండు నెల్ల తర్వాత ఈ తల్లి చేపకి తను ఒకప్పుడు గుడ్లు పెట్టిన సంగతి గుర్తుకొస్తుంది. వెంటనే ఈ గుడ్లు పిల్లలౌతాయి. యిదొక విచిత్రమైన జననం! అలా పుట్టుకొచ్చిన పిల్లలు, ప్రవాహపుటలల్ని, నీటి ఒడ్డుని చూసుకుంటూ, సమన్వయించుకుంటూ పిల్లలే తల్లిని వెతుక్కుంటూ వొస్తాయి. తల్లి మాత్రం తన పిల్లల్ని గుర్తించదు. జలరాశిలో పెరిగే

జీవుల గుణం ప్రకారం గుర్తింపులేక పోవటంచేత, అల్ప జీవులు కాటంచేత, ఆ పిల్లల్నే తీనేస్తాయి. యిదే మత్స్య న్యాయంలో మొదటిది. చావుకోసమే ప్రీతి పుడుతుందట, యిదే కాబోలు నిదర్శనం!" అరుణ తన కథని దాదాపు పూర్తిచేశాడు. ఐనా, సుశీల తన ఊహాగానం లత మాదిరిగా అల్లుకుంటోంది.

"వీళ్ళు నన్ను వెతుకుతూ నన్ను చేరుకున్నట్లా? అయితే, ఆబిడ్డ నా లక్ష్మేనా? మరి, నన్ను పలకరించదేం? ఆ పిల్ల చెప్పిన వివరాల్ని వింటే వాళ్ళెవరూ నా వాళ్ళు కాదని తెలుస్తూనేవుంది. అరుణకూడా నా అరుణ కానే కాడు. వట్టినే మానవత్వం కోసం నన్ను రక్షిస్తున్నారంతే! నాకున్న వాళ్ళని విడిచి వొచ్చినప్పుడు నావాళ్ళెలా వుంటారు? అసలు, వాళ్ళెలా వున్నారోకదా! ఈ కథలో చెప్పినట్లు వాళ్ళు నాకోసం వెదుకులాడుతున్నారో ఏమో! లేక, వాళ్లని నేనే బాధపెట్టి,మనసుని క్షోభ పెడుతున్నానా? ఏదెలావున్నా, వాళ్లని చూడాలి." తన భావాల సుడి గాలిలో ఊదులాడుతూ, మనోపరిభ్రమణం కారణంగా అచేతనంగా నిలుచుంది సుశీల.

అరుణ యింకా చెబుతున్నాడు. "యీ రకం పరిస్థితులు మానవ జీవితంలో సంభవిస్తూంటాయి. దానికి ఫలితంగా, కొన్ని కుటుంబాలు సర్వనాశనం అయిపోతున్నాయ్ కూడా. మానవ జీవితానికి అన్వయిస్తాయి కనక నే వీటిని సామ్య న్యాయాలు అంటారు." అప్పటికి అరుణ కథ పూర్తిచేశాడు.

కథ పూర్తిచేసి లేవబోతున్న అరుణకి వాకిలి దగ్గర 'ధబ్'మన్న శబ్దం వినిపించింది. ఆతురతగా అటు చూశాడు. లక్ష్మి కంగారుపడి ఆమె దగ్గరికి ఒక్క గంతులో వెళ్ళిచేరింది "నాన్నోయ్! ఆమె లేదూ ? ఆమె పడిపోయింది. నాన్నా పాపం!" కంగారు పడుతూ, కళ్ళు పెద్దవిగా చేసుకుని, అనే సింది. "ఫరవాలేదు తల్లీ! నేను లేవదీస్తానులే, వుండు కంగారు పడకు. నువ్వెళ్ళి ఫాను స్విచ్ వెయ్యి, గ్లాసుకు తీసుకురా." ధైర్యంచెప్పి, అరుణ సుశీలను లేవనెత్తి, తీసు కొచ్చి సోఫాలోకి చేరేశాడు. పంకాగాలి సోకి, ఐదారు నిముషాల్లో తెలివి తెచ్చుకుంది సుశీల. నెమ్మదిగా కళ్ళు తెరిచింది. అరుణ! తనని సోఫాలో పడుకోబెట్టాడు. కాఫీ కప్పు అందిస్తున్నాడు. లక్ష్మి తన ముఖంమీద చెమటల్ని తుండు తీసుకుని తుడుస్తోంది. వాళ్ళారీతిగా తనకి సేవ చెయ్యడం చూస్తే, వాళ్ళు నిజంగా తనవాళ్ళే ననిపించింది. తలెత్తి అరుణవైపు చూడలేక, పక్కకొదిగి కూచుంది. "యేమండీ, యిప్పుడెలా వుందీ" అని లక్ష్మి ఆదుర్దాగా అడిగింది.

"తగ్గిపోయిందమ్మా. ఈ మధ్య కొంచం నీరసంగా వుంటోంది. యివాళ కళ్ళు తిరిగిన యంతే." తన దోషం కాదన్నట్టు చెప్పింది.

"ఈ కాఫీ తీసుకో సుశీలా. తరవాత మాట్లా డొచ్చు."

సుశీల కాఫీతాగి, సరిగా కూర్చుని "ఈసారి నీరసం

కూడా పోయింది" అంది నవ్వుతూ. "షూశారా! మా నాన్నగారు కాఫీ యిచ్చేరు. మీకు నీరసం తగ్గిపోయింది మరి. నేను విసిరినందుకు తెలివొచ్చిందిగా." చిలిపిగా అడిగింది లక్ష్మి.

"ఔనమ్మా. ఆమెకి ప్రాణం వొచ్చింది కూడా నీ మూలానే" అన్నాడు అరుణ. లక్ష్మి మొహం చాటంతగా వికసించింది. తలొంచుకుంది "అయితే, ఇక మీరు ఆఫీసు కెళ్ళొచ్చునేమో."

"అయినా, రెస్టు కావలిసుంటే." అర్ధోక్తిలో ఆగాడు అరుణ.

"కృతజ్ఞత! రెస్టు కోరడం వృధా కాలహరణం" సుశీల అంటూ లేచింది.

"అయితే మాకు చింతే వుండదు"అన్నా రిద్దరూను.

ఒక్కసా రిద్దరూ ఒకే వాక్యం మాట్లాడగలిగి నందుకు సుశీల ఆశ్చర్యపడింది. లేచి ఆఫీసుకు వెళ్ళే అరుణని అనుసరించింది. "గుడ్ బై ఎవరి బడీ" అంటూ సాగనంపింది లక్ష్మి. లక్ష్మి మాటలు ముద్దొస్తున్నా వెక్కిరిస్తున్నాయి. సుశీలకి ఈర్ష్య కలిగినంతే, వుల్లాసం కూడా కలుగుతోంది. సుశీలకి ఆఫీసుపని అలవాటు కాకపోగా, నానాటికి, తప్పులెక్కువౌతున్నాయ్. ఆ సంగతి ఆమెకి తెలియడం లేదు. ఈ పరిస్థితి మిస్టర్ అరుణకి ప్రాణాంతకమైపోయింది. తన అలవాటు ప్రకారం వార్నింగివ్వాలి. మెకాలో పుటప్ చేసి, స్టేట్మెంటు తీసుకోవాలి. లేకుంటే, ఆఫీసులో అరా

చకంబిఛానా పరుచుకుంటుంది. యెలా? కొద్ది రోజుల్లో యింకొందరు క్లర్కులు పనిచెయ్యడంలో అశ్రద్ధ చూపిస్తారు. వాళ్ళ ముఖ లక్షణాలట్లా తోస్తున్నాయ్.

. .

# 33

ఆనాడు మిస్టర్ అరుణ లేబరు ఆర్గనైజరుకు ఒక మెమో పంపించాడు. "మిస్ సుశీల, పంపించవలసిన ప్రోగ్రెస్ రిపోర్టులుకాని, రిటర్నులు కాని సరైనవి కావని తెలియడంతో, పనిలో ఆమె చూపుతున్న అశ్రద్ధ మేనేజిమెంటుకు అర్థమౌతోంది. తన పనిని చక్కబెట్టుకో లేనప్పుడు పని చాలించుకోవలసి వొస్తుందని హెచ్చరిస్తున్నాము. జనరల్ మేనేజర్." ఆ లేఖను మిస్ అరుణ సంతకంచేసి సుశీల కిచ్చింది.

లేఖను చూడగానే సుశీలకి భయం ఆవరించింది. కాళ్ళకింద నేల కుంగి పోతోందనిపించింది. తన పంతం నెగ్గించుకోవాలనుకుని నౌకరీ కొచ్చింది కాని, నౌకరీమీద ధ్యాసే లేదుగా! పని అలవాటు కాలేదు. యీనాటివరకూ సీట్లో కూర్చుండి ఆలోచించడమే అభ్యాసం చేసింది కనుక పనిమీద దృష్టి వుండటంలేదు. ఏం చేస్తుందీ? యిప్పుడే అన్నిటికీ అడ్డం తగల్తూంది. అవస్థ! యింటికి వెళ్ళిపోతేనో? అలా వెళ్ళిపోతే తనని యింట్లోకి రానివ్వరు. నాన్న ఎవరో

కుర్రాడ్ని తెచ్చి పెంచుకుంటున్నాడు. ఇక తనతో ఏమీ సంబంధం లేదని మొన్ననే తనకి జాబు రాశాడు. యిప్పుడిక్కడి జాబూ....పని సరిగా చెయ్యకపోతే మానుకోమని. ఏంచెయ్యాలి? ఇప్పుడు తండ్రి అసరా లేదు, నౌకరీ నమ్మకం లేదు, యెటు మొగ్గాలి? తండ్రిమాట వినకపోవడం చేత, ఆయ నిక యెలాగూ రానియ్యడు. ఏంచెయ్యాలి మరి? నౌకరీయే గత్యంతరం. నౌకరీ కావలసిందే కాని, పని చెయ్యడమనే నిర్బంధం తన కిష్టమైంది కాదు. యిన్ని కారణాల మధ్య నలుగుతూ యేమీ చెయ్యలేక రోజులు నెట్టాలనే భావంతో జనరల్ మేనేజరు ఆఫీసుకు వెళ్ళింది, తన రికార్డులోవున్న తప్పు ఏమిటో తెలుసుకోవాలని!

అప్పుడు అరుణ లేకపోవడం చేత స్వతంత్రంగా లేబరు ఆక్టివిటీస్ ఫైలు తీసింది. లేబరులోవున్న ఉత్పాదక శక్తి, పనికి హాజరయేనిష్ట, యిచ్చిన కాలంలో చేయగల పని, చేసినపని, అదనపు ఉత్పాదన, అదనపు పారితోషికం యిలాంటి విషయాల్లో చాలావరకు అంకెలు తప్పులున్నాయి. ఎర్రసిరా దిద్దుళ్ళూ చెరుపులూ కొల్లలుగా కనిపిస్తున్నాయ్. యేంచేస్తుందీ? వెధవ అంకెలుకూడా చెప్పినమాటవినడం లేదు. తప్పులు పడుతున్నాయ్. యెలా సరుకోవాలో తెలియటం లేదు. అయినా ధైర్యంగా రోజులు నెట్టెయ్యాలిగా! అందుకే కాబోలు, కులాసాగా పాట పాడుకుంటోంది తనలో తానే. ఇంతలో ఏదో అలికిడి తోచి, మానేసి అటు తిరిగింది.

సుశీల యెదుట అరుణ ప్రత్యక్షం. చప్పున తలొంచుకుంది. అరుణే ఆమెని పలుకరించాడు. "బాగుంది సుశీలా! యింత ఏక్టివ్‌గా వుంటావ్, అన్నితప్పులెందుకొస్తున్నట్లు? పైగా నిన్న మొన్నటివరకూ ఏదో దిగులుగా కూర్చుండే దానివి! యింతలో ఏంమార్పొచ్చింది, యింత చలాకీగా వుండటానికి?"

"యేమీ లేదులెండి" తలెత్తలేదు.

"కారణం నిర్బంధంగా చెప్పనక్కర్లేదు. రోజూ యింత చలాకీగా వుండగలిగితే, నీకూ ఆరోగ్యంగా వుంటుంది; మాకూ సంతోషంలే. కలకల్లాడే ముఖాలు ఆఫీసులో నాలుగుంటే, మనిషికెంత విచారంవున్నా దిగమింగెయ్యొచ్చు."

"యీ మాత్రం సంతోషం చాలాండీ?" నవ్వును పళ్ళకింద నొక్కిపెట్టింది.

"సంతోషానికి హద్దేమిటి? ఐనా, మాక్కావలసి సంత అనుకోడమేమిటి!"

"మరెవరికా కావాలి? మీ అఫీసులో పనిచెయ్యటం లేదూ మరి?"

"అదిసరేలే; నీకు పెళ్ళయిందా?" ఉన్నట్టుండి హఠాత్తుగా ఈ ప్రశ్న అడిగేసరికి, సుశీల తలక్రిందులైపోయింది. ముఖంలో నివ్వెరపాటు తోచింది. తనలో పుట్టిన కంగారు అణగలేదు. అయినా, నిలదొక్కుకుంటూ నవ్వింది. అదే కాబోలు దానికి జవాబు; తలొంచుకుంది.

"కాలే....?....ఆమాట జెప్పటానికి సిగ్గెందుకూ?

మరి! నీకు భర్త పేచీ లేదు; తలిదండ్రి పేచీకూడా లేదు. అయినా యెందుకీ మనోవ్యథ? ఆహాఁ మాటవరసకన్నా నంతే. నేనేం ఆర్చేవాణ్నా! తీర్చేవాణ్నా! మా మాట నీకు సహిస్తుందా!"

"మీలాంటివాళ్ళు చెబితే వినకపోతానా!" సాపేక్షంగా అతన్ని చూసింది.

"మా అరుణ నీ కెంతకాలంగా పరిచయంవుంది? ఆమె చెప్పినమాట ఒక్కటేనా విన్నావా? .... అర్థంచేసుకోవాలని ప్రయత్నించావా? యిప్పుడు నీ నౌకరీ విషయం ఆమె పీకమీదికి తెచ్చావు. యింతకంటే చెయ్యవలసింది లేదన్నట్టు, చూడు, యిప్పుడామె యెంతగా మథనపడుతోందో... "

"ఔనండీ, ఆమె చూపిన వాత్సల్యాన్నైనా ఆలోచించక అలక్ష్యంచేస్తూ వొచ్చాను. ఇప్పుడు పని విషయం తలకెక్కడంలేదు. బతుకంతా యేదో ఖాళీగాతోచి, అనుక్షణమూ బాధకలుగుతోంది. దయుంచి నా నౌకరీ మీద సవాలుచెయ్యొద్దని మనవిచేస్తున్నాను. యికమీదట మీరు చెప్పినట్లే జాగ్రత్తగా పనిచూసుకుంటాను. తప్పులు రాకుండేలా చూసుకుంటాను. విసిగించను. అరుణలాంటి కరుణామయికి బాధ కలిగించాను. ఆమె ఎంతో మంచిది."

"ఆమె మంచితనాన్ని మెచ్చుకోవాలంటే, నీలాంటి వాళ్ళకి చేతకాని పని. ఆమె మంచితనం నిలుపుకోవాలంటే, నీ విషయంలో పొరపాటు రాకుండా చూసుకోవలసిందే. అప్పుడే ఆమె సంతోషిస్తుంది."

"మంచితనం నిలబెట్టుకుంటాను. కాని, నాకు తగిన ఆసరా లేదనిపిస్తోంది. అయినా, ప్రయత్నం చేస్తాను. ఆ కథ వుదయం చెప్పింది; ఇంకో మత్స్యన్యాయం వుందన్నారు. అదెప్పుడు చెబుతారూ?"

"రేపుదయం చెబుతాను. ఆఁ సరేగాని, 'యికనించి చలాకీగా వుంటాన' ని మాటిచ్చావ్! జ్ఞాపకం వుంటుంది కదూ మరుస్తావా?"

"నేనేం మాటిచ్చానూ? అలాగే అనుకోండి! మీరంటున్నారుగా" నవ్వుతూనే అక్కడినుండి తన సీటులోకి వచ్చిపడింది. ఆమెలో కలిగిన సంచలనానికి అరుణ నవ్వుకున్నాడు. అయినా తాత్కాలికంగానే అంతలోనే విషాదం. అతనికి ఆమెలో కలిగిన ఉద్దేశాల పరిణామాలకి కష్టం తోచింది. "ఈనాడు యీ సీటులో నేనున్నాను, రేపింకెవరైనా వుండొచ్చును. అప్పుడీవిధంగానే మాట్లాడుతుందా! యీ అధికారాలకీ, హోదాలకీ లొంగిపోతుందా? అయితే పట్టుదల యింతలో మారిపోతుందా? హుఁ" విదిలించుకున్నాడు చిరాకుగా.

తెల్లారింది. సుశీల కథకోసం వచ్చి కూచుంది. అప్పటికి లక్ష్మి ముస్తాబౌతుంది. అరుణకూడా యించుమించు ఆఫీసు వేషం వేశాడు. యిద్దరూ సుశీలని మందహాసంతో పలకరించారు. లక్ష్మి వచ్చి సుశీల పక్కనే కూర్చుంది. ఎదుటి సోఫాలో అరుణ కూర్చున్నాడు. యిక ప్రారంభించమన్నట్టు చూసింది సుశీల.

అరుణ కథ ప్రారంభించాడు. "నిన్న చేపల జీవిత

విధానంలో ఒక మార్గం చెప్పాను. యిప్పుడు యింకో మార్గం వివరిస్తున్నాను. యిది ముఖ్యంగా మానవ జీవితానికికూడా అన్వయిస్తుంది. పిల్లలుగా వుంటూ చచ్చినవి చావగా మిగిలినవి పెరిగి వయసులో కొస్తున్నప్పుడు జంటలుగా తిరుగుతాయి వాటిల్లో మోతుబరి చేప నాయకత్వానికి పూనుకుంటుంది. దాని నాయకత్వాన్ని మగచేపలు యెదిరించలేక యేవగించుకుంటా యంతే. ఆడచేపలగతి అధ్వాన్నమైపోతుంది. మోతుబరిచేప యిష్టంవొచ్చిన ఆడ చేపని బలవంతంగా బెదిరిస్తూవుంటుంది. చేపల్లో సహజంగా మోతుబరితో స్నేహంచేసే చేప యేదీ వుండదు. అందుకే దాని బతుకంతా బలవంతం చెయ్యడంతో గడిచిపోతుంది. అలా యిష్టంలేని చేపని చెరిచింది. ఆతరవాత? అది సంఘానికి నాయకత్వం వహించి, దానికి భద్రత కలిగించింది. గాని సంఘానికి చీడపురుగు మాదిరిగా పరిణమించడం, ఆ చేపలన్నిటికీ అసహ్యం కలిగించడమే! ఆ తరవాత....బలవంతంగా చెడిపోయిన స్త్రీ చేప, విలవిల్లాడిపోతుంది. మైలపడిపోయిన తన శరీరాన్ని అంతం చెయ్యడం ఇష్టంకాదు. అలా అంతమైపోతే, తనని కోరిన మగచేపకూడా మరణిస్తుంది. మగచేపకోసం బతికితే, తన దేహంమీద మోతుబరి చేపకి యెక్కడలేని హక్కు పుట్టుకొస్తుంది. ఈ విషయం తెలుచుకొని ఆ చేప చావ్వలసిందే! తన మగచేపని తలచుకొని బతకాలిసిందే! వీటిలో ఏం చెయ్యాలి? ఏం చెయ్యకూడదూ? ఏంచేసినా వొకటే, చెయ్యకపోయినా వొకటే! బతికుంటే తన మగచేపని రోజూ మోసం చెయ్యాలి. చస్తే

అతని జీవితాన్నే మోసం చెయ్యాలి. ఇలాంటి జీవితాన్ని వెళ్ళదీస్తున్న స్త్రీ లెందరో యీనాటికీ మన సమాజాల్లో వున్నారు'' కథ ముగించినట్టు సూచనగా చిన్న దగ్గు పొడిగా విడిచాడు అరుణ.

“అయితే, యిది మానవజీవితానికి యెలా అన్వయిస్తుంది?“ సుశీల అడిగింది. దానికి లక్ష్మికూడా ఉత్సాహం కనబరిచింది. అరుణ చెప్పాడు.

“ఒక యింట్లో ఓ ముసలాయన కొడుకూ కోడలూ వున్నారు. అదే యింట్లో యెవరో పరాయివాడుకూడా కాపరం వున్నాడు. యింకెవ్వరూ లేరు. ఆ పరాయివాడు ‘కోడలివేపు వికృతంగా చూస్తున్నాడనే నెపంమీద వంశానికి కళంకం రాకుండా రక్షించేవాడిమాదిరి, ఆ పరాయివాడ్ని యీ ముసలాడు వెళ్ళగొడతాడు. కొద్దిరోజుల తరవాత యేదో అవసరంమీద కొడుకుని పొరుగూరు పంపించి, ఆ రాత్రి దీప మార్పి కోడలిని తానే చెరుచుతాడు. తెల్లారిన తర్వాత, ఆ కోడలి స్థితి యెలా వుంటుందో ఆలోచించు! తన భర్త కోసం తాను బతకాలి. బతికితే ముసలాడికి లాచబాటగా మారిపోతుంది తన శరీరం. అందుకని చావాలి. తనుచస్తే భర్త జీవించలేడు. నిత్యం ద్రోహంతో నిత్యాం తనూ బతికి, భర్తకి ద్రోహం చెయ్యడమా? లేక తను చచ్చి, కుటుంబాన్ని సర్వనాశనం చెయ్యడమా? ఏం చేయాలి? యీ రకమైన పరిస్థితినే మనవాళ్ళు ‘మత్స్యన్యాయం’ అన్నారు.”

అరుణ చెప్పిన కథతో సుశీలకి చైతన్య మణిగి

పోయింది. "అయితే, ఆ స్త్రీకి మనసు మొద్దుపడిపోతుంది. నామాదిరిగా మొండి జీవితాన్ని గడుపుతూ వుండాలి! నా మాదిరంటే! ఆమె జీవితంమాదిరిగా .నా జీవితానికి అఘాతం తగిలిందా? లేదు. అలాంటప్పుడు ఆ స్త్రీకి నాకూ పోలికేమిటి? అయినా, మనసు రాయిచేసుకోడంలో పోలిక వుండొచ్చునుగా! మనసు రాయిచేసుకోడంలో ఆమెలో ఆస్కారంలేదు. మనసూ ఆత్మకూడా సెలవు తీసుకుంటాయి ఆమె నిజ్జీవంగా బతుకుతుంది. నా పరిస్థితి అదికాదు. ఒక విరుద్ధభావంతో వ్యగ్రంగా ఉండిపోయింది నా మనసు." పరిస్థితిని సమన్వయించుకోడానికి సుశీల ప్రయత్నంచేస్తూ ఊహావిహారంలో చైతన్యం పోగొట్టుకుంది. ఆమెను లక్ష్మి పలకరించి కంగారుపడింది. మళ్ళీ నిన్నటి మాదిరిగా చాకరీచేసి మనలోకి తెచ్చాడు అరుణ.

"సుశీలా! నీలో ఏవో విచారాలు గూడుకట్టుకున్నాయి. వాటిని రానియ్యకూడదు. నీ మానసిక బాధ పెరిగితే హిస్టీరియా అనిపించుకుంటుంది. దానికి ఇంగ్లీషులో వైద్యమే చికిత్స! ఆయుర్వేదంలో దానికి మానసిక చికిత్స చెయ్యాలంటారు. దాన్ని భౌతికరోగం అనరు. మనోభ్రమణ స్థిరత్వంవల్ల కలిగే అపస్మారం. మనసు పరిభ్రమిస్తుంది. శరీరాన్ని ఆజ్ఞాపించే శక్తి వుండదు. అప్పుడు శరీరం ముద్ద చుట్టుకుపోతుంది. అదే అపస్మారం! మనసు శరీరాన్ని స్పర్శించిందన్నమాట. యిలాంటివాటిని రానియ్యకూడదు. అందుకే నీకు ఉత్సాహం కలిగించే పద్ధతుల్ని అనుసరించు; లేకుంటే నీఆరోగ్యంతో నౌకరీకూడా నిలిచేదికాదు. నాలో

మంచితనంవుంటే, కూర్చోబెట్టి పోషిస్తాను. కాని ఆఫీసు వ్యవహారాల్లో చెడ్డపేరు తెచ్చుకోడానికి ఆస్కారం ఇవ్వను. అలా నిన్ను ఉచితంగా పోషిస్తేకూడా, లోకం సహించదు. దానికి జవాబు చెప్పడం తేలిక విషయంకాదు. నేను మంచితనానికిపోతే, లోకం నానార్థాలకిపోతుంది. అందుకే కొంచం జాగ్రత్తవహించమంటున్నాను. నీకు కావలసిన రీతిలో ఉత్సాహంగా ఉండు. యెవరొద్దంటాడు?" అరుణ సుశీలకు పరిస్థితిని వివరించి చెప్పాడు.

"లోకం మిమ్మల్నికూడా అంటుందా? మీకు లోకమంటే భయమేనా!"

"లోకానికి నేను ముద్దుబిడ్డని కాదు. హెచ్చుతగ్గులూ అంతస్థులూ మన పరిధివరకే. లోకంపరిధిలో అంతా వాక్కులే! నేను భయపడతానని కాదు."

"అయితే నౌకరీ బెంగ నాకు లేదు. మీదగ్గరే అనేక విషయాల్ని తెలుసుకుంటూ వుండొచ్చు. మీకేమైనా కష్టమా!"

"నాకేమిటి కష్టం! యింతకీ నీ మనసులో వున్న బాధ తీసెయ్యకలిగితే అదేచాలు. నీకు నాతో వుండటమే కావలసుంటే, దానికావలసిన యేర్పాట్లు చేస్తాను. మా అరుణతో చెప్పి సన్నాహాలు చేస్తాను. ఏమంటావ్? అలా చెయ్యనా, వొద్దా?"

"మిస్ అరుణా! ఏమని చెబుతారూ? ....సుశీలని... నా యింట్లో" ఏదో అనబోయి నాన్చేసింది.

"కాదు, అలా చెప్పవలసొచ్చినప్పుడు, పెళ్ళిచేసు

కుంటున్నాననే చెప్పేస్తాను. నా కెప్పుడూ అడ్డు చెప్పదు, సరేనా?"

"సరే, మీయిష్టం. నాకామాత్రం ఆసరాయిస్తే చాలు.. అన్నట్లు యిలాగే మానవజీవితంమీద పనిచేసేవి యింకేవైనా కథలు చెప్పగలరా?"

"రేపు మయూరన్యాయంమీద వోకథ చెబుతాను... లే, ఆఫీసుకు పోదాం, టైమవుతూంది." అరుణ లేచి దారి తీస్తుంటే సుశీలకూడా లేచింది.

లక్ష్మి వాళ్ళను సాగనంపుతూ "మీరు మా అమ్మ చోట్లో కొస్తారా?" అంది.

"ఏం? ఆమె మంచిదేగా" అన్నాడు.

"ఆమెనే రమ్మంటున్నా" అంది లక్ష్మి. అందరూ సంతృప్తిగా నవ్వుకుంటూ యెవరిదారిన వారెళ్ళారు.

## ౩౮

మళ్ళీ సుశీల ఆలోచనలో ప్రవేశించింది. ఈ అరుణ నన్ను పెళ్ళిచేసుకుంటానంటున్నాడు. సరే బాగానే వుంది. లోకం?... ఒకప్పుడు నాన్న అడ్డుచెప్పిన 'లోకం' నన్నేం చేసింది?... మధ్యలో అరుణ నెదిరించినప్పుడేం చేసింది? ఇప్పుడుమాత్రమేం చేస్తుంది?... లోకంపేరు చెప్పి శోక మెందుకనుభవించాలి? చాలీచాలని ఊహల యిరుకులో యెన్నాళ్ళు మగ్గిపోవాలి? అరుణ నెలాగైనా నావైపు తిప్పు

కుంటాను. ముందు లక్ష్మిని వశంచేసుకున్నా!" ధీమాగా తన సీటులో కూర్చుంది. మిస్ అరుణ పలకరించగానే, యెందుకో నవ్వుకుంటూ తలొంచుకుంది. ఆమె అలా సిగ్గు పడటాన్ని గురించి వివరం అడిగింది మిస్సరుణ.

"ఏమమ్మా, సిగ్గుపడుతున్నావ్? పెళ్ళిలాటిదేమైనా సంఘటనొచ్చి పడిందా? యేదో మాతోకూడా కాస్త చెప్పకూడదూ!"

"మేనేజరుగారు చెబుతారుగా, నే చెప్పకుంటే! ఐనా నేనే చెప్పాలంటారా!... ఐతే మీరిచ్చిన కొటేషను రైటే అంటాను."

"విష్ యూ గుడ్ లక్! యెన్నాళ్ళనుంచీ ప్రయత్నం చేశావ్?"

"తలవని తలంపుగా ఈనాడే తటస్థమైంది'"

"అల్లాగా, ఐతే సాయంకాలానికి పూర్తిగా తెలుస్తుంది లే" అంటూ ఆఫీసుపని పురమాయించి తాను లేబర్ని చూడ్డాని కెళ్ళిపోయింది, అరుణ.

'లక్ష్మికి యింగ్లీషు సాంప్రదాయమంటే యిష్టం' అని తోచగానే సుశీల మదాౖసులో తీసుకున్న గౌను వగైరాలని ధరించి హైహీల్స్ బూట్ల టకటకతో ఆ సాయంకాలం ఊరిబయట గుట్టమీదికి షికారుకెళ్ళింది. ఆమెవేషం చూసిన మిస్టరరుణ తెల్లబోయాడు. ఆమె ననుసరించివెళ్ళి ఆమెలో కలిగిన మార్పుల్ని తెలుసుకోవాలనుకున్నాడు. వెంటనే బెంగాలీ పంచకట్టూ, లాల్చీ, చిన్న మల్లుకండు

వాతో సహా వేషం వేసుకుని గ్రీక్ గోగిల్స్ తగిలించుకొని బయల్దేరాడు.

సుశీలకి ముందుచూసేగాని వెనక జరిగే విషయాల వైపు దృష్టిపోటం లేదు. తిన్నగా హాస్పిటల్ పక్కగా వెళ్ళి ముక్తి నూతలపాడు వైపు వున్న చిన్న గుట్ట నెక్కుతోంది. ఆ పరిస్థితిలో ఆమెను చూసిన అరుణ; తన దారిని ఆ గుట్టకి ఆ వైపుగా పోయే గుంటూరు రోడ్డుమీద నడిపించాడు. ఇటు నుండి సుశీల పైకెక్కి కూచుంది. పది నిముషాల్లో ఆ వైపు నుండి యెవరో గుట్ట దిగుతోన్నట్టు చప్పుడైతే చూసింది. ఇంకేంవుంది? 'అరుణ!' ఆమె గుండె గతుక్కుమంది. అతను సుశీలను చూసి నవ్వుకున్నాడు.

"ఏం నవ్వుతున్నారు?" రోషంతో అడిగింది సుశీల.

"నేనా? నీలాంటివాళ్ళ తెలివితక్కువకి! ...నీ వెర్రి వేషానికి."

"నా వేషం మీకేం తెలుసు? ...నాది వెర్రివేషమని రిమార్కు చేస్తారేం?"

"నాకు తెలియందేముంది?... కావాలనుకున్నదల్లా నాకు తెలుస్తుంది. నేను పట్టించుకోనకపోతే నాకు తెలియదు.... ఇక్కడ ఆ వేపున అయ్యల్టిడీ వుంది. దానిలో తెల్లోళ్ళ కుటుంబం వుండేది. వాళ్ళు వెళ్ళిపోయాక, యీ వేషంలో తిరిగే మానవాకారం యీనాడే కనిపిస్తోంది... యెవరా అనుకున్నాను... తీరా ఆలోచిస్తే మనసు నిలకడ లేక, కాళ్ళకింద భూమి కుంగిపోతోంటే చూరుపట్టుకుని వేలాడే స్త్రీ అని తెలిసింది. అందుకే నవ్వుకున్నాను..."

"అంతశ్రాగా అర్థంచేసుకున్నారా?... యింకా అర్థం చేసుకోగలిగితే అదికూడా చెప్పండి" నిలదొక్కుకుంటూ అడిగింది.

"నీకు చిత్తచాంచల్యం యెక్కువగా వుంది. ఇప్పుడు నచ్చినది కొద్దిసేపట్లో నచ్చదు. అంతగా చంచలమై పోయింది నీ మనసు. ఒక వ్యక్తి గాలిలో ఊగులాడిపోతూ తెగీతెగని దారంపట్టుకుని వేలాడే సాలెపురుగుమాదిరిగా విలవిల్లాడిపోతున్నాడు. అతడికి కుటుంబ గౌరవం వంశ పారంపర్యంగా వచ్చే అలవాట్లు, అతని సంస్కారం యిలాటివే అనేక అంశాలు చుట్టూకనిపించి అనేకరీతులుగా కించపరుస్తున్నాయి. అతనికో ఆశాజ్యోతి వుంది. దాని ఆధారంతో నాకోస మెదుకుచూస్తున్నాడు 'ఆశపెట్టి మోసం చేశా'వని నాలాటివాడు నిన్నునిందించినా అతడు సహించలేడు... అలాటివాడ్ని యేడిపించింది చాలదన్నట్టు యిప్పుడీ వేషాలూ, వీటి మరుగునే భావాల మార్పు యింతగా యెందుకు మారిపోయాయ్?... ఆఖరికి నీకైనా శాంతి దొరికిందా అంటే అదీ లేదు. మరెందుకీ వేషాలు?...నిన్ను చూడగానే జాలేసింది. అందుకే చెప్పాను...వొస్తాను" వెళ్ళిపోయాడు.

"అయితే నా కర్తవ్యం?" అని నిలిపింది.

"జీవితమంటే మాసిపోయిన జాకెట్ కాదు, విప్పి పారెయ్యాడానికి లంబాడీ స్త్రీ అయితే, ఆ జాకెట్టునీ పారెయ్యదు! అతుకులూ, ఉతుకులూ కానిస్తుందికాని, విడిచిపెట్టదు. నీకు తగిన పద్ధతి ఒక్కటే! నువ్వు నీవాళ్ళ దగ్గర

కెళ్ళడమే. తరువాత నీయిష్టం. శలవు..." వెనక్కి చూడ కుండా వెళ్ళిపోయాడు.

ముక్తి నూతలపాడు వైపుగా వొచ్చిన ఆ జ్యోతిష్కుడు ఒంగోలు ఊళ్లో కెళ్ళక మళ్ళీ వెనుతిరిగిపోయాడు. 'ఎందుకొచ్చినట్టూ?' చాలాసేపు ఆలోచించినా ఆమెకి అతనిరాక కారణం అర్థం కాలేదు. "నన్ను చూసి విరక్తిగా వెళ్ళిపోయాడు" అనిపించింది.

"ఏమిటిదీ, మాయ? ఒకే పోలికిలో యిప్పటికి నలుగురు వ్యక్తుల్ని చూశాను. ఈ నాలుగో వ్యక్తి పేరు తెలుసుకోలేదంతే! అడిగితే చెప్పేవాడే... అయినా ఏం చెబుతాడు?... అరుణ అంటాడంతే! అది నాకు శాపం. నేను భ్రమలోపడి గిలగిల్లాడుతోన్నంత కాలం నన్నిలా యేడిపిస్తూనే వుంటుంది. మనసుకి శాంతివుండదు. బతుక్కి మార్గం వుండదు. జీవితంలో సుఖందొరకదు .." కళ్ళు కప్పుకొని ఆ గుట్టమీద వెక్కి వెక్కి యేడ్చింది. ఆఖరున చేతిలో వున్న వేనిటీ బ్యాగ్ ఉపయోగపడి ముఖంమీదున్న విచారచిహ్నాలను మరుగు చేసింది. తను వేసిన వేషం తన్ను యేడిపించింది. ఈ తేడా యేమిటో మరి. అవలంబించిన వాటిలో కొన్ని ఒకవైపుగాను, మరికొన్ని యింకోవైపుగాను ప్రతిఫలాన్నిస్తాయ్! సూక్ష్మంగా తోచవలసిన విషయాలు చదువుకున్న వాళ్ళకుసైతం తెలియకపోతే! ఇక వాళ్ళు ఏం చదువుకున్నట్టు? 'చదువుకున్నాం' అనుకుంటూ వాళ్ళకి వాళ్లే ఆ విధంగా మోసపోతారెందుకో! ... పాపం, సుశీల అదేవిధంగా భంగపడి బెంగలోపడింది

తెల్లారింది లగాయతు పనిపూర్తి చేసుకోడం, వెళ్ళి కథవినడం అన్న ధ్యాసేగాని మరోధ్యాస లేదు సుశీలకి. నిన్నసాయంత్రం గుట్టమీద జరిగిన సంఘటన అసలు గుర్తు లేనట్టు తోస్తుంది. ఐనా ఆ విషయం వో రాత్రంతా ఆలోచించి యింకొంచెం రేపొద్దు 'పోనీ వోసారెళ్ళి చూసొద్దాం' అనే నిర్ణయానికొచ్చిందిగా! అదే చాలు.

అరుణ కథ ప్రారంభించాడు. లక్ష్మి సుశీలలు యెదురుగా వున్న సోఫాలో కూర్చుండి వింటున్నారు.

"మయూరన్యాయం; అంటే నెమలియొక్క జీవిత విధానం. నెమళ్ళు, పిల్లలుగా వున్నప్పుడు మందలుగా తిరుగుతూ వుంటాయి. వయసొస్తూండగా జంటలుగా తిరుగుతాయి. ఆ దశలో వుండగా అడివి మొత్తంమీద పక్షుల వలస లెక్కడున్నాయో, యే జాతి పక్షులున్నాయో, తమ జాతి వెన్ని యెక్కడెక్కడున్నాయో మొదలైన విషయాలు గుర్తింపులో వుంచుతాయి. అలాటి జంటలో యే పక్షినైనా వేటగాడు సంగ్రహించుకుపోతే అప్పుడే వాటియొక్క భావనా, వాటి అవస్థ అన్నీను..."

"అలా పట్టుబడిన నెమలి, తన జోడి పక్షికోసం యెదురుచూస్తుంది. యేడుస్తుంది. ఆ పక్షివచ్చి తనని విడిపిస్తుంది కదా అనుకున్న పక్షి నిరాశతో ఆహారం విడిచిపెడుతుంది. రెండురోజుల్లో మానసికంగా మారిపోతుంది. దానిలో అనేక భావాలు పుట్టి తన జత పక్షిమీద ఏవగింపు కలిగిస్తాయి. "ఛీ, నన్ను విడిపించడానికి బదులు, యీ పాటికి యింకో పక్షితో జతగూడి గడిపేస్తోంది కదా' అనుకుం

టుంది. 'నమ్మితే దక్కేది దుమ్మే; యెవ్వర్నీ నమ్మకూడ' దనుకుంటుంది. అసలు బతుకుమీదే విరక్తి కలిగి పదిరోజుల్లో ప్రాణత్యాగం చేసుకుంటుంది."

"అదేవిధంగా రెండో పక్షీ కూడాను! యెదురు చూస్తుంది; యేడుస్తుంది; రెండు రోజుల తర్వాత ఆహారం మానేస్తుంది. తిట్టుకుంటుంది. ఇంకో వారంరోజుల్లో తనువు చాలించుకుంటుంది. మొత్తంమీద ఈ నెమళ్ళు జంటలైన తర్వాత విడిపోడమే తటస్థపడితే జంటలో యే ఒక్కటీ బతకదు. ఇదే మానవ నైజం కూడాను. ఒక్కొకడు విభాయించుకుంటాడు. కారణం బలవంతంచేస్తే బతుకుతూ, నిర్బంధంగా మృతజీవుడౌతాడొకడు!...కర్తవ్యం లేనిచోట తనువు చాలించడం సామాన్యంగా జరుగుతూ వుంటుంది."

కథముగించి లక్ష్మివైపు చూశాడు అరుణ. లక్ష్మి ముఖం విషాదంగా వుంది. సుశీల నిశ్చేతనంగా వుంది. మళ్ళీ మామూలు చాకిరీచేసి కాఫీతో ఆమెని మనిషిగా మార్చారు వాళ్ళిద్దరూ.

సుశీల కిదే దురవస్థ. కథ వింటున్నంతసేపూ రాజమండ్రీలో తను విడిచిపెట్టిన అరుణ, లక్ష్మి జ్ఞాపకానికొచ్చి అపస్మారానికి గురౌతుంది. మిస్టర్ అరుణనిచూసి అధికార లోభానికి దాని చిలవలూ పలవులుగా వున్న వ్యామోహాలకి గురై వున్న మతికాస్తా చెడగొట్టుకుంటుంది. ఇదో పరపాటి అయిపోయింది, సుశీలకి. ఆనాటికి మాత్రం సుశీల కళేబరం ఆఫీసుకెళ్ళింది. ఆమె మనసు గాలిలో యెక్కడో ప్రసారమైపోతోంది. "అయితే అరుణ నాకోసం విలపిస్తు

స్తున్నాడా? మరి ఒక్క జాబూ రాయలేదేం? కేవలం లక్ష్మి కోసం బతుకుతున్నాడా! లక్ష్మిని తాతగారి కిచ్చేస్తే? ఇక అతనికి జీవించే అవసరం వుండదన్నమాట. లోకజ్ఞానం పేరుతో అతన్ని చేరదీసి, అతనికో ఊహాసౌధం కట్టియిచ్చి యిప్పుడు పునాదులకింద టైం బాంబు పేలుస్తున్నానా? ఆ వంశంకోసం ఆ ముసలాయనపడిన బాధ చూడలేక జాలితో యింతపని చేసి కడకింత పని చేస్తున్నానా? ఛీ! నాదీ మానవజన్మేనా? అయితే యీ అరుణ నన్ను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాడుగా! ఇతని విషయంలో మయూరన్యాయం పనిచెయ్యడంలేదా? అడుగుదాం!"

సాయంకాలంవరకూ ఆలోచించి అదేఅనుమానాన్ని గురించి సుశీల అరుణ నడిగింది, "ఏమండీ, మయూర న్యాయం మీపట్ల పనిచెయ్యదూ?"

"అలా అనిపించిందేం నీకూ!"

"నన్ను పెళ్ళిచేసుకోడానికి సిద్ధపడుతున్నారుగా!"

అది నా ప్రేరణకాదు. మా లక్ష్మి నిన్నిదివరకే రమ్మని ఆహ్వానించిందిగా? ఆమెకోసమే ఈనాడు నిన్ను పెళ్ళిచేసుకుంటున్నాను. నాకొకసారి పెళ్లి జరిగిపోయింది. నీకూ జరిగిపోయింది. అయినా మానిద్దరం పెళ్ళికోసం కాచు కున్న వాళ్ళం కాదుగా. అందుకే పెళ్ళిచేసుకుంటున్నాను. నీకు లక్ష్మిని అప్పగించి నా యిన్సూరెన్సు ఎండార్సుచేసి బ్యాంకి మెకౌంటుకూడా మార్చేసి నేనూ జీవితానికో మార్గం వేసుకోవాలిగా. దానికోసమే యిన్ని మార్పు

లూనూ! యిక్కడ బతికిందే బతుకా? యీలంపటం వొదిలించుకోవాలిగా! నీకున్న బాధకంటే అధికమైన బాధ అనుభవంలో వుంటుంది నాకు. ఇంతకంటే నేనేం చెప్ప నక్కర్లేదేమో చూడు, నా జవాబుతో నువ్వు మనసు మార్చుకోవని ఆశ పడుతున్నానంతే!"

అరుణ చెప్పిన జవాబు విని సుశీల తెల్లబోయింది. మనసంతా వికలంగావుంది. రాత్రి మళ్ళీ ఆలోచనలతో ఆడుకుంది. "ఈలంపటం నుంచి తను బైటపడటానికి, నన్ను యిరికిస్తున్నాడన్నమాట! ఒకచోట 'వొద్దు' అనుకున్న లంపటం యిక్కడ నాకు సంభవిస్తోందన్నమాట! తేడా ఏం వుందీ? అదే లక్ష్మి, అదే అరుణ. కాకుంటే యిది వరలో నేను అరుణతో అప్పగింతలుపెట్టాను; యిప్పుడరుణ నాకు అప్పగించుతున్నాడు. అప్పుడు నేను ఈర్ష్యతో, పెంకి పట్టు బట్టాను. ఇప్పుడు ఆప్యాయంగా, నా అనుమతితో అప్పగిస్తున్నాడు. యింతే విశేషం! యిక నేను పెళ్ళి చేసు కుని బావుకొనేదేం వుందీ? అక్కడా అరుణ మాత్రం, నన్ను వేధించాడా? అలాటప్పుడు అక్కడికేపెళ్ళి, నా బిడ్డనే ముద్దుగా పెంచుకుంటూ వుండటం మంచిదిగా! ఇక, వో నాటికీ పొరపొచ్చాలు మాసిపోయి మేమిదివర్లోఉన్నట్టు కులాసాగా గడపవచ్చునుగా! ఈ అరుణను చేసుకుంటే, రెండో పెళ్ళి చేసుకుందన్న అపవాదొకటి చుట్టుకుంటుం దిగా? అన్నీ మాయ పరిస్థితులే! భ్రమపెట్టే సంఘటన్లే! బతుకంతా, విచారాలపుంతై పోయింది; ఎండమావుల్లాంటి

సుఖాలకోసం యింత గంగవెర్రులెత్తి యిక్కడికొచ్చాను. ఇంతకీ, ఆ చేపల మాదిరిగానో, నెమళ్ళ మాదిరిగానో అయిపోయి, యే అఘాయిత్యాలు చేసుకున్నారో, వాళ్ళు అలా జరక్కుండా వుంటే!" యికపైన సుశీల ఆలోచించ లేక పోయింది; అలా అని నిద్రపోలేదుకూడా.

మెలకువొచ్చినా సుశీల లేవలేక బడలికతోఅలాగే వుండిపోయింది. పదింటివరకూ కాఫీకూడా తాగలేదు. ఆఫీసు వేళకి లేచి కాఫీతాగి "ముందు చెయ్యవలసిందేమిటి" అనుకుంటూ, ఆలోచనలోకి దిగింది. తనకి ఆఫీసు గుర్తుకు రాలేదు. ఆఫీసు లీజరు వేళకి ఒక నిర్ణయం చేసుకుంది, "అరుణని పర్మిషనడిగి, రాజమండ్రి వెళ్ళి, వాళ్ళని చూస్తాద్దాం"అని. అదే విషయం మిస్టరరుణకి తెలపాలనుకుని, లెటర్ రాసింది. ఆ లెటర్ హాల్లో టేబులు మీద ఉంచి కాఫీ చేసుకోడానికి లోపలి వరండాలో కెళ్ళింది సుశీల. ఇంతలో 'ఆమె విషయం, తెల్లారి తెలియలేదు. ఆమె రాలేదు' అంటూ మిస్టర్ అరుణ వొచ్చాడు. అతని రాకలో యేమీ ధ్వనిలేదు. నెమ్మదిగా వచ్చి 'టేబులు దగ్గర నిల్చుండి ఆలోచిస్తూండగా, ఆ లెటర్ కనిపించింది. జాగ్రత్తగా చూసి, "యిది నాకే" అనుకుంటూ తీసి చూశాడు. చివర సుశీల సంతకం వుంది. "నాకు పంపాలనుకొని, ఎవ్వరూ దొరక్కపోడంచేత, ఊరుకుంది కాబోలు." అని మడిచిజేబులో పెట్టుకొని బైటికొచ్చేశాడు. ఆలైనులో ఇళ్ళకి జెనరర్ మానేజరు వెళ్ళడమంటే,అదోవింతవిషయం! తన హోదాకి భంగం. అందుకే,వెంటనే బైటికొచ్చేశాడు.

"సాయంత్రం లక్ష్మిని పంపి, సంగతులు తెలుసుకోవచ్చునులే" అనుకుని, ఆఫీసుకెళ్ళి చీటీ తీసి చదువుకున్నాడు. "జనరల్ మేనేజరుగార్కి—నాకు రాజమండ్రి వెళ్ళవలసిన అవసరం వుంది కనకనూ, ఆరోగ్యం పరిమితంగా లేకపోటం చేతనూ, ఆఫీసుకు రాలేనని తెలుపుతూ, వారం రోజులు సెలవు కోరుతున్నాను సుశీల" వెంటనే, అరుణ సుశీలకి పదిరోజులు సెలవులిస్తూ, ఆర్డరు మిస్సరుణకు పంపించాడు. మిస్సరుణకి విషయం అర్థం కాలేదు. వెంటనే లేచి, మేనేజరు దగ్గరి కొచ్చింది విసురుగా.

మేనేజరు ఆఫీసులో ముసలినౌకరు వెంకన్న ఉన్నాడు. "ఫరవాలేదు" అనుకుని మేనేజర్ని అడిగింది. "బాబూ! సుశీల అప్లికేషను పంపిందా? సెలవు మంజూరు చేశావు!"

"అది నాకూ నీకూ కూడా ఒకే విధి అక్కా! అన్ని విషయాలూ సావకాశంగా చెప్పాలనుకుంటున్నాను. కాని, సమయం దొరకటంలేదు. ఇదిగో ఈ లెటరు చూడు." చీటీ చేతి కిచ్చాడు.

ఉత్తరం చదువుకుని, "నీకు పంపిందా" అనడిగింది.

"లేదు. ఆమె, అసలే అపౌసరపుటాలోచనల్తో మనసు పాడు చేసుకుంటోంది. పైగా ఈరోజు ఆఫీసుకే రాలేదు; బంగళాకీ రాలేదు. నేనే యిందాకా లీజరులో వెళ్ళాను. ఆమె కనిపించలేదు. కాని, ఈ చీటీ కనిపించింది. దాన్ని తీసుకొచ్చేశానంతే."

"అయితే ఆమెని రోజూ చూడవలసినంత నేరం వొచ్చావన్నమాట!"

"దూరం లేదక్కా! బాధ్యత నాదేగా, అదే చెప్పాలనుకుంటున్నాను. కుడియెడమలుగా మమ్మల్ని నువ్వు అర్థం జేసుకోవలసిందే నక్కా!"

"అసలు విషయం దాస్తున్నావ్, బాబూ! ఆమె కిదివరకే పెళ్లైందని విన్నాను. పైగా చంచలమైన మనసు. విస్సహాయగా పడుందని జాలిపడ్డవేగాని, అన్ని విషయాల్లోనూ ముడిపడి నగ్గలేం. ఆలోచించు."

"కాదక్కా! నాతో బంగాళాకిరా; అన్ని సంగతులూ మాట్లాడదాం." అంటూ తను ముందు నడిచాడు. ఆ విధంగా విడుతున్న అరుణల నిదర్శి చూసి, వెంకన్న తాంగ తెల్లబోయాడు. ఆశ్చర్యంతో నోరావులించాడు. "ఆ:ద్దగదీ, ఈరిద్దరూ అక్కా తమ్ముడూను.... ఇంతకాం మెవ్వరికీ తెలనే తెల్దూ! ఈ సుశీలమ్మగోరి సంగతేందో మరి." మనసులో ఆశ్చర్యాన్ని అణుచుకోలేక తికమక పడ్డాడు.

బంగాళా చేరగానే లక్ష్మిని పిలిచాడు అరుణ. "అమ్మా! చూడమ్మా, మా అమ్మా నేను కలిసి తీయించుకున్న ఫోటో, యిటు తీసుకురా తల్లీ!"

లక్ష్మి ఫోటో తెచ్చి యిచ్చింది. మిస్సరుణ ఒక్క-క్షణం చూసి, ఏదో జ్ఞాపకం చేసుకోబోయింది. "ఆc! ఈమె సుశీ లేకదూ? మద్రాసు వొచ్చిన మొదట్లో ఇదే ఆకారం. ఇప్పుడు మారిపోయింది. కాని అయితే, ఆమె ఈమేనా?" ఆత్రంగా అడిగింది.

"ఔనక్కా! ఆమే ఈమె. లక్ష్మికూడా పోల్చుకో లేదు. అంతలా మారిపోయింది; మద్రాసులో రెండేళ్లున్న మూలంగా."

"సుశీల నిన్నెందుకు పోల్చుకోలేదూ?" అనుమా నంగా అడిగింది.

"ఆమె దృష్టిలో నేను యఫ్ఫేమాత్రమే చదివినట్టు. నా ప్రైవేటు పరీక్షల గురించి చెప్పాను కాని, ఆమె నాకు తగినంత ప్రోత్సాహం యివ్వలేదు. పైగా నా చదువునీ, తెలివి తేటల్నీ శంకించింది. యిప్పటికీ ఆమె ఉద్దేశంలో, నేనెక్కడో కోమటి గుమాస్తాగా పనిచేస్తున్నాననే, కాని, యింతటి వాడ్నైతానని అనుకోడంలేదు. అదే వాతావ రణంలో పెరిగే లక్ష్మికి యింగ్లీషు అలవాటౌతుందని కూడా అనుకోడంలేదు. నేను కలకత్తాలో ట్రైనింగుకెళ్లి, పొందిన అలవాట్లు, అమెరికా వాసంవల్ల, నాలో వొచ్చిన మార్పులూ ఆమెకి తెలీనే తెలియవు. అందుకే నన్నుచూసి భ్రమపడు తోంది. నా మార్పునిచూసి నమ్మలేకపోతోంది. లక్ష్మినా గుర్తుపడుతుందేమో అనుకుంటే, మద్రాసులో ఉండటం చేత సుశీలే ముందుగామారిపోయింది. ఇక ఒకర్నొకరు పోల్చు కునే ఆధారాలేవీ? యిదీ కథ."

"ఇన్నాళ్ళూలేని తొందర ఈనాడేందుకొచ్చింది?"

"ఆమెకి హిస్టీరియా ఆవహిస్తోంది. యింకొంచం పెరిగితే, యిక మనచెయ్యి దాటిపోతుంది. అందుకే తొందర పడుతున్నాను."

"బాబూ! నేను పరాయిదాన్నైపోయానా? ఇంత రభసపడ్డావు! యింత హాలాహాలం మనసులో పెట్టుకుని, నీకు నువ్వే కాలిపోతున్నావు! నేనేమీ చెయ్యలేననుకున్నావా? నాయనా! యిప్పుడైనా మించిపోయిందేమీ లేదు. నేను జాగ్రత పడతానులే. ఇక మనసులో బాధపడకు." మిస్స రుణ తమ్ముడికి ధైర్యం చెప్పింది.

సుశీల తన బంగాళాలో కాఫీ కోసం లోపలికెళ్ళి తిరిగి బైటికొచ్చింది. అప్పుడు చూస్తే టేబులు మీద పెట్టిన చీటీ లేదు. మాయమైంది. ఏమైందో తెలీలేదు. చాలా కంగారుపట్టిం దామెకు. "ఎవరికేనా చిక్కితే, చిక్కేనే!" అనుకుంది. హాలంతా వెదికింది. చీటి యేమైనట్టు? మన సులో మొదటి అనుమానం యెక్కువైంది. "యెవరి చేతిలో చిక్కిందో యేమో! లీవు శాంక్షను చేయించు కున్నా, ప్రయాణమై వెళ్ళడం ప్రమాదమేమో! యీ చీటీ ఏ దుర్మార్గుడి చేతిలోనైనా పడితే, నాకేం సంభవిస్తోందో!" ఆలోచిస్తూ వుండగా, ఆఫీసు నౌకరు చీటి తెచ్చియిచ్చాడు. ఆత్రంగా చూసుకుంది సుశీల. అది ఆఫీసు ఆర్డరు! "నీ ఆరో గ్యం సరిగా లేదని తెలియడంవల్ల నీకు వారంరోజులు సెలవు మంజూరు చేయడమైంది." అని.

"సెలవు మంజూరైనంతవరకూ సరిగానేవుంది. కాని, నాకీ సెలవుని ఉపయోగించుకోడానికి వీల్లేదే! యేం చెయ్యాలి? యేమైనాసరే, రాజమండ్రి వెళ్ళి వాళ్ళని చూడాలి యింకా వాళ్ళకి తిక్కకుదరకపోతే, అప్పుడే

చూద్దాం. ఇప్పుడే అరుణ యెదటికెడితే, మనసు మారిపో తుంది, వెళ్లకుండా వుంటేనే మనసుస్థిమితంగా వుంటుంది." అలా ఆలోచించుకుని సుశీల అరుణలిద్దర్నీకూడా చూద్దాని కెళ్ళలేదు. అలా అని తెగించి ప్రయాణమూ చెయ్యలేదు. 'ఆ చీటిని చూసినవాడు, ప్రయాణంలో, కాని చోట దౌర్జ న్యానికి తలపడితే' అని భయపడి ప్రయాణం మానేసి, వారం రోజులూ యింట్లోనే వుండిపోయింది. పోనీ అని మనసుకేనా విశ్రాంతిలేదు.

సెలవు అయిపోయిన వెంటనే డ్యూటీకి వెళ్ళింది సుశీల. ఆమెనిముందుగా మిస్టరరుణ పలకరించాడు. "సుశీలా, నీ ఆరోగ్యం యిప్పుడు బాగుపడినట్టేనా? కావలసుంటుం దేమోనని, నేనే శలవు గ్రాంటుచేశాను."

"మీరు చూపినదయకి కృతజ్ఞురాలినే. కాని, ఆ సెలవు నాకెందుకూ ఉపయోగించలేదు" అంది.

"యే వస్తువూ విషయమూ మనిషికి ఉపయోగ పడదు. మనిషే ప్రతిదాన్నీ ఉపయోగించుకుంటాడు. అందు లోనూ యితరులకి కష్టనష్టాలు కలక్కుండా ఉపయోగించు కోడం మానవత్వం."

"పోనీయండి, అది నాకు చేతగాకనే యీ స్థితి కొచ్చానేమో! ఒక బుద్ధిహీనుడ్ని, బుద్ధిలేనివాడనటంకంటే వాడ్ని బుద్ధిమంతుడ్ని చెయ్యడంకూడా మానవత్వమేమో" తగలాలని విసిరింది రాయిని.

"అదే, ప్రయత్నంలో వున్నాం. తుదీ మొదలూ దొరకడం లేదు. తొందరలో అదీపూర్తి చేస్తాం. దానికేం

బాధలేదు. నువ్వెళ్ళి పనిచూసుకో" సుశీలని పంపించేసి దీర్ఘంగా కళ్ళుమూసుకుని ఆలోచించాడు. "వెంకన్నా! పెద్దమ్మాయిని పిలుచుకొచ్చి, కాఫీ తీసుకురా" ఆర్డరు వేశాడు.

వెంకన్న పిలుపుతో మిస్సరుణ వొచ్చింది.

"అక్కా! సుశీల రాజమండ్రి వెళ్ళలేదు. ఎందుకో భయపడినట్టుంది. ఆమె భయానికి కారణంకూడా పెద్దది కాదు. మొన్న నాన్నగారొచ్చినప్పుడు చెప్పారుగా, మా మామగారు యింటికితిరిగొచ్చి, ఎవరో కుర్రాణ్ణి పెంచు కుంటున్నారనీ! అదేవిషయంలో భయపడుతోంది కాబోలు. యిక, మనం వో పని చెయ్యాలి. రాజమండ్రి బ్రాంచిలో లేబరు ఆర్గనైజేషను సరిదిద్దటం పేరుతో మీకు ఆర్డరు రాసిస్తాను. యిద్దరూ వెళ్ళండి. అక్కడ మా మామగార్ని కలుసుకొని నువ్వుమాట్లాడు. ఆయన పెద్దకోర్టు వ్యవహర్త. ఆయన ఉద్దేశంలో కూడా నేను తెలివిలేనివాణ్ణి. అర్థం చేసుకున్నా మానినా, అభిమానించే వాళ్ళిద్దరు మాత్రమే. ఒకడు ఆర్ట్సు కాలేజీ ప్రిన్సిపాల్, ఇంకొకడు అక్కడ మన కంపెనీలోనే పనిచేస్తున్న జయరామ్. అతడు నా క్లాస్మేటు కూడా. అక్కడ నా తెలివిని మెచ్చుకునేవాడు, బ్రాంచి మేనేజరు నర్సింగారావు....వీళ్లందర్నీ! కూడబలుక్కొనిగాని, లేకపోతే నాకు టెలిగ్రామిచ్చిగాని, సుశీల ఏ అఘాయిత్యమూ చెయ్యకుండా నాకు అప్పగిస్తేచాలు. లేకపోతే ఫోన్లోపిలుస్తే ఆఫీసు కారు తీసుకొని వొచ్చేస్తాను, యేం? అర్థం చేసు

కున్నావా అక్కా. ఈ వుపకారం చేసి నా సొత్తు నాకు చేర్చు" ప్రాధేయపడుతున్నట్టు చెబుతూంటే నోరు పెగల్లేదు. స్థిమితపడి కాఫీలు తాగి లేచారు.

మిస్సరుణ ఆఫీసులో సుశీలను కలుసుకుని ఆఫీసార్డరు గురించి చెప్పింది. "మనిద్దరికీ రాజమండ్రి క్యాంపు వెళ్లే పనిపడింది. సాయంత్రానికి అన్నీ సిద్ధంచేసుకో; మూడురోజు లుండాలి. బ్రాంచాఫీసు లేబరు సెక్షన్నుచూసి, రిపోర్టు యివ్వాలట. రాత్రి మెయిలుకు పోదాం."

"ఈరాత్రే!.... రాజమండ్రి వెళ్ళాలా?.... నేనూ రావాలా?" కంగారుపడుతూ అడిగింది సుశీల.

"ఔను. యేం, అలా గాభరాపడతావ్! మీయిల్లూ అవీ వున్నాయన్నావుగా! వెడుతున్నందుకు అన్నీ చూసొ ద్దాం" చిలిపిగా అడిగింది.

"మా యింటికెళ్ళే యోగ్యత పోయింది నాకు. మా నాన్న యింకో వో కుర్రాడ్ని తీసికొచ్చి పెంచుతు న్నాడు."

"అయితేనేం? ఆడపడుచుగా వెళ్ళచ్చు.పీడేపోయింది. పిచ్చిపిల్లా, వెర్రి వ్రిరి ఆలోచనలూ, అసంబద్ధపు భ్రమ లూను. త్వరగా సిద్ధపడు. మనం హోటల్లో బసచేద్దాం. వైరిచ్చాను లే ఆఫీసులో ఎరేంజిచెయ్యనక్కర్లేదని. ఉద్యోగ రీత్యా వెడతాం, తిరుగుతాం. పనవగానే తిరిగొచ్చేస్తాం. దీనిలో ఒకళ్ళకి భయపడేదేమిటీ? అంతగా వొస్తే నేలేనూ

జవాబుచెప్పడానికి? ఎలాటివిషయంలో సికువీలుగా గౌరవం చెడకుండా జవాబుచెప్పి నెగ్గించుకొంస్తానులే!"

"సరే, మీ రంతగా హామీయిస్తుంటే నే నెందు కాదంటానూ? నేనూ సిద్ధమే" ఉత్సాహంగా ప్రయాణ సన్నాహం చేసింది సుశీల.

## ౩౯

ఆరాత్రి బయల్దేరిన సుశీలా, మిస్సరుణలు తెల్లారి పదకొండు గంటలకి రాజమండ్రిలో దిగారు. వారిని రిసీవ్ చేసుకోడానికి జయరామ్ వచ్చాడు. అతడ్ని చూడగానే సుశీల తెల్లబోయింది. నోట మాటరాలేదు. అతడే పలక రించాడు, "నమస్కారమండీ. కులాసాగా వున్నారా?" అంటూ దగ్గరికొచ్చాడు.

"ఆ, యేదో గడిపేస్తున్నా నంతే. మీరేం చేస్తు న్నారు?"

"నేనా, లేబరు ఆఫీసరుగా అయ్యల్టిడీలోనే పనిచేస్తు న్నాను. ఈరోజు ఆఫీసుకి యిన్స్పెక్షన్ చెయ్యడానికి ఒంగోలు నుంచి మిస్ అరుణగారూనూ, అసిస్టెంట్‌గా యింకొకరూ వస్తున్నారని తెలిగ్రాంవచ్చింది.అందుకే స్టేషనుకొచ్చాను. వారేగా మిస్ అరుణగారంటే!" అడిగాడు.

"ఔను, వారే. వారూ, నేనూ వచ్చామిప్పుడు"

"అలాగా, లేబరసిస్టెంటుగా మీరు పనిచేస్తున్నారా? చాలా గొప్ప పదవిలో కెళ్ళారండీ. మాధవసేవ, నిజంగా" పొగిడాడు.

జయరామ్ యింకా పొగుడుతూ కూచుంటాడేమో నని అతడ్ని వారించేందుకు మిస్సరుణ కలగజేసుకుని పలక రించింది.

"కారేమైనా తెచ్చావా బాబూ? చూడు. యే హోటల్లో మకాం వెయ్యమంటావ్?"

"వరదరావు హోటలు పరవాలేదండి. రిజర్వు చేయిం చాను. కారు సిద్ధంగా వుంది. మీరుదిగి సామాను చూపిస్తే కారులో పెట్టిస్తాను."

అంతా కారులో హోటలు చేరుకున్నారు. ఆఫీసు విషయం అంతగా క్లిష్టమైనది కాదనీ, లాంఛనంగా వోసారి చూసి ఆ ఫైళ్ళన్నీ తిరగేసి తోకలచివర సంతకాలు చేస్తే సరిపోతుందని చెప్పాడు, జయరామ్.

బ్రాంచి మేనేజరు నర్సింగరావుగారు అతిథులకి విం దేర్పాటు చేశారు. మిస్సరుణను చూసినవాళ్ళంతా అంతకు ముందు పనిచేసి వెళ్ళిన అరుణని నెమరు వేసుకుంటున్నారు. ఇదే సుశీలకి విచిత్రంగాతోచింది. తను మద్రాసులో తొలి సారిగా మిస్సరుణని చూసినప్పుడు యెంతగా వింతపడిందో అదేమాదిరిగా వీళ్ళుకూడా ఆశ్చర్యపడుతున్నారు. కారణం యీ మెకేగాని వాళ్లకి ఆ రూపంతో సంబంధం లేదని ఆమె

వూహ! ఎంత ఆలోచించినా ఆమెకు పీళ్లు ఆశ్చర్యపడడంలో భావం తోచడంలేదు. "అచ్చంగా అలాగే వుంది" అనే మాట యెందరో అనడం తనకి వినిపించింది. తననేవాళ్ళు వెక్కిరిస్తున్నారేమోననిపించింది కూడా. అభూతకల్పనగా అనుమానమేగాని ఆరోజు మొత్తంమీద అలజడి లేకుండానే గడిచిపోయింది సుశీలకి.

ఆరాత్రి మిస్సరుణ జయరామ్‌ద్వారా మిస్టరరుణకి టెలిగ్రాం పంపింది. "రేపు వాళ్ళయింటికి వెడతాను. నీవు రాత్రి మెయిలులో బయల్దేరి రావాలి." ఈ విషయం సుశీలకి తెలియనే తెలియదు.

మర్నాడు ఉదయం కాఫీ ఫలహారాలు ముగించుకొని అరుణా సుశీలలు వెంకటాద్రిగారింటికి బయల్దేరి వెళ్ళారు. అసలు సుశీల రానంది. "నీకేం భయంలేదు. నేను సద్దిచెబుతానుగా" అంటూ తీసుకొచ్చింది. ఇంకేంమాటాడ లేక సుశీల కదిలి వచ్చింది.

సుశీల యింటికి చేరుకునేసరికి యెవరో కొత్త వ్యక్తి పద్ధెనిమిదేళ్ళవాను కనిపించాడు. సుశీలనుచూసి ఒక్క క్షణం నిర్ఘాంతపడి తరువాత ఏదో జ్ఞాపకమొచ్చినట్టు "ఆఁ, అక్కయ్యా!" అన్నాడు. అతడి ధోరణి చూసి, "ఇతడే కాబోలు, దత్తుడు" అనుకున్నారిద్దరూ.

"లోపలికిరండి, నాన్నగారున్నారు" ఆహ్వానించాడు మందహాసంతో.

ఇంతలో వెంకటాద్రిగారు కూడా వొచ్చారు. సుశీలనిచూసి తెల్లబోయారు. "నే రాసిన ఉత్తరం అందలేదూ" కొంచం ఒణికాడు.

"అందింది. ఈ వూరు ఆఫీసుపనిమీదొచ్చానుకదాని చూడ్డానికొచ్చాను." తను తీసికట్టు కాకూడదన్నట్టు జవాబిచ్చింది.

"ఏం చూస్తావ్? లోకులు పొడిచివిడిచిపెట్టిన శరీరం మీద యెన్ని తూట్లుపడ్డాయో చూడాలనా?" కంఠం బొంగురుపోయింది.

"నే చేసిన దానిలో తప్పేమీ లేదు. అపార్థం చేసుకుంటే! పెద్దాళ్ళకీ చిన్నాళ్ళకీ ఎందరికని జవాబు చెప్పతాం!"

"కల్లబొల్లి జవాబు లేం చెబుతావు? నీ జవాబెప్పుడో చెప్పేశావు. తోచినట్టు చేసేదాన్నే కాని యెవరిమాటా విననని. కొత్తగా యింకేం చెబుతావు!" మిస్సరుణవైపు తిరిగి ఆమెతో ఫిర్యాదు చెయ్యడం మొదలెట్టాడు. "చూడమ్మా, నీపేరేమిటోగాని నిన్ను చూడగానే మా అరుణే వచ్చాడనుకున్నాను. అచ్చం నీలాగే ఉంటాడమ్మాయ్. అతను తెలివిమాలినవాడుగా కనిపించేవాడు. కాని చాలా మంచివాడు. అలాంటివాణ్ణి కాలదన్నుకొని నానారకాలుగా ఏడిపించి వెళ్ళిపోయింది. పాపం! ఇప్పుడతడెక్కడున్నాడో కాని . "

"అలాగాండి, పాపం! మరి మీరేం చేస్తున్నారూ!"

"అమ్మాయ్! చేసింది తప్పో ఒప్పో తరవాతమాట గాని, మొదట్లో నేనా పెళ్ళికి వొప్పుకోలేదు. నా యిష్టమంది. సరే కానియ్ అన్నాను. కాని, తెలివితక్కువ సంసారంలో వొచ్చే లోటుపాట్లు చూడవలసొస్తుందేమోనని నేను యాత్రల కెళ్ళిపోయాను తిరిగి వొచ్చేసరికి యీమెగారు మద్రాసులో వుద్యోగం : వెలగబెడుతోందట. నాకు అప్పుడొచ్చింది, కోపమను, విరక్తను యేదైనాకాని అంతే, యీ కుర్రాడ్ని పెంపు తీసుకున్నాను. అరుణమీద నాకోపం లేదు. అందుకే సగం ఆస్తి అతని పేర రిజిష్టర్ చేయించాను. అతనెప్పుడేనా రానీ, ఆ విల్లు అతనికి చెల్లవలసిందే. కావాలని పెళ్లిచేసుకుందిగనుక నాకిష్టంలేకపోతే పోయిందని నేనే తప్పుకున్నాను. స్వతంత్రించి పెత్తనం తీసుకున్న పేనులాగ కట్టుకున్న మొగుడ్నే ఏడిపించింది.... యిది మన ధర్మాలకే విరుద్ధంగా నడుచుకుంది. అందుకే అతని పేర సగమాస్తి రాసేశాను. చిన్నపిల్లకోసమసి కాదు. అతనేం చేసుకున్నా సరేనని!" ఆయాసంతో రొప్పుతూ కొంచెంసేపాగిపోయాడు.

"అనోసరంగా ఆయాసపడకండి. పెద్దవాళ్ళయిపోయారు. ఇంకా మీకీదశలో దురవస్థలు తప్పడంలేదంటే అది చాల కష్టమైన మాటే మరి. నాకోమాట వినండి. సుశీలని ఈ చిక్కులన్నిటినీ దాటించి ఆమె కాపరం నిలబెట్టే బాధ్యత నాది. అందుకోస మెలాగైనా మీ అరుణని వెతికి పట్టుకోవాలిగా; ఇక ఆ ప్రయత్నం చేస్తాను. మీరేమీ

దిగులుపడకండి." ఊరడింపుగా అనేసింది. వెంటనే సుశీల వైపు తిరిగి అడిగింది "ఏమమ్మా! యీవూళ్ళోనే ఎక్కడో వున్నాడన్నావుగా! ఎక్కడున్నాడు మీ ఆయన? పద, వెళ్ళి మాట్లాడదాం. అతడి వుద్దేశమేమిటో తెలుసుకుందాం."

"మా దాసీదానికి తెలుసు, ఆయన మకామెక్కడో. ఎక్కడ పనిచేస్తున్నదీ నాకు తెలీదు." చేదుమాత్ర మింగి నట్టు మాట్లాడింది.

"అయితే దాన్ని తీసికెళ్ళి అతని మకాంమీద పడదాం."

పనిమనిషిని పిలిపించి అక్కడికెళ్ళారిద్దరూను. "మీరుండండి, నేనున్నానుగా. అతనుకనిపిస్తే తీసుకొస్తాను" అని చెప్పిందరుణ.

కొన్ని పెద్దరోడ్లూ, కొన్ని చిన్నరోడ్లూ దాటి అరుణ యిదివరకు కాపురంవున్న యింటికెళ్ళారు. ఆ యింటావిడ నడిగితే తెలిసినవివరాలు కొంచం సుశీలని కలవరపెట్టాయి. "ఆయన, చిన్నబిడ్డ యిక్కడ నాలుగునెల్లున్నారమ్మా. అంతలో ఆయన చదువులుజూసి యెక్కడికో తరిఫీదుకి పంపించితే వెళ్లిపోయారు."

"ఆయనెక్కడ పనిచేస్తూండేవారు?" అరుణ అడిగింది.

"ఐ. యల్. టి. డి. పుగాకు కంపెనీలో" ఠాకాలా చెప్పిందామె.

"ఐ. యల్. టి. డి. లోనా?.... అయితే ఆఫీసులో అడగాల్సిందే" అంటూ అరుణ బ్రాంచాఫీసుకి దారితీసింది సుశీల నిర్జీవంగా ఆమెతో తిరుగుతోంది. తప్పదుగా మరి! ఆఫీసులో మేనేజర్ని కలుసుకున్నారు. ఈ విషయంలో ఆయన చెప్పిన జవాబు చాలా పరిణామం తీసుకొచ్చింది సుశీలలో.

"అమ్మా! అదో పెద్ద చరిత్ర. అరుణ అనే ఆయన మొదట అకౌంటెంటుగా చేరాడు. ఆయన అప్పటికి ఎల్. సి. సి., ఎ. సి. ఐ. అనే రెండు కమర్షియల్ పరీక్షలు పేసైనాడు. అతని క్వాలిఫికేషన్సు హెడ్డాఫీసువాళ్ళకి నచ్చాయి. అంతలో ఆఫీసునుంచి ఆటర్నీ వచ్చాడు. అతడు అరుణని యింటర్వ్యూకి పిలిచి, కిందుమీదుగా ప్రశ్న లేసి, అరుణ చెప్పిన జవాబులువిని కళ్ళు తేలేశాడు. ఏం చేస్తాడు? వెంటనే హెడ్ అకౌంటెంటుగా ఆరునెల్లు పని చెయ్యమంటూ ఆర్డరిచ్చి వెళ్ళిపోయాడు. ఆనాడు మాకంద రికీ విందుకూడా చేశాడు. చిన్నబిడ్డ ముద్దుముద్దుగా మా కందరికీ బిస్కట్లూ, స్వీట్సూ యిచ్చింది ..." ఇంతవరకూ కథ విని సుశీల చలించిపోయింది. "ఆ శుభవార్త చెప్ప డాని కొస్తే, నా ఉద్యోగం విషయం చెప్పి ఏడిపించానన్న మాట" అనుకుంటూ కళ్ళొత్తుకుంది.



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RGHBOAE214 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 16/12/23 |
| ముందు అట్ట | Xy |
| వెనుక అట్ట | Xy |
| మొత్తం పేజీలు | 193 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI 189 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rakshitha |
| పేజీలు విడదీసినది | Rakshitha |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |